పళ్లు పరీక్షించిన వీనిపళ్ళవలెనేయుండును. గాని మాంసాహారుల పళ్ళవలె నుండవు. ప్రేగులు వీనిప్రేగులవలె 10 లేక 12 రెట్లు పొడుగేయుండును. మాంసాహారుల ప్రేగులు వాని శరీరములకు 3-5 రెట్లుమాత్రమే యుండును. జీర్ణాశయములోను ప్రేగులయందును స్రవించురసములు మాంసభక్షకజాతువులకు మాంసముయొక్క జీర్ణముచేయుట కనుకూలించియుండును. మనుష్యునకును, కోతికిని పళ్ళు కాయలు జీర్ణము చేయుటకుమాత్రమే తగియుండును. గాన వీనినిబట్టి మనుష్యుడు మాంసాహారి కాడనియు, ఫలాహారియనియు గ్రహించవలెను. (ఫలాహారము నుండి క్రమముగా చిరకాలాభ్యాసముచే మాంసాహారము గూడ అలవాటు చేసుకొనియున్నాడు. అందువల్లనే ఆరోగ్యము పోగొట్టుకొన్నాడు.)

మాంసము జంతువుచచ్చినగాని రాదు. దుర్వాసనగానుండును. అలవాటుపడని మనుష్యులు చూచినంతనే భయోత్పాతముగా నుండి వికారము వచ్చును. మాంసాహారమే ముఖ్యముగు జీవనముగాగల జాతులుగల దేశములయందు సయితము వీనులవెంట బహిరంగముగా మాంసము తీసికొనిపోరు. అనేక విధములఁ బాగుపరచి సుగంధద్రవ్యములగలిపి పక్వము చేసినగాని దుర్వాసన భరింపశక్యముగాదు. ఇతరదేశముల మాట యెట్లున్నను సకలశాక ఫలసస్య సమృద్ధిగల మనదేశమునందు దానియవసరములేక సుఖజీవనము చేయవచ్చును. మాంసము తినువారివలె శాకాహారులు, ఫలాహారులు అంత బలముగలిగియుండరని కొందరి పిచ్చినమ్మకము. మాంసము ముట్టని బ్రాహ్మణులలో బలాఢ్యులెంతమందిలేరు! శాకా

హారియైన ఏనుగు బలమునాదు దేనికిని తీసిపోదుగదా! మాంసాహారులగు జనులకంటె శాకాహారులే అధిక బుద్ధి బలము, శాంతస్వభావము గలిగియుందురుగాన మనుజుడు మాంసాహారికాడు.

ప్రతి ప్రాణియొక్క ఆహారమునైనను నిర్ణయించుటకు ఆయాప్రాణులయందలి పసికూనలను పరీక్షించిచూడుడు. పిల్లిపిల్ల ఎలుకమీాది కురుకును. చిన్నపురుగులబట్టి భక్షించును. ఆవుదూడ పచ్చికను నమలును. పాముపిల్లకప్పనుపట్టుకొనును. చిలుకపిల్ల పళ్లను కొరుకును. పులిపిల్ల మేకపిల్లను అమాంతముగ కొరికి తినును. ఇవన్నియు తమకు భగవంతునిచే నిర్ణయింపబడిన యాహారమును పుట్టుకతోనే గ్రహించి ఆయాహారముకొరకే ప్రయత్నించునుగాని వేరువిధమైన యాహారముకొరకు వెదకుకొనవు. ఇట్టిశక్తినే (Instinct) జన్మాంతరజ్ఞానమందురు. ఇది నేర్ప నక్కరలేకయే గల్గును. పాలు విడచునప్పటికి తమకు స్వభావసిద్ధమైన యాహారమును అవే సంపాదించుకొనును. ఇక మనుష్యులపిల్లలను జూడుడు. అన్నప్రాశన రోజున పండ్లు మాంసము మొదలగునవి ఎదురుగానుంచిన పక్షమందు ఏవి తినుటకు ప్రయత్నించునో చూడుడు. మాంసమును చూడనైనను చూడరు. చూచి భయపడును. పండును వెంటనే నోటబెట్టుకొనును. 5 లేక 6 సంవత్సరముల బిడ్డలుకూడ తమ తల్లిదండ్రులచే బోధింపబడకున్న మేకపిల్లను కొరుకొనితినవలెనని ప్రయత్నింపరు. మేకలోనిమాంసమే తమకు తినుటకు పెట్టినారన్నసంగతియే యెరిగియుండరు. ఇట్టి సంగతులనుబట్టి మనుష్యుడు మాంసాహారికాడని నిర్ణయింపనగును.

మాంసాహారులు కాని జాతులలో కూడ అనారోగ్యము లేక పోలేదు. దీనికి కారణము స్వభావసిద్ధముగా ప్రకృతియందు దొరికి మనుష్యాహారముగా సృష్టింపబడిన పదార్థములనైనను ప్రకృతియందు దొరకినట్లు భుజింపక, రుచుల దేవత నారాధించుటకొరకు పక్వపరచియు, ఉప్పు, కారము, పంచదార, పరిమళద్రవ్యములు చేర్చి తైలమునందువేసి, వానికి లేనిరుచుల గల్పించి తినుటచే వీనిని జీర్ణము చేసికొనుటకు తగురసములు మన జీర్ణకోశములందు లేక సరిగా జీర్ణములుగావు. ఉండవలసిన కాలముకంటె అధికకాలము జీర్ణకోశమునందుండి, పులిసి, బురబురపొంగును. అందువల్ల గలిగినవేడిచే అవయవములు తమశక్తిని గోల్పోవును. ఇంతేగాక రుచికల్పనచే జిహ్వేంద్రియము సహజశక్తిని గోల్పోయి యధికముగా లోనికి జొరనిచ్చును. వీనిని జీర్ణముచేసికొనుటకు సదా పనిచేయు జీర్ణకోశము విశ్రాంతినెరుగక కొలదికాలములోనే చెడుచున్నది. ఇక జీర్ణకర్మ సరిగా జరుగక తినెడు పదార్థమంతయు అన్యపదార్థమేయగును. పూర్వమువలె స్వల్పపదార్థమునుండి తనకు గావలసిన యాహారమును తీసికొనలేదు. అందుచే విశేషముగా తినవలసివచ్చును. తినిన దానిలో గొప్పభాగ మన్యపదార్థమై శరీరశక్తిని తెరచి అనారోగ్యమును గలిగించును. గాన శాకఫలాహారములనైనను కృత్రిమపద్ధతులచే మార్చి తినుటచేతగూడ ననారోగ్యము గలుగుచున్నది.

అనేక తరములనుండి మనుష్యుడు పక్వాహారభక్షణము చేయుచుండిన హేతువుచే అపక్వాహారమే మనుజుని కేర్పడిన తిండి యని చెప్పిన నూటికి తొంబది తొమ్మండుగురు నవ్వుదురు.

అయినను మనుజజాతియొక్క ప్రస్తుతస్థితిని బట్టికూడ నిప్పు టికే ఆరోగ్యము చెడియున్నదనియు, పూర్తియగు మార్పు జరుగకున్న నచిరకాలములోనే యంతరించునట్టి స్థితికి రాగ లదనియు తోచుచున్నది. పాశ్చాత్యపండితులు అనేక పరిశోధ నలచే అపక్వాహారమునందే జీవసత్తులు గలవనియు, వీనిని సజీవములుగనే భుజించవలెననియు నిర్ణయించియున్నారు. ఈ సిద్ధాంతమును పండితులు బోధపరచుకొనుచున్నారుగాని చిరకాలాభ్యాసమును వదలలేకయున్నారు. మనోనిగ్రహము కలవారు కొందరు (వేయికొక్కరు) ప్రకృతితత్వమును గ్రహించి వంటలేని సహజాహారమును దినగోరినను మూర్ఖులు వారిని నిందించియు, రాకుసిపట్టుపట్టి వారిని తిరిగి పూర్వపు తప్పుడుతిండికి మరలించెదరు. ప్రపంచమంతయు రోగభూయి ష్ఠమై యున్నందున నిత్యము వైద్యసేవయు, మందుల సేవిం చుటయు దప్పుటలేదు, సరిగదా అనారోగ్య మెప్పటియట్లే యున్నది. అందువలన కొద్దిమంది అపక్వాహారులు బయలు దేరిరి. వీరుకూడ తమరు తీసుకొను అపక్వాహారమే సత్యమైన తిండియని గ్రహింపక ఎప్పుడు తిరిగి పూర్వపుతిండికి మరలు దుమా యని చూచుచు కొంచె మారోగ్యము గలుగగానే వైద్యుల దుర్బోధచేతను, భార్యయొక్కయు, బంధువుల యొక్కయు, నితరసంఘముయొక్కయు బాధల పడలేకయును, జిహ్వాచాపల్యముచేతను తిరిగి మామూలు పదార్థములనేతిను చున్నారు. నిష్పక్షపాతబుద్ధితో విచారించిన ప్రస్తుతము మాన వులు తినుతిండి సహజమైనది కాదనియు, అసహజమైన తిండి తిని ప్రకృతిమాతను ధిక్కరించుటచేతనే లోకమంతయు నిట్టి

దుస్థితిలో నున్నదనియు దోచకమానదు. ప్రకృతిమాత దయా శాలినియైనను తన శాసనముల మీరినవారియందు జాలిలేక తగు శిక్ష విధించకమానదు. ఆశిక్షచే అనారోగ్యము,రోగము, అకాలమరణము, ఆయుఃక్షీణము, వికృతాకారము, అంత కంతకు పీలయగుట తుదకు నేలములగ చెట్టునకు నిచ్చెన వేయునట్లు జనసంతతి మారుటయు తటస్థించుచున్నవి. వీని కన్నిటికిని గారణము అసహజాహార సేవనఁ జేయుండ దానిని గ్రహించలేక బాల్యవివాహములని కొందరును, తగినంత సత్తువనిచ్చు నాహారమును విస్తారముగా తినకపోవుటయని మఱికొందరును, మరి పెక్కు విధముల సమాధానము చెప్పె దరు. సహజాహార సేవవలన యుక్తవయస్సు గాకుండ కామముపుట్టదు. దుష్టసంకల్పములు గలుగవు. రోగములెక్కు వగానుండుట తిండి యెక్కువగాను అధికబలమైనదిగాను తిను భాగ్యవంతులయందే గానఁనగును. తక్కువతిండిచే రోగము గలుగదు. ఆయుఃక్షీణమును గాదు. శక్తిహీనముకూడ గలుగదు. పాటుపడు కూలీలయందే బలమైనవారును, చాలకాలము బ్రతుకువారునుగలరు, వీనినన్నిటినిబట్టి మనుష్యుఁడు సహజా హారిగా మారక యారోగ్యమును బొందలేడు. గాన సహజా హార మెట్టిదో నిర్ణయించవలెను. సమస్తమైన జీవకోటికిని తాము నివసించు ప్రదేశమునందు కావలసినంత యాహారము లభించుచున్నది. అట్లె మనుష్యునకును దాను నివసించు ప్రదేశ మునందు విశేషశ్రమ లేకుండ - నేకాలమం దేశాకములు, పండ్లు దొరకునో అవియే సేవింపవలసిన సహజాహారములని చెప్పవలసియుండును. మిక్కిలి శీతలదేశములందు చెట్టుచేమలు

బయలుదేరవు. అవి నివసించుటకు తగినవికావు. గాన వానిని విడచి సస్యసమృద్ధిగల తావులయందే మనుష్యులు చేరియున్నారు. ఈ ప్రదేశములందు గూడ సహజముగ బెరుగు శాకములను ఫలములనేగాక నితర ప్రదేశములందుఁ బెరుగు వానిని తమ తెలివితేటలచే పెంచుచున్నారు. ఇట్టి పదార్థములుకూడ అసహజములనియే చెప్పవలెను. మనుజుని నాగరికతతోపాటు సస్యములు, పండ్లు, మనుష్యులు తిను జంతువులు పూర్తిగా మారియున్నవి. ఉష్ణప్రదేశములందు పెరుగువానిని శీతల ప్రదేశములందును, శీతలప్రదేశములందు పెరుగువానిని ఉష్ణప్రదేశములందును పెంచుచున్నారు. శీతకాలపు పంటలను వేసవియందును, ఒక కాలమునందే పండువానిని సాంవత్సరము పొడుగునను పండించుచున్నారు. ఇట్టి విపరీతసృష్టి ప్రకృతి విరుద్ధము గాన నిట్టివి పనికిరావు. సృష్టియందు వేసవి కాలములో దొరకు పండ్లు, కూరలు మొదలగున వన్నియు వైద్యసిద్ధాంత ప్రకారము వేడిచేయునవియు, శీతకాలము నందలివి చలవజేయునవిగా నున్నవి. అవి అట్లయుండుట ఆరోగ్య దాయకముగాని ప్రకృతి విరుద్ధముగ వానిని మార్చుట గాదు. ప్రకృతియందు లభించు వస్తువులను పచ్చివిగా, అవి దొరకు కాలములయందు మాత్రమే సేవించుట ధర్మము. ఇంతమార్పు జరుగుటకు గొన్ని శతాబ్దములుపట్టును. అందువలన క్రమముగా సహజాహారమునకు మార్చవలసి యున్నది. అందుచే కొన్ని మార్పులతో సహజాహారమును సేవించుటకు అంగీకరించ వలెను.

## ౯ వండిన పదార్థములు

చిరకాలము నుండి వండిన పదార్థముల దిగుటచే మనుష్యుని యవయవములును వానిపాటవమునుదప్పియున్నవి. తిరిగి వానిని బలముగల వానిగజేసి యవి నెరవేర్పవలసిన పనులనుతగినట్లు నెరవేర్చునట్లుచేయుటకుగాను ప్రస్తుతమందు కొంత మాటతప్పదని తోచుచున్నది. మనోనిగ్రహము గల వారికే యుద్ధాకులు సాగవు. గాని మనోనిగ్రహము గల వారరుదు. అందుచే వంట తప్పదు. ముఖ్యముగా దంతములు, పళ్ళుబలహీనములై యున్నవి. కోతులవలె పచ్చికాయలను కొరికి తినుటకు తగినంత బలము వీనికి పోయినది. చాల మందికి యౌవనముందే పళ్ళూడి పోవుచున్నవి. తిరిగి ఆహార పదార్థముల దెచ్చుకొను శక్తియు తగ్గియుండును. కాన వంట విరివిషయమందు కావలసియున్నది. శట్టి వారినికూడ సహజాహారులనుగ మార్చవలెనన్న కొంతవరకు వంట అక్కర లేకుండ రుచించుపండ్లును, వండిన ఆకుకూరలును, శాకములును, గోధుమవంటి ధాన్యమును, పప్పుదినుసులును వండి తినవలెను. మనము తినవలసిన పదార్థములను వేరువేరుగా తెలిపెదను. ధాన్యము లన్నిటిలోను ఉత్తమమైనవి గోధుమలు. వీనిని పొట్టుతోకూడ విసరి రొట్టెగాను జావగాను అన్నముగాను వాడనగును. కూరగాయలను ఏకాలమునందు దొరకు వాని నాకాలమందు ఉపయోగించ వలెను. వీనిపై బెరడు తీయకూడదు. వండుటలో చాల నీళ్ళుపోసి ఆనీటిని పారవేయకూడదు. ఇగురుటకు తగినన్ని నీళ్లను మాత్రము చల్లి సన్నసెగను మగ్గనివ్వవలెను. ఇంకను

కొంచెము నీరున్నట్లుగున వరిపిండిగాని గోధుమపిండిగాని చల్లి ఇగర్చవలెను. అంతేగాని వానికి ఉప్పుగాని, పోపుగాని చేర్చరాదు. ఆవిరిమీద ఉడికించిన యెడల బాగుగ రుచించును. పచ్చి పచ్చడులుకూడ నుపయోగింపనగును. ప్రతి భోజనమందును నిమ్మకాయగాని దాని తరగతిలోచేరిన పుల్లని రసముగల మరి యేకాయగాని వాడవలెను. అవసరమైనప్పుడీపుల్లని రసములు కూరలయందును పచ్చడులయందును జేర్చనగును. పులుపు నందు ఆహారమును జీర్ణముచేయు గుణముగలదు. పులుపు దాహమణచును. మనవారు ఆద్యాంతములవి చెప్పు నేతి మజ్జిగలతో నేమియు పనికి లేదు. పులుసు, చారు మొదలగు ద్రవపదార్థములుకూడ వదలతగ్గవే. గోధుమలు మాత్రమే తినదగినవైనను ఉష్ణదేశములందు పండెడు వరిధాన్యమును జొన్న మొక్కజొన్న మొదలగు నవియును కూడ వాడవచ్చును. అన్ని ధాన్యములలోను వరి సత్తువ లేనిది. దీనిని మరలయందు తెల్లనిబియ్యముగా చేసి వాడుచున్నారు. దీనిలో సత్తువగలతవుడు తీసివేసినగాని తెలుపురాదు. ఆ బియ్యమునుకడిగి అన్నమువార్చి తినుటచే నిస్సత్తువయైన అన్నము మనకు లభించును. ఇది దేహపోషణకు పనికి రానందున పెక్కురోగములు గలుగుటకు కారణమగుచున్నది; గాన తవుడు గల చేబియ్యము వాడవలెను. గంజి వార్చక అతీసరు పెట్టవలెను. మరబియ్యము నందు ఆరోగ్యము లేదు. మరలవేడిచే కొంతవరకు పచనకర్మ జరుగును. గాన తిరిగివాడుటచే ననారోగ్యమగును. దంపుడు బియ్యమే తినదగినవి. పప్పుదినుసు లన్నియు దినవచ్చునుగాని

గింజలపై పొట్టుతో వాడవలెను. పొట్టునందు పోషక పదార్థమంతగా లేనిమాట సత్యమేయైనను ఆపొట్టు ఆహారపదార్థములను అరిగించి ప్రేగులకు మలమంటుకొనకుండ జార్చుటయందు మిక్కిలి తోడుపడును. సరిగా విరోచనమగుటకు బలమైన పదార్థములతో బాటు కొంత పనికిరాలిన చెత్త కూడ అవసరమే. ఈపొట్టులును, కూరగాయలమీది బెరడును, పిప్పిపదార్థమును ప్రేగులను శుభ్రపరచి విరోచనమును జేయుటయేగాక తాముకూడ శరీరములో నిలువక మలముతో పోవుచుండును. విరోచనము జారీగా అగుటకు మనకు గొంచెె ఇసుకరేణువులుకూడ గావలసియున్నవి. ప్రకృతియందివి కాయల బెరడు నంటియుండును. కడిగినను పోవు గాని బెరడు తీయుటచే బోవును. ధాన్యములందు పొట్టుతో జేరియుండును. పచ్చితిండి తినువారీ ఇసుకగలబెరడుతోను, పొట్టుతోను తిందురుగాన నతి సులభముగ వారికి జీర్ణమగును. వండుకొని తినువారికి ఇసుక లభించదు. గాన సముద్రపుఇసుక కొంచెము ప్రతిభోజనానంతరమును మ్రింగవలెను. నాలుకపై డబ్బెత్తుఇసుకను వేసుకొని ద్రవముతో గలియునంతకు ఆగి మ్రింగవలెను. పచ్చితిండి తినువారికి ధాన్యములతోను పప్పులతోను అవసరములేదు. సర్వకాలములయందును, రుచ్యములును శరీరపోషకములును అగు ఫలములును శాకములును దొరకును. పప్పుదినుసులును లేతవిగానున్నప్పుడు తినుట కనుకూలముగనే యుండును. అట్లే జొన్నలును, మొక్కజొన్నలును లేతవిగ నుండిన తినుట కనుకూలములే. వంటతోబాటు పండిన పంటలను నిలువజేయుటయును

అవసరమగుచున్నది. ధాన్యములతో పనిలేక సుఖముగా జీవించుట కేకొరతయును లేదు. ధాన్యములను తినవలసినపుడు గోధుమలను, మొక్కజొన్నలను, పప్పుగింజలను నానబెట్టి, మొక్కలు మొలపించి, ఖద్దరు గుడ్డమీద ఆరనిచ్చి, వానిని, కొబ్బరితోను, వేరుశనగతోను, ఫలములనుగూడ జేర్చుకొని సేవింపవచ్చును.

పచ్చివస్తువులలో నెంత లేతవస్తువులను దినిన నంత ఆరోగ్యము వృద్ధిచెందును. ఏలయన నివి బహులేతగనుక జీర్ణమగును. పళ్ళలో దోరగాయలు ముగ్గినపండ్లకంటె మంచివి. పచ్చికాయలు కడుపునొప్పిని బుట్టించుచుండును. మన ప్రేగులయందు జీర్ణముగాక, పైకివెడలిపోక యుండు దుష్టపదార్థము చేరియున్నపుడే పచ్చికాయల తమశోబాధ దానినిగూడ జీర్ణముజేసి మిగిలినదానిని మలముగా త్రోసివేయ బ్రయత్నించును. అందుచే బిగుసుకొనిపోయిన మలమును జార్చుటకు ప్రేగులు విశేషప్రయత్నము చేయవలసి యుండుటచే కడుపునొప్పియు, నీళ్లవిరోచనములును గలుగును. ఈ క్రియచే కడుపునందలి దుష్టపదార్థవిమోచన మగును గాని దోషము కాదు. పండ్లన్నియో రుచిగా నుండుటచే నధికముగా తినుట సంభవించును.

అందువలన బహులేతగా నున్నప్పుడును, పండుటకు సిద్ధముగా నున్నప్పుడును సమస్తకూరగాయలను వాడనగును. సృష్టియందలి పదార్థములన్నియు తినుటకు పనికిరావు. అందు మనుష్యునికొరకు కొన్నియు యితరములగు జీవరాసుల

కొఱకు మరికొన్నియు సృష్టింపబడినవి. కాన నేవస్తువులు సహజముగ దినుటకు రుచింపునో వానినే మనము తిన దగును. ఈ కూరగాయలే వండి తినినను ఆరోగ్యము నిచ్చునుగాని, స్వతస్సిద్ధముగ చేదుగనుండు కాకర, చేదుపొట్ల, ఉస్తి మొదలగు కాయలును, దురదగనుండు కంద, నల్లేరు మొదలగునవియు, వగరుగనుండు నవియు, కారముగనుండు నవియు నైనశాకములు వండినను అంత యారోగ్యము నీయజాలవు. గాన నవి మఱికంతగా దినుటకు బనికిరావు. ఈవస్తువులను దిను విధము ముందు వివరించెదను. అనుభవము గలవారికిగాని తదితరులకు ఇట్టిితిండి మనుష్యుడు తినవలెనని తెలిపిన వింతగా నుండక మానదు. వైద్య సాంప్ర దాయులకును రసాయనిక శాస్త్రజ్ఞులకును గూడ వింతగా నుండును. శాస్త్రజ్ఞుల కీతిండిని బోధించిన యెడల వారు పరిహసింపక మానరు వారిశాస్త్ర ప్రకారము శరీరమునం దేయే పదార్థములున్నవో అవి వృద్ధియగుటకుగాను ఆయా పదార్థములు గల వస్తువులను దినుటయే కర్తవ్యము గాని పచ్చికాయలును, రుచిలేని వంటలు, ఉప్పు, కారము, సున్నము, లోహములు లేని పదార్థములు గల భోజనమెట్లు మనుష్యుడు జవసత్వములు కలిగి జీవించుట కుపయోగించునో తెలియ జాలరు. ఈశాస్త్రజ్ఞులకు నేను చెప్పుసమాధానమిది. మనుష్యుడు తన తెలివిచే అనేక పరిశోధనల జేసి పెక్కుశాస్త్రములను గనిపెట్టియున్నాడు. చచ్చినశవము లన్నిటిని కోసి శరీర మందలి వేరువేరు అవయవములను అవి చేయుపనులను కనిపెట్టి తినెడి వస్తువులయం దిమిడియున్న పదార్థజాలమును రసాయనిక

శాస్త్రప్రకారము కనుగొని ఏవేవి ఎంతెంతకలిపిన శరీరము
నెట్లు పోషింపగలవో తెలిసికొని కృత్రిమాహారములను
గల్పించి ప్రకృతిని ధిక్కరించితిమని సంతోషించు చున్నాడు.
ఫలితమును జూచినపక్షమున సహజాహారమును తిని జీవించు
పశుపక్ష్యాదులు నీరోగులై దీర్ఘాయుర్దాయము గలిగి
యుండుటయు, మానవకోటి యారోగ్యము చెడి నిరంతరము
రోగములచే పీడింపబడి యల్పాయుర్దాయ వంతులగుటయు
వీరి పరిశోధనలన్నియు సత్యములు గావనియు, సర్వజ్ఞుడగు
పరమేశ్వరుని మహిమల గనుగొనుటకు మనుష్యమాత్రు
డెన్నటికిని శక్తిమంతుడు గాజాలడనియు దెలియగలదు. నిన్నటి
సిద్ధాంతములు నేడబద్ధమును, నేటిసిద్ధాంతములు రేపబద్ధము
లగు చుండుటయు, పూర్ణత్వ మెప్పటికిని లేక వృద్ధియగు
చుండుటయు, మన కించిజ్జ్ఞత్వమును బోధపరచును. నాగరికత
వృద్ధియయిన కొలది శాస్త్రజ్ఞాన మధికమగు చున్నదని మన
మెంత సంతోషించినను నిజమున కెన్నటికిని మార్పులేని గాన
మార్పుజెందు శాస్త్రములన్నియు సత్యములుగావని తెలియ
వలెను. గ్రుడ్డివాండ్రేనుగుయొక్క వర్ణనయందు దెబ్బలాడి
నట్లు నేటిశాస్త్రజ్ఞులును దెబ్బలాడుచు రేగని తత్త్వము వారికి
తెలియదని చెప్పవలయును. మొన్న మొన్నటి వరకు నారింజ
కాయ జలుబుచేయునను సిద్ధాంతముపోయి నేడు సర్వరోగము
లందును నారింజకాయ పథ్యమైనది. కొన్నాళ్లు కలరాగాలివల్ల
వ్యాపించుచున్నదను సిద్ధాంతముపోయి నేడు నీటివల్ల వ్యాపించు
చున్న దనుచున్నారు. మసూచికము, టీకాలు, సర్వవ్యాధుల
మీద పనిచేయు ఇంజక్షనులు నేడు శాస్త్రజ్ఞులచే నిషేధింప

బడుచున్నవి. ఉడికిన వస్తువ్రనేగాని తినకూడదన్న సిద్ధాంతము పోయి వండిన మెడల విటమినులు చచ్చిపోవునుగాన పచ్చి వస్తువులే తినదగినవను సిద్ధాంతము వ్యాపించుచున్నది ఇక ముందెట్టి సిద్ధాంతములు రానున్నవో తెలియదు. మరియొక సిద్ధాంతము బయలు దేరువరకు నిజమై, తరువాత అబద్ధమగు సిద్ధాంతముల నెట్లునమ్మగలము?

మన కాసిద్ధాంతములతో పనిలేదు. పశుపక్ష్యాదులవలె సృష్టియందలి వస్తుజాలములో నాకు కంటికిని ముక్కునకును నాలుకకును ఇంపగు వస్తువులను మరియు కావలసినంతే తినుటయు, ఆకలియయినపుడు భుజించుటయు, దాహమైనపుడు మంచినీళ్లు మాత్రము త్రాగుటయు మనము చేయవలసిన పని. ఇంతకంటె శాస్త్రజ్ఞానముతో పనిలేదు. ఆకలి యగునపుడు సమస్తపదార్థములును రుచిగానేయుండును. ఆకలిగానపుడును, వస్తువు రుచించకపోయినను మనదేహమున కాహార మక్కర లేదని గ్రహింపవలెను. ఇదివరకు మనము చాలకాలమునుండి రుచులకలవాటుపడి యుండుటచే ఉప్పు, కారము, పొగుపు, సువాసన ద్రవ్యములు చేర్చని వంటకములుగాని, పచ్చి యాహారము గాని వెంటనే రుచించవనిమాట సత్యమే. అసహజ మైన యీ వంటకముల కలవాటుపడిన జిహ్వామీద నొక విధమైన గారిపట్టి యుండును. అందుచే సునిశితమైన దాని జ్ఞానము చెడియుండుటచే నది సహజమైన యాహారము నందలి రుచిని గ్రహించలేదు. కాని కొద్ది రోజులలో జీర్ణకోశము బాగుపడినపుడు తిరిగి దానిశక్తి దానికి రాగలదు. అప్పుడు ప్రతివస్తువును రుచిగానే యుండును. ప్రపంచములో మనము

తినుట కేర్పడిన సమస్తవస్తువులు నేదోయొక రుచినికలిగి యున్నవి. ఆరోగ్యవంతున కారుచి తగినంత సహాయముగా నుండును. ఆరోగ్యము చెడినవారి కవి రుచింపవు. ఉప్పు కారములు మొదలగునవి చేర్చినగాని వంటకములు లోపలకు పోవు. అట్టి సమయములందు లంకణముండుటగాని నైచినంత మాత్రమే తినుటగాని యవసరము. ఆరోగ్యము గలుగునంతవరకట్లు తినిన నారోగ్యము కలుగగానే ఆకలియును, రుచియును, తిరిగి కలుగును. జ్ఞానములేని పశుపక్ష్యాదులవలె జ్ఞానముగల మనుష్యుడు కూడ వాటలేకుండ వివిధములైన రుచులు గల్పించుకొని తినకుండ పచ్చియాహారమును దినుటయు, పండుగలకును, శుభకార్యములకును అనేకములగు పిండివంటలతో సంతర్పణలు చేయకుండ నుండుటెట్లు? టీపార్టీలు, విందులు, వింతవింతరకముల వంటకములు ఏమి కావలసినది? యని ప్రశ్న రాకమానదు. ఆరోగ్యమునుగోరువారెల్ల నాగరకతకు నమస్కరించి ప్రకృతికి తిరుగవలసిందే. ప్రకృతిమాతయొక్క శాసనము లనుల్లంఘనీయములు. శాసనములమీరి నడచువారి నామె నిర్దయతో దండింపకమానదు. ప్రస్తుత నాగరకతయం దారోగ్యమునకు తావులేదు. ప్రకృతియందు ఆహారము శరీర పోషణనిమిత్తమేగాని గొప్పకొరకును, రుచులదేవత నారాధించుటకును గాదు. అందువల్ల నారోగ్యమును గోరువారి కొరకే ప్రకృతి సంబంధమగు ఆహారమునుగూర్చి చెప్పుచున్నాము. తప్పనడత నడవవలెను. శిక్షయుండకూడదనిన ప్రకృతిమాత లంచగొండికాదు. ఈ యాహారమెట్లు నోటికి పొసగునని యాలోచింప నవసరము

లేదు. చిరకాలాభ్యాసముచే గ్రహించియు, నధిక జ్ఞానము గలిగి దైవసమానులగు కూనేమహర్షి వారి తత్వవిచారణచే గలిగిన స్వల్పజ్ఞానముతో పై ప్రశ్నకు సమాధానము చెప్పుచున్నాను.

"పైత్యరోగికి పంచదారయు చేదగునట్లు అజీర్ణముగల వారి కెట్టి యాహారమును రుచింపదు. ఆరోగ్యవంతునకు ఆకలిని తృప్తిపరచుట కెట్టి యాహారమైనను రుచిగానే యుండును. రుచియను ది పేరుగాని నిజముగా లేదు. ఒకేవస్తువు వేరు వేరు సమయములందు వేరువేరు రుచులు గలదిగ గనబడును. ఎట్లన పంచదార తినినవోటికి ఉరటిపండు చప్పగానుండును. నారింజకాయ తిన్ననోటికి పంచదార యంతతియ్యగానుండును. గొల్లవాడొకడు ఉసిరికకాయ తిని నీళ్లుత్రాగగా తియ్యగానుండెనట. వాడు తాను త్రాగిన కాలువలోని నీరు తియ్యగా నుండెననుకొని తన కావడిలోని పాలనుపారబోసి ఈ నీళ్లను పట్టుకొని వెడలెనట. అట్లే అధికరుచుల కలవాటుపడి జీర్ణకోశము చెడుటచే నాలుక తన సహజమృదుత్వమును రుచుల గొను శక్తిని బోగొట్టుకొని యున్నది. అందువలన సహజమైన శాకాదులయందలి రుచుల గ్రహించజాలకున్నది. ఉప్పు కారముల మాని రుచులగల్పించకుండ నొక నెల రోజులు తినిన యెడల జీర్ణకోశము బాగుపడి నాలుక తన సహజశక్తిని సంపాదించుకొనును. అంతటినుండి ప్రతివస్తువును రుచిగానే యుండును. ఆకలి తీరువరకు తినుటకు తగు రుచి గలిగి యుండును. అధికముగా లాగలకుపోదు. ఆమనుష్యు వకే నేడు కొంచెము ఉప్పుచేర్చి వస్తువులకధికరుచి గల్పించి

తినుచుందుము. ఆరుచి చిరకాలముండదు. దానికలవడిన నాలుక మరి కొంచెము ముప్పును గోరును. ఇట్లే కొద్దికాలములో విశేషరుచులు గావలసి యుండును. శీతోష్ణములు సుఖదుఃఖములు మొదలగు ద్వంద్వములవలెనే రుచికూడ మితిలేనిది. ఆకలి తీరుటకు రుచితో నిమిత్తములేదు. ఇట్టి యాహారము శరీరపోషణ కుపయోగించునా? వైద్యశాస్త్రజ్ఞులు మనుష్యాహారమందు పిండిపదార్థములు, మాంసకృత్తులు, క్రొవ్వుపదార్థములు, ఉప్పులు, లోహములు, సున్నము, మొదలగునవన్నియు వానికేర్పడిన పరిమాణము ననుసరించి యుండనిచో శరీరపోషణము జరుగదనియు, ఒకవేళ కూర్చుండి తినువారికి సహజాహారము సరిపోయినను కష్టించి పనిచేయు కూలివానికి పుష్టి నివ్వజాలదనియు సందేహము దోచనగును. అట్టి సందేహమునకు తావులేదు. మనశరీర రక్షణకేపదార్థములు కావలెనని వైద్యశాస్త్రజ్ఞులు కనిపెట్టిరో, ఆపదార్థములే కోతి మొదలగు జంతువులకెల్ల గాకలసియున్నవి. మాంసకృత్తులు, క్రొవ్వులు, ఖనిజములు మొదలగు పదార్థములెల్ల వాని శరీరములందును గలవు. అవి తిను ప్రకృతియాహారము వల్లనే సమస్తపదార్థములును వాని శరీరమందేర్పడి కావలసినంత శక్తినిచ్చుచు వానిని ఆరోగ్యవంతములుగ జేయుచున్నవి. ఈ జంతువులకు శాస్త్రజ్ఞానమేమియు లేదు. ఏయే పదార్థములు చేర్చి తినవలెనో దేని తూనిక యెంత యుండవలెనో యనునాలోచనయే యవి యెరుగవు. అట్లే మనుష్యులకూడ శాస్త్రవేత్తల పరిశోధనలచే దినదినాభివృద్ధి నొందుచున్న జ్ఞానముతోగాని వేర్వేరు పదార్థ

ములు కలిపి తినవలెననియు వాని కొకదానికొకటి యిన్ని రెట్లుండవలెననిగాని తెలిసికొనవలసిన యవసరము లేదు. మన శరీరమందు మాంసకృత్తులు మొదలగు పదార్థము లున్నవి. కండరములు వేరుపదార్థములుగలవి. ఎముకలు వేరుపదార్థములుగలవి. ఈపదార్థములెల్ల పండ్లను కాయలను తినుటచేగాని, ఉప్పుకారములు, మాంసము, గుడ్లు, పాలు మొదలగునవి తినకపోయిన నీవివిధ అవయవములెట్లు వృద్ధినొందునని మీకుతోచవచ్చును. దానికిని ఇదేసమాధానము. పశు పక్ష్యాదులన్నిటికిని కండరములు, ఎముకలు, చర్మము, మాంసము, వెండ్రుకలు గలవు. అవి యన్నియు వానికి వృద్ధి పొందుచున్నవి. అట్లే మనకును వృద్ధిపొందగలవు. ఎట్లన మనజీర్ణ కోశము జీవముగల అవయవములు గలది. హృదయము పిత్తాశయము (Pancriatis) వృక్కకము మొదలగు అవయవములు తమలోనికి వచ్చిన పదార్థములను శరీరమున కుపయోగించు పదార్థములుగ తయారు చేయుశక్తిగలవి. అందుచేతనే పచ్చగడ్డిని మాత్రమే తిను ఆవునకు దాని శరీరపోషణ గలుగుటయే గాక, పాలు ఊరుచున్నవి. ఎద్దునకు ఊరవు. ఏనుగు శాకాహారియైనను అధిక బలముగలదగుచున్నది. ఇట్లే పిల్లియు పులియు అవితిను మాంసాహారమునుండి సర్వావయవ పోషణకుదగిన పదార్థములను సంపాదించుకొనుచున్నవి. అట్టి శక్తిని భగవంతుడు మన అవయవములకును ఇచ్చి యున్నాడు. మన శాస్త్రజ్ఞానముతో నిమిత్తము లేకయే ఏవస్తువులను దినినను నవిశరీరపోషణకు గావలసిన మాంసకృత్తులు మొదలగు పదార్థము-

లుగా మారును. ఇంతేగాక శాకములయందును ఫలముల యందును ఉప్పు సున్నము మొదలగు సర్వపదార్థములును ఉన్నవి. ఇవియే మన శరీరమున కనుకూలించునవిగాని వేరు వేరుగా శర్కర లవణము ఇనుము మొదలగువానిని తయారు చేసి కలిపిన మిశ్ర మాహారమును తినవలసిన పనిలేదు. శాకములయందును పండ్లయందును ధాన్యముల యందును గల పదార్థములనుండి మాత్రమే మన అవయవములు తమకు గావలసిన వానిని తయారు చేసికొనగలవు. ఏజంతువున కేది సహజాహారమో ఏర్పాటు చేసిన ప్రకృతిమాత లేక సర్వజ్ఞుడగు పరమేశ్వరుడు ఆవస్తువులనుండి శరీర పోషణకు గావలసిన పదార్థములను దయారు చేసికొనుశక్తిని కూడ నిచ్చియున్నాడు. ఈ సహజాహారములే వండుటచేతను మన శరీరమున కవసరములేని, పంచదార, ఉప్పు, కారము, సువాసన ద్రవ్యములు చేర్చుటచే వానికిగల జీర్ణమగుశక్తిని పోగొట్టుకొనుచున్నవి. అందువలన వీనిని జీర్ణము చేయుటకు గాను మరికొన్ని రసములుపడి పనికిమాలిన ఉప్పు మొదలగు వానిని విరిచివేయవలెను. అందువల్ల తగినంత శీఘ్రముగ జీర్ణముగాదు. అందుచేత జీర్ణకోశము తనశక్తిని పోగొట్టుకొనును. అధికరుచి కలవాటుపడిన నాలుక యీ రుచిగల పదార్థములను అమితముగా లోపలకు పోనిచ్చును వీని నన్నిటిని అనవసరముగ జీర్ణముచేయవలసి యుండుటచే జీర్ణకోశము చెడును. అనారోగ్యము గల్గును గాన సహజాహారమును మాత్రమే తినవలెను, అదియును శరీరపోషణకు తగినంత మాత్రమే తినవలెను.

## (౧౮) ౧౦ స్వాభావికాహారము వండితినుట

మనుష్యుడు తన సహజాహారము నుండి వాడిన పదార్థములు తినుట కెప్పుడవలంబించెనో మన మూహించుటకు గూడ వీలు కనబడదు. అనేక యుగములనుండి వంట ప్రారంభమైనట్లు మన పురాణములవలన దెలియుచున్నది. అందువలన అవయవపటుత్వము తప్పిపోయినందున కోతులవలె పచ్చితిండి తినుటకు తగిన దంతబలిమిని, కోయుటకును చీల్చుటకును దగిన గోళ్ళశక్తిని పోగొట్టుకొనియున్నాడు. తిరిగి యాశక్తిని సంపాదింపవలెనన్న కొన్ని తరములు బట్టును. అయినను మానవకోటిని తిరిగి యారోగ్యవంతులుగను, బలవంతులుగను, నాయుర్దాయ వంతులుగను, జేయవలెనన్న సహజాహార భక్షణమే యవసరము. మనుజు లందరును సాత్వికులగుదురనియు వారి హరి వాంఛలను గట్టిపెట్టి, వేదాంతులై జిహ్వోపస్థల జయింపగలుగుదురనియు చెప్పజాలము. అట్టివారి విషయములోగూడ కొంతవరకైనను తరింపగల మార్గమును జూపవలెను. వీరొకసారిగా వంటను, రుచులను విడచి-కేవలముపక్వాహారములోనికి వచ్చుటకు వీలుండదుగాన వీరి విషయములో వంట ఆవశ్యకమగును. ఈ వంట కూడ ప్రస్తుతమందు విపరీత పద్ధతిలో నుండుటచే ఆరోగ్యమును కాపాడలేకున్నది. గాన ఆరోగ్యమును పూర్తిగా జెడకుండుటకుగాను ఎట్లుండవలెనో నిర్ణయించవలసియున్నది. ప్రతిశాకమును, ధాన్యమును వండుటచే వానిలోనిజీవసత్తులు పోవుటచే కొంతశక్తి పోవుచున్నది. వాని నధిక జలములో నుండి వార్చి వేయుటచే దానిలోగల పోషకపదార్థములైన లవ

ణాదులు వారుపుతో బోవుచున్నవి. ఇక మిగిలిన పదార్థము రుచిలేని పిప్పి. ఈ పిప్పికి రుచికల్పించుటకుగాను సముద్రలవణము, కారము, మసాళాలు, సువాసనద్రవ్యములు, చమురులు అవసరములగుచున్నవి. ఇట్టు వండినపదార్థములు జిహ్వాకింపుగనున్నను సరిగా జీర్ణములుకావు. శరీరపోషక పదార్థములు మార్పునందు పోయినందున బలము నీయజాలవు. తగినంత బలము సంపాదించుకొనుటకుగాను అధికముగా తినుట యవసరమగుచున్నది. ఈ కృత్రిమ పదార్థమునందుగల ఉప్పు మొదలగు జీర్ణము కానివి వానిశక్తినివిరచి జీర్ణమగుటకు దగిన వానినిగ జేయుటకు విశేషమైన జలమును ద్రవపదార్థములను దీసికొనవలెను. మన జీర్ణకోశములోని సహజరసములుకూడ గృత్రిమపద్ధతి నవలంబించి యీ పదార్థమునందుగల విషములను పోగొట్టి పోషణకు తగినవానినిగ జేయవలెను.

అందుచే జీర్ణకోశ మచిరకాలములో తనశక్తిని పోగొట్టుకొనుచున్నది. పటుత్వములేని జీర్ణకోశము నిస్సత్తువ పదార్థములను మాత్రమే జీర్ణముచేయగలదు. అందువల్లనే పాత బియ్యము, వేపడపు కూరలు, పాత ఊరగాయలు, ఒరుగులు, మిగులముగ్గిన పండ్లు తినవలసి వచ్చుచున్నది. మందులు రోగము నణచుటకుగాను అవయవ పాటవమును జంపునుగాన నిట్టి వస్తువులు పథ్యములగుచున్నవి. ఇట్టి నిర్జీవపదార్థ సేవనమువలన నాయుర్బలారోగ్యములు వృద్ధిబొంద నేరవు. కాన వండిన పదార్థములు గూడ కొంతవరకైనను యోగ్యములైనవిగా జూచుకొనుటకై వానిలోని సారములు పోకుండ

కొంచెము నీటితో మాత్రమే ఉడుకబెట్టి నీరిగురువరకునుంచి దెంపవలెనుగాని వార్చరాదు. మనముతినెడు ధాన్యములన్నిటి లోను వరిబియ్యము సత్తువలేనివి. అవియును మరలో దంప బడి మాంసకృత్తులుగల తవుడు పూర్తిగా తీసివేయుటవలనను, కడుగుట వలనను, వార్చుటవల్లను బొత్తిగా సారహీనము లగు చున్నవి. ఆకారణముచే బూర్వము దంపుడుబియ్య మును దిని గంజితాగెడువారికంటె నేడు మరబియ్యమును, తినెడువారనారోగ్యవంతు లగుచున్నారు. బియ్యము తినక తప్పనివారు దంపుడు చేబియ్యమును అత్తెసరు వేసికొని తిన వలెను. ధాన్యములన్నిటిలోను గోధుమ లుత్తమమైనవి. ఇవి రొట్టెగాగాని, జావగాగాని, యన్నముగాగాని, వాడ నగును. రొట్టె యప్పడములవలె బల్చగాగాని మారువాళ్ల రొట్టెలవలె నేతితో మర్దించిగాని తినుట పనికిరాదు. ఆవిరి మీదగాని, లేక వేడిగాలిమీదగాని చెమురు లేకుండ నుడుక వలెను, అట్టిరొట్టె శరీరమునకు మంచి యుపయోగకారియు త్వరలో జీర్ణమగునదియు నగును. బాగుగా నమలకగాని యిది మింగబడదు. నమలినకొలది రుచించును. జావ కాచి నను బలుచగా నుండునట్లుగాక ముద్దగాను, ఏమైనను బదార్థ ములు దానిలో కలుపుకొనుటకును, బాగుగానమలి మింగు టకును వీలుగా నుండవలెను. అన్నముగాని, జావగాని, రొట్టె గాని, పొట్టుతోకలిసిన గోధుమలపిండినుండి తయారు చేయ వలెనేగాని పొట్టుపోవునట్లు దంపరాదు. కూరగాయలను వండుటకు తరుగునపుడు పైచెక్కు-దీసివేయరాదు. మురికి పోవుటకొకసారి నీటిలోగడగి, చెక్కు-తో గూడ ముక్క-లుగా

దరిగి, కొంచెమునీళ్ళతోనిగురనీయవలెను. ఇంకనునీరుమిగిలిన యెడల మెత్తనిపిండిచేర్చి యిగురనిచ్చిన రుచిమంతముగ నుండును. ఉప్పుగాని, పోపుగాని, సువాసన ద్రవ్యములగు నావ మొదలగువానినిగాని చేర్చరాదు. ఈపదార్థములు అధికరుచిని గలిగించి కావలసినదానికంటె అధికముగ తినునట్లు చేయును. త్వరగా జీర్ణముకాకుండ ప్రేగులయందు కొంతకాలము నిలవయుండును. అందువలన జీర్ణకోశమున కధికశ్రమను గలిగించును. గాన ఉప్పు, కారములను, మసాలాలను వాడగూడదు. పప్పుదినుసులన్నియు నధికమైన బలమునిచ్చునవిగాన వీనిని చిన్నపిల్లలును, దేహపరిశ్రమ గలవారును వాడవలెనేగాని వృద్ధులును, పనిలేకకూర్చుండువారును వాడకూడదు. పప్పులన్నియు పొట్టుతోనే ఉడికించి తినవలెను. గింజలమీది పొట్టును, కూరగాయలమీది బెరడును, పిప్పిపదార్థములును శరీరపోషణకు పనికిరావు. గాని పనికివచ్చు యితర పదార్థములజీర్ణముచేసి, మిగిలిన పనికిరాని పదార్థములపైకి తోసివేయుటలో మిగుల నుపయోగించును. పప్పుపులుసుతోగలిపి పలుచగా జేయబడిన యెడలబహుకష్టము మీదగాని జీర్ణములుగావు. ఘనపదార్థములవలె ద్రవపదార్థములు సులభముగ జీర్ణములుగావు. ఏలనన ఉమ్మి నీటితోకలియువరకు నోటిలో నుండక పొట్టలోనికి జారుటవలనను, నమలుట అవసరము లేకపోవుటచేతను త్వరలో జీర్ణములుగావు. ఉప్పుకారములను విడచినవారికి ద్రవపదార్థములతో నిమిత్తములేదు. భోజన పదార్థములలో మూడుపాళ్ళు ద్రవపదార్థములును, ఒకపాలు ఘనపదార్థమును ఉండవలెననునది కృత్రిమాహారులకొరకు.

నిర్ణయించబడినదిగాని స్వభావజన్యమైన ప్రకృత్యాహార
భక్షులకొరకేర్పడినదిగాదు. స్వాభావికాహారసేవకులకు
ఏ ప్రవపదార్థముతోబని లేదు. కూరగాయలు చమురుతో వేపుట
వలన పోషక పదార్థములు మాడిపోవును. రుచిగానున్నను
విలువయందివి తక్కువయని చెప్పనగును. పిండివంటలు
ప్రకృతియందు లేనేలేవు. ఆహారమనునది శరీరపోషణకొరకేర్పడినదేగాని సరదాకొరకేర్పడినదిగాదు. నేనిట్లుచెప్పి
నప్పుడు నాగరిక ప్రపంచమంతయును నన్ను వెక్కిరించ
వచ్చును. అయినను యథార్థమాలోచించిన నాతో నేకీభ
వింపగలదు. మనుష్యుడుగాక యే యితరజంతువుగాని పండు
గలు, విందులు, విందుభోజనములు నెరుగదు. రుచికొరకై
యెక్కువగాతినదు. కడుపునిండినపిమ్మట ముచ్చటకైనను
మరియొక కణమునైనను ముట్టదు. గనుకనే యితర జంతువు
లెల్లను ఆమరణాంతము నొక్కతీరున నారోగ్యవంతములుగ
నుండ, మనుష్యుడును, మనుష్యునిచే బెంపబడు జంతువులును
నారోగ్యమును గోల్పోయి సదా రోగపీడితములగుచున్నవి.
సహజాహారము ఆకలితీర్చుట కుపయోగపడును. అధికరుచిగా
నుండకపోవుటచే నాకలితీరినపిమ్మట తినవలెననుకోరికను గలి
గించదు. మితాహారము జీర్ణకోశమున కధికశ్రమ నివ్వనందునను
జీర్ణకోశము బలముగలిగియుండినందువలన ప్రతి యవయవ
ముకు శక్తిగలిగి తనపని సక్రమముగ జేయుటవలన చిరాయు
రారోగ్యములు గలుగును. కాన చమురుతో వండు పిండివంటలు
సహజాహారులకు నిషేధములు. మనుష్యుడు సంఘములో
దిరుగుట కిచ్చగించును. పండుగులు, విందులు, మొదలగు

సంతోష కార్యముల నెరవేర్చుచు చాలమందిని జేర్చి సంతోషముతో భుజించుచు నిత్యము దిను పదార్థములకంటె నధిక పదార్థములను వారికిబెట్టి వారి మన్ననలబొంద నాశపడుచుందును. అట్టివారికిగాను నారోగ్యమునంతగా జెడగొట్టని కొన్ని వంటకములనిందు బొందుపరచెదను.

## ప చ్చ డు లు

ఒక కమ్మనివస్తువయు ఒకపుల్లని వస్తువయు జేర్చి రుబ్బిన రుచ్యములగు పచ్చడు లేర్పడును. ఇవి రోగులకొరకు గాక సామాన్యమైన యారోగ్యవంతుల కేర్పడినవి.

(1) బెండకాయయును, వాక్కాయగాని, లేతచింతకాయగాని, నిమ్మరసముగాని చేర్చిన పచ్చడి.

(2) కాలిన వంకాయగుంజుతో దోసకాయ ముక్కలుచేర్చి నిమ్మరసముగాని, లేతచింతకాయగాని, మామిడికాయగాని కలిపి రుబ్బుట.

(3) కొబ్బరికాయతో, పులుపుగల మామిడికాయ, వాక్కాయ, చింతకాయ, నిమ్మపులుసు, వెలగకాయ మొదలగునవి చేర్చి రుబ్బుట.

(4) పుల్లగోంగూర, మంచిగోంగూర కలిపివేసి రుబ్బుట.

(5) అరటిపువ్వు తరిగి నిమ్మకాయరసముచేర్చి రుబ్బుట.

(6) పప్పుదినుసు గింజలు నానబోసి పుల్లని పదార్థములతో జేర్చి రుబ్బుట.

(7) మోహానదుంపలతో పుల్లని వస్తువులచేర్చి రుబ్బుట.

ఇట్లే ప్రకృతియందు దొరకు పదార్థములను రుచ్యము లుగ జేసి విందులకును పండుగలకును వాడనగును.

## కలగలుపుకూరలు

(1) బీరకాయయు బెండకాయయు కలిపి వండవచ్చును.

(2) కందయు మట్టుబచ్చలియు, లేక పందిరిబచ్చలియు చేర్చి వాడనగును. కంద వార్చవలసి వచ్చును.

(3) వంకాయయును మోహానదుంపయును, కలపవచ్చును.

(4) వంకాయయునుగోరుచిక్కుడుకాయయును లేక చిక్కుడు కాయయును చేర్చవచ్చును. గుమ్మడికాయ చేర్చవచ్చును.

(5) అన్నికూరలలోను కొబ్బరితురుము వాడుటచే అధిక రుచి గలుగును.

(6) అప్పుడప్పుడు పొట్టు పెసరపప్పు కొన్నికూరలలో కలిపి వండవచ్చును.

## కలగాయ పులుసు

నీళ్ళవలెనుండు పులుసు లగత్యములేకున్నను రుచికొరకెప్పు డైనను ముద్దకూరవంటి పులుసులుకూడ వండవచ్చును, గుమ్మడికాయ లేక ఆనపకాయ ముక్కలకు వంకాయ, బెండ కాయ, దుంప మొదలగు రుచికరములగు కాయలను, బచ్చలి, తోటకూర, పుల్లబచ్చలి మొదలగు ఆకుకూరలను జేర్చి, మామిడికాయ, లేతచింతకాయ మొదలగు పులుసుకాయలతో నుడకబెట్టి చిక్కబడుటకు పిండినివేసి బాగుగా వండిన రుచించును.

## పిండివంటలు

ఆవిరిమీదవండిన మినపకుడుము (పొట్టుతో నుండవలెను.) గోధుమతో శనగ మొదలగు పిండినిజేర్చి ఆవిరిమీద వండిన కుడుములు.

ఉండ్రాళ్లు, బొబ్బర్లు, శనగలు మొదలగు వానినిజేర్చి ఆవిరి మీద వండనగును.

కొబ్బరిపాలను, గోధుమపాలనుదీసి ఖర్జూరపుకాయల పొడుము కలిపి నానిన సగ్గుబియ్యమునుజేర్చిన పరమాన్న మగును. శనగపిండిగాని, గోధుమపిండిగాని, కర్రపెండలపుదుంప పిండి గాని తెచ్చి ఖర్జూరపుకాయ పొడుముతో కొబ్బరిపాల నుండ యగునట్లుమాత్రము పోసి యుండలుజేసిన లడ్డువలెనుండును. ద్రాక్ష కిసిమిసి పళ్ళుకూడ జేర్చనగును. కొబ్బరి తురుము ఖర్జూరపుపండు కలిపి ముద్దలు చేయనగును. నువ్వులు ఖర్జూరపు పండు కలిపి తొక్కిన చిమ్మిలియగును. ఇట్లే సమయాను కూలముగ జేయనగును.

ఈ పదార్థములుకూడ మనసు బట్టజాలనివారికేగాని మనో నిగ్రహము గలవారి కవసరములేదు. అందరును తినుచున్నారు, మనకులేవని బెంగపెట్టుకొని అందరితో బాటు కృత్రిమాహా రము తినిన ఆరోగ్యము చెడిపోవునని బెంగ బెట్టుకొనువారి కొరకే యిట్టిపదార్థములు చెప్పబడినవి. వీనినైనను తరుచుగా వాడుటచే ఆరోగ్యము చెడకమానదు. కారణమేమన గల్పిత రుచులచే నధికముగ దినుటతటస్థించును. అందువలన జీర్ణ కోశ మునకు శ్రమగలుగును. ఇట్టి పదార్థములతో నధికభోజనము

లభించిననాడు ఒకపూట యుపవసించినయెడల పూర్తిగ జీర్ణము గాగలవు.

ఎంత తినవలెను ? ఎన్నిసార్లు భుజింపవలెను ?

ప్రపంచములో జీవరాసులను సృష్టించకపూర్వమే వానికొరకాహారమగు నోషధులను ఫలవృక్షములను సృష్టికర్త సృజించి యున్నాడు. అతనిశక్తిని గనుగొనుటకు మనుష్యమాత్రునకు సాధ్యము కాదు. పిల్లలు పుట్టకమునుపే తల్లులందు పాలను, గుడ్లయందు పోషకపదార్థమును, గింజలయందు ఆహారమును ఏర్పరచిన ట్లీయోషధులను ఫలములను జీవరాసుల కొఱకు సృష్టించి ముందుగా సిద్ధపరచి యుంచియున్నాడు. ఎన్నిజీవుల సృష్టింపదలచియుండునో అందుకు సరిపడెడు యాహారము సిద్ధపరచునుగాని అంతకంటె నధికముగాగాని యల్పముగా గాని తయారుచేసియుండడు. అట్లైనయెడల ప్రజలలో గొందరు తిండిలేక మాడుచుండుట యేలయని ప్రశ్నరావచ్చును. భాగ్యవంతులందు గొందరు అమితభోజనమున కలవడి తమకేర్పడిన దానికంటె ననేక రెట్లధికముగ భుజించి అజీర్ణరోగముచే బాధపడుచున్నారుగదా! వీరికి అధికముగా దినుటకు లభించునట్టి యాహారమే బీదసాదలకు కొఱవడియుండెడి యాహారము. ఒకరు ఎక్కువతిని అరగించుకోలేక బాధపడుచుండ మరియొకరు తిండికిచాలక మలమల మాడుచున్నారు. ఇట్టిస్థితిలో తానెక్కువగాతిని బాధపడుటకంటె కావలసినంత మాత్రమే తిని చాలని తిండితిని మాడెడువానికొఱకు విడిచి పెట్టుట తన విధియని భాగ్యవంతుడు గ్రహించువరకు దరి

ద్రిము దేశమును విడువదు. మనుష్యుఁడు తిండికొఱకే పుట్టి నాడనియు నతని పరమావధి తిండియేయనియు బ్రతికి యున్నంతకాలము తాను తిని యొకరికి బెట్టినదే జన్మయనియు చచ్చిన తరువాతకూడ వచ్చునదేదియు లేదనియు జెప్పు మెట్ట వేదాంతము బలిసినకొలది రాత్రింబగళ్ళు బాధపడి సంపాదిం చుటయేగాక, తిండిపోతయి జీర్ణముచేసికొనలేక రోగపీడితుఁడై కూడ బాధపడుట తప్పదు. అందువలన నిట్టి బాధలేకుండ నుండుటకుగాను తిండికొక మితియుండవలెను. మితిమీరి తినెడువారుందురా యని పాఠకులకు దోపవచ్చును. మితి దెలిసినగదా మీరినట్లు దెలియుట! పూర్తిగా పిండిపంటలతో కంఠమువరకు దిని వాముపాయ మ్రింగుటకైనను శక్తిలేని యొక పెద్దమనిషికి భోజనానంతరము జున్నువంటి నూడిద పదార్థము వెలక్కాయంత తినుటకు శక్తివచ్చును. దీనికి కార ణము పొట్ట ఇనుపవలగాక స్థితిస్థాపకశక్తిగల తోలుసంచి యగుటయే! రుచుల కలవడినకొలది ఒకదానికంటె నధిక రుచిగల మరియొక వస్తువు తినుటయందలి కోరిక చావదు. విందులయందును భాగ్యవంతుల యిండ్లయందును ఒక్కొక భోజనమునం దనేకపదార్థములు వేరువేరు రుచులుగలవి తయారగుచుండుటచే ఎంత తినుచున్నాడో తెలియకుండ మితి మీరి పొట్టలో చేరుచుండును. ఒకగ్లాసులో నీళ్లుపోసి యందు కొంతయుప్పువేసిన నది కరగును. మరికొంతవేసిన నదియును కరగును. ఇంకను వేసిన గరగదు. గాని ఆనీటిని వెచ్చజేసిన గరగును. అట్లే ఒకమనుష్యుడు రెండు లడ్డూలను తినగల డనుము. ఆవకాయ నంజుడుతో మరిరెండింటిని, కొంచెము

పులిహోర తిన్నపిమ్మట మరి రెండింటిని తినగలడు. అందు
చేతనే విందులయందును, టీపార్టీలయందును నొకటి తీపిది
మరియొకటి కారపుది తయారుచేయుదురు. ఇట్లు కష్టపడి
యధికముగా దినుటకు మనుష్యసంఘ మలవాటు పడియుం
డగా మనుష్యు డెక్కువ నెట్లు తినగలడనుట కెట్లు సాహసింప
గలరు? ధర్మకర్తలు వ్యభిచారులకును, త్రాగుబోతులకును,
నేరస్థులకును శిక్షాస్మృతుల నేర్పాటుచేసియు, నధికముగా
దిను తిండిపోతుల విషయములో నేమియు శిక్ష విధించరైరి.
దీనికి గారణము వారును తిండిపోతులగుటయే! అందరును
త్రాగెడివారుగల గూడెములందును, జూదగాళ్లుగల గూడెము
లందును, దొంగల గూడెములందును ఆ యా పనులు తప్పులు
గావు. అట్లే ప్రజలందరును మితిమీరి తినువారగుటచే తిండి
పోతు తనము పంచమహాపాతకములలో జేర్పబడలేదు. గాని
ఆరోగ్యమును జెరిపి వ్యాధిగ్రస్తుని జేసి ఆయుర్దాయమును
నశింపజేయునది గాన అధికతిండియు మహాపాతకములలోనిదే
యగును. మనము తినుట శరీరపోషణార్థమేగాని సరదా
కొరకు గాదని యొప్పుకొనినపక్షమున తిండికి మితి నేర్పరుప
గలము. వేడుకకొరకే తినువారి విషయములో మితి నేర్పరుప
లేము. వేడుకకు విలువలేదు. మనము తినినతిండి యంతయు
జీర్ణముకావలెను. అందువలన జీర్ణకోశముయొక్క శక్తిననుస
రించిమితి యేర్పాటు కావలెను. ఈ శక్తి ఆరోగ్యవంతులైన
మనుష్యులలో వయస్సునుబట్టియు, వారు చేయు వృత్తిని
బట్టియు, పిండబలమును బట్టియు నుండును. చిన్నతనమునందు
మనము తిను తిండి శరీరమును పోషించి ప్రతి రోజునను

నశించిన శరీరభాగములను తిరిగి బలపరచుటకేగాక మెదుగు టకు గూడ నవసరము. గాన ఎక్కువసార్లు తినవలసి వచ్చును. వీరిపొట్టలు చిన్నవగుటచే నవి చాలపదార్థము తీసుకొనునంత విశాలముగనుండవు. అందుచే పాలుత్రాగు శిశువులకు రోజునకు 5 లేక 6 సార్లు పాలీయవలసివచ్చును. అన్నముతిను పిల్లలకు 3 సార్లు భోజనము గాక మరియొక సారి ఫలముల నీయనగును. పిల్లలకు 8 సం॥రములు వచ్చినది మొదలు 20 సంవత్సరములు వచ్చువరకు భోజనమును ఫలా హారమును కలిసి దినమునకు 3 సార్లు మాత్రమే యుండవలెను. వండినవస్తువులు తినుటయే లెక్కగట్టుకొని మధ్య మధ్య తినెడు ఫలాహారములు గణింపకుండుట సరికాదు. వేడుక కొరకు తినుటయనునది మన మతమందు లేదు. అంతటినుండి 50 సంవత్సరముల వయస్సువరకు రెండుసార్లును, ఆపైని మరి కొంతమొక్కసారియు తినుపక్షమున తిన్నతిండి చక్కగా జీర్ణమై నిత్యారోగ్యవంతులై మనగలరు. ఈ తిండియందలి మితి- దేహపరిశ్రమ విశేషముగా గల కూలివారికిని, వ్యవ సాయదారులకును, చేతిపనులుచేయు వడ్రంగి, కమ్మరి, కుమ్మరి, సాలి, మొదలగువారి కెక్కువయును, గూర్చుండి లెక్కలువ్రాయు గుమాస్తాలు, స్కూలు మాష్టర్లు ఆఫీసరులు మొదలగు వారికె తక్కువయును నుండవలెను. కొందరు బల వంతులుగను, మరికొందరు బలహీనులుగను వారితల్లిదండ్రుల శక్తినిబట్టి పుట్టుచుందురు. ఇట్టివారిలో బలవంతుల కధిక మును, బలహీనుల కల్పమును గావలసియుండును. అంతేగాని భాగ్యభోగ్యములతో నిమిత్తములేదు. ఇట్టి తిండి యేర్పాట్లు

చేసుకొన్న యెడల నిక యెక్కడను కాఫీ హోటళ్ళకును, మిఠాయి దుకాణములకును, సారాపాకలకును తావులేదు. వైద్యులతో నిమిత్తములేదు. అందరును ఆరోగ్యవంతులే. భూమియే స్వర్గమగును. మనుష్యులయొక్క గమనిక సూర్యుని బట్టియున్నది. సూర్యోదయముతో మనుష్యునికి శక్తియు ఉత్సాహమును పుట్టి క్రమముగా 12 గంటలవరకు వృద్ధిని బొంది క్రమముగా క్షీణించి సూర్యాస్తమయముతో తగ్గి పోవునుగాన మన భోజనముకూడ దీనినిబట్టి నిర్ణయించు కొన వలెను. 12 గంటలలోపు రెండుసార్లును,పిమ్మట నొకసారియు, చొప్పున మూడుసార్లు భుజించువారును, పదిగంటలలోపున నొకసారియు, సూర్యాస్తమయమగు నపు డొకసారియు రెండు సార్లు భుజించువారును దీసికొనవలెను. మనము సాయంత్రము తినుతిండి పరుండబోవునప్పటి కరగిపోవలెను. అందు వలన రాత్రివేళలయందు భుజింపకూడదు. ఒకసారి తిన్నతిండి పూర్తిగా నరుగువరకు మరియొకసారి భుజింపగూడదు. ఎప్పు డైనను నేకారణముచేతనైనను ఒకసారియధికముగా తినుట తటస్థించినపుడు అది పూర్తిగ నరుగువరకు మరియొకసారితినక యుపవసింపవలెనేగాని వేళదప్పరాదని యాకలిగాని తిండి దినరాదు.

భోజన పదార్థములు నోటిలో నుండి పొట్టలోనికిబోయి యక్కడ కొంతజీర్ణమై చిన్న ప్రేగులయందు ప్రవేశింపఁ బోవు నప్పటికి నాలుగుగంటలు పట్టును! పిమ్మట రెండు గంటలు విశ్రాంతికావలెను గాన భోజనమునకునుమరియొకభోజనమునకును మధ్య అధమపక్షము ఆరుగంటల వ్యవధియుండ

వలెను. భోజనము చేసినతరువాత ఆరుగంటల లోపున అల్పాహారములుగాని, ఫలాహారములుగాని చేయఁగూడదు. చాల మంది రాత్రులందు భుజించెదరు. నిద్రిపోవుపిల్లలను లేపి తినిపించెదరు. ఇది చాలతప్పుపద్ధతి. మానవము తిను తిండి యరుగుటకు కొంత వేడిమియు జీవశ్శక్తియు నవసరము. ఇవి సూర్యుని గతి ననుసరించియుండును. సూర్యాస్తమయముతో నీశక్తులు క్షీణించును. అందుచే జీర్ణకోశము బలము చెడియుండును. ఇంతేగాక యీ అవయవములకు చేయవలసిన పనుల నుపదేశించు మనసేంద్రియము నిద్రావస్థయందుండునుగాన నీపనులు సరిగా జరుగవలెనన్న నిద్రిపోవు సమయమునకు జీర్ణకోశము పనిచాలించి విశ్రాంతితీసికొనుట కవకాశము గల్పింపవలెను. పిల్లలకైనను రాత్రి పాలంతగా అవసరముండవు. నిద్రలో లేపి పాలీయు ముసలమ్మల మాట వినగూడదు.

## ఎప్పుడు తినవలెను?

ఇందునుగురించి పూర్తిగా వ్రాయవలసియున్నది. ఆకలియగునపుడు భోజనము చేయవలయుననుసంగతి యందరకును తెలిసినదే! అయినను మనచిత్తము వచ్చినట్లలవాటుఁ జేసుకొని ఆకలివేళలు మనయలవాట్లచేఁ దప్పించుకొనుచున్నాము,చాల మందికి సమయమున భోజనము చేయు నలవాటులేదు. తరువాత సకాలమున నాకలియగును. ఆ యాకలియును మందగించి యుండును. మన చుట్టునుండు జంతుకోటిని బరిశీలింపుడు. అవి యన్నియును సామాన్యముగా సూర్యోదయావస్థయమున నాకలి మెండుగాగలిగి యపుడు విశేషముగ

మేత దినుచుండును. ఇది సూర్యకిరణ ప్రభావముచేతనే గలుగుచున్నది.

ప్రతిదినము ఉదయకాలము అస్తమయకాలము నని రెండు భాగములుగ విభజింపవచ్చును. సూర్యుని ప్రభావము ఉదయముతోఁ బ్రారంభించి మిట్టమధ్యాహ్నమువరకు వృద్ధియై పిమ్మటఁ గ్రమముగ తగ్గి సూర్యాస్తమయముతో నంతరించును. ఇట్లే సమస్త జీవకోటికి నుదయము మొదలు చైతన్యమధికమై మధ్యాహ్నము మొదలు క్షీణించును. సూర్యాస్తమయముతో చైతన్యము శాంతినొంది విశ్రాంతి యారంభమగును. పిదప నిద్ర యావహిల్లును.

ఉదయకాలము ఆరంభముకాగానే ప్రాణికోటి చైతన్యము గలిగి వృద్ధిచెంది శరీరమునకును బుద్ధికిని బలముగలిగి పని పాటులు చేసికొను శక్తిగలిగియుండును. మధ్యాహ్నము దాటినపిమ్మట అవితగ్గి సాయంత్రమందు విశ్రాంతిని గోరుచుండును. చైతన్యముయొక్క యీ వృద్ధిక్షయములు మన జీర్ణసాధనముల విషయమునను నిట్లే పనిచేయును. ఉదయకాలమునందు జీర్ణసాధనములు బలము గలిగియుండును. అస్తమయ కాలమునందు బలము తగ్గియుండును. కనుక మన మెప్పుడును <u>ఉదయకాలమునందే అనగా 12 గంటల లోపుననే బలమైనభోజనము చేయవలె</u>ను. సాయంత్రమందు అల్పమైన భోజనముచేయవలెను. ముఖ్యముగ వ్యాధిగ్రస్తులగువారు ఈ ప్రకారము గమనింపవలెను. రోగులకు ఉదయమందాకలియుండదే ఇది యెట్లు పొసగు? ననుకొందురు. నాగరికతా విశేషముచే రాత్రులను పగళ్లుగ మార్చునట్లు వెలుగు

గలుగునట్లు దీపములు బెట్టుచున్నాము. రాత్రి చీకటిని గల్పించిన భగవంతుని యాజ్ఞల నుల్లంఘించుటచే నిట్లారోగ్య భంగము గలుగునని మన మెరుంగము. ఈ కారణము చేతనే నాడీవ్యాధులు గలుగుచున్నవి. గాన రాత్రులందు భుజింపక పెందలకడ నిద్రించిన పక్షమున రోగులకును ఉదయమున నాకలి కాఁగలదు. రాత్రులయందు భోజనము చేయుటచే జీర్ణకోశమునకు విశ్రాంతిలేక అలసియుండుటచే ఉదయమున నాకలికాదు. కాన కొంతపట్టుదలతో యుక్త కాలములందు భుజించుట కలవరచిన యెడల ఈస్థితి మారగలదు ఆకలి తక్కువగా నుండువారు సాయంకాలమందు ఏమియుఁ దినకూడదు. ఆకలి కొద్దిగా నుండువారు సాయంత్రి మత్యల్పముగ మాత్రము భుజింపవలెను. ఈ సాయంకాల భోజన మెప్పుడును సూర్యాస్తమయ సమయమున కొకగంట మించకూడదు.

## ఎక్కడ తినవలెను?

హిందువులలో ముఖ్యముగా ద్విజులనబడు బ్రాహ్మ క్షత్రియ వైశ్య జాతులు వంటయిండ్లయందే భుజించువాడుకగలదు. నాగరికతా విశేషమువలన తీరికగా భుజించుట కవకాశము లేదుగాన వంట పూర్తిగాకముందే పొగ వచ్చుచుండగనే భుజించు టవసరమగుచున్నది. వంటయిండ్లు సరిగా వెలుతురు గలవియు, శుభ్రమైనగాలి గలవియుఁగా నుండుటలేదు. ఇట్టి యిండ్లలో భుజించుటవలన కావలసిన ప్రాణవాయువు మనము తిను పదార్థములతో గలియకపోవుటచే సరిగా జీర్ణకర్మ జరుగనేరదు. మనము భుజించు పదార్థములు ప్రాణవాయు

వృతో మిశ్రిమమైనపుడే జీర్ణకర్మ సక్రిమముగా జరుగును. రోగుల విషయములోఁ బథ్యము చేయించు వైద్యులెవ్వరును దీని యగత్యమును గ్రహించినట్టుతోచదు. ఎంత తేలికగాఁ దిన్నను, ఎంతమంచి పదార్థములు తీసికొనినను ధారాళముగా మంచిగాలిగల చోట్ల భోజనము చేయుమేని మనకు సరిగా జీర్ణముకానందున వంటయిండ్లు చక్కగా వెలుతురును వాయువును వచ్చునంత విశాలముగను, కిటికీలుగలవిగను నుండవలెను; లేదా అట్టి చోట్లయినను అయియుండవలెను. బహిరంగ స్థలములయందు తినుటకు వీలుండిన అట్లు చేయుట సర్వశ్రేయోదాయకము. పొలములలో భుజించువారెక్కువ ఆరోగ్యవంతులుగ నుందురు. పొగలోను దుర్వాసనగల గదులలోను, ఇరుకుసందులలోను తినువారెంతపథ్యముగనున్నను వారి యారోగ్యము సరిగానుండదు. పట్టణములం దిట్టి మంచి వాయువు దొరుకుటకష్టము, పల్లెలయందు వీలున్నను వంటయిండ్ల విషయములో తగుశ్రద్ధ తీసికొనువారరుదు. చాల మంది శూద్రులు విశాలమైన దొడ్లయందే భుజింతురు. ఇక్కడ మంచివాయువు లభించగలదు. పట్టణములందిట్టి దొడ్లుచిన్నవగుట చేతను, మురుగునీరు పాకీదొడ్ల దగ్గరగా నుండుటచేతను, మంచివాయువు వచ్చుటకు ననుకూలించదు. ఇంతేగాక భోజనము చేయునప్పుడు బహుసంతోషముగా నుండవలెను. విచారకరమగు సంగతులు తల పెట్టగూడదు. మనము తినుతిండి జీర్ణమై దేహారోగ్యమును, బలమును, ఆయుర్వృద్ధి నిచ్చునని భావించుచుండవలెను. పరధ్యానముతో నుండగూడదు. ఇతర వ్యాపారములన్నియు ఆతరుణ

మునందు మనస్సులోనుండి తొలగింపవలెను. పరధ్యాన ముతో మ్రింగినప్పుడీ ఆహారము పొరబడును. ఒకొక్కప్పుడు ప్రాణభయము కూడ రావచ్చును. పొరబడుట యన నాహారము పొట్టలోనికిపోవు ఆహారనాళికగుండపోవుటకు బదులుగ యూపిరితిత్తుల లోనికిబోవు గాలిగొట్టమునందు ప్రవేశించుట. ఇట్టిపనిజరిగినపుడు దగ్గువచ్చి గాలిగొట్టములో ప్రవేశించిన కణమును గెంటివేయును. అట్లు గెంటివేయ సాధ్యముగా నప్పుడే చిక్కుగలుగు. దీనినే కొందరు ముసలమ్మలు ఎవ్వరో తలచుకొనుచున్నా రందురు. ఇట్లు పొర బడకుండ వలెనన్న దృష్టి భోజనము మీద నుంచియే నమలి మ్రింగవలెను. కొందరు భోజనము చేయునప్పుడు మౌనవ్రతము గైకొందురు. అదియును చాలమంచిదే. ఇట్లు చేయుట మనకు సాధ్యపడునా, యని భయపడ నక్కరలేదు. మనకట్టి ఉద్దేశ్యముండి ఆరోగ్యమే ప్రధానముగా నెంచుకొనిన పక్షమున ఇందసాధ్యమేమియు లేదు.

## భోజనవిషయమున గమనించవలసిన విధులు

భోజనముచేయుటకుఁ బూర్వము నిర్మలమైన హృదయము గలిగి యుండవలెను. తగినంత శుభ్రమైన యాకలి యుండ వలెను. ప్రాతఃకాలమునందే మలవిమోచనము, దంతధావన వ్యాయామ స్నాన సంధ్యాది కర్మలఁ దీర్చిన మనుష్యుడు చక్కగా కాళ్లు చేతులు కడుగుకొని, మడిబట్టల గట్టుకొని మరి భుజించవలెను. తాను భుజించు ప్రతిపదార్థమును చక్కగా ఉమ్మినీరుతో గలియునట్లును నమలి మ్రింగవలెను.

త్వరపడి తినుటవలన లాభములేదు. "మగవాడెంత త్వరగతినిన నంతమంచి" దనుసామెత హిందువులలోఁగలదు. ఇది చాల పొరపాటు. నోటియందు జీర్ణముకావలసిన పదార్థములు జీర్ణములుగాక ప్రేగుల కెక్కువ పరిశ్రమ గలిగించిన వారమగుదుము. గాన నెమ్మదిగ నమలి ఘనపదార్థములు వాని యంతట నవి జారునట్లు చేయవలెనేగాని గొంతుక దిగకమంచినీళ్ళు మ్రింగి ముద్దదిగునట్లు చేయరాదు.

ఉడికిన పదార్థములు దినువా రుడికిన జాములోపల వానిని భుజించవలెను. మిక్కిలి వేడిగానున్నపదార్థములను మిక్కిలి చల్లారిన పదార్థములను దినరాదు. ఉదయమునందు చలిది యన్నమును తిను నలవాటు మంచిదికాదు. వేడియన్నమే తినవలెను.

మనుష్యునకు ద్రవపదార్థ మవసరములేదు. ద్రవపదార్థము నమల నక్కరలేక కడుపులోనికిపోవుటచే- ఉమ్మినీటితోఁ గలియక పోవుటచేతను, బండ్లకు పనికల్పించక పోవుటచేతను ఆలస్యముగ జీర్ణమగును. మితిమీరి తినుట కవకాశమిచ్చును. అందువలన పొట్టను పెంచును. ప్రేగులను సాగజేయును. గాన ద్రవపదార్థములైన చారు, పులుసు, మజ్జిగ, పాలు మొదలగునవి వదిలివేయదగినవి. వైద్యులు ద్రవపదార్థము తేలికగ జీర్ణమగునని తలంచెదరు. ఇది శుద్ధపొరబాటు. ఘన పదార్థములు నోటియందే కొంతభాగము జీర్ణమగును. మిగిలిన వానిని జీర్ణముచేయగల రసములు పొట్టయందును, జిన్న ప్రేగులయందును గలవు. వీని సహాయమున త్వరలో జీర్ణము

లగును. ద్రవపదార్థములు నోటిలో నుమ్మినీటితోఁ గలియు వరకు నాగవు. జీర్ణమగుట కేర్పడినరసములు ద్రవపదార్థములతో గలియునపుడు పలచబడి సారహీనములగుటచే త్వరలో జీర్ణము చేయజాలవు. ద్రవపదార్థములు రుచికల్పితములుగాక ఉపయోగింపబడవు. ఈ రుచిచే విశేషముగా పుచ్చుకొనుట తప్పదు. అందువలన జీర్ణకోశము సాగిపోయి ఎక్కువగా పుచ్చుకొనినగాని ఆకలి తీరినట్లుండదు. క్రమక్రమముగా ఉదరములు గొప్పవగును. గోధుమరొట్టెలుతిను ఉత్తరాదిదేశస్థులు అంత బొజ్జలు కలిగియుండక పోవుటకు కారణము వారు అంతగా ద్రవపదార్థముల నుపయోగింపకుండుటయే. ఉప్పు, కారము, పంచదార, మొదలగు విదాహకర పదార్థములను తిననివారికి దాహమేగాదు. దాహమైనను మంచినీళ్ళవలననే దాహము తీరును. మంచినీరైనను భోజనాత్పూర్వము ఒక గంట ముందుగాని; భోజనమైన పిమ్మట ఒకగంటకు తరువాత గాని పుచ్చుకొనవలెను. భోజనమగునపుడు ముద్దలు జారుటకు గాని, కారము పోవుటకుగాని మంచినీళ్లు పుచ్చుకొనుపద్ధతి చాలతప్పు. జీర్ణముచేయురసములు మంచినీళ్ళచేఁ బల్చపడి పోవుటవలన పదార్థములంత త్వరగా జీర్ణములుగావు. గాన మధ్య మధ్య పానీయములు పనికిరావు.

భోజనమైనపిమ్మట చక్కగా నోటిని, చేతులను, కాళ్లను కడుగుకొనవలెను. పళ్ళలో నిరుకుకొన్న చిన్న చిన్న ముక్కలను ఏశలను చీపురుపుల్లవంటిదానితో తీసివేసి, పుక్కిలించి ఉమ్మివేసి పళ్ళను శుభ్రపరచవలెను.

భోజనము చేసినవెంటనే కొంతదూరము నడువవలసి వచ్చినను నడచుటకు ఆయాసము గలుగకుండునట్లు పొట్టలో 3/4వంతు నిండునట్లును, 1/4 ఖాళీయుండునట్లును భుజింపవలెనేగాని పూర్తిగాఁ బొట్టనిండఁ దినరాదు. భుజించిన యరగంటలో ఘనపదార్థములు, రసములతో గలసి యుబుకును. అప్పుడు ఖాళీలేకుండిన ఆయాసముగా నుండుటయు, ఆరసములతో పదార్థములు బాగుగా కలియుటకు తగినఖాళీ లేకపోవుటయు తటస్థించును.

భోజనమైనపిమ్మట పగటిపూట కొంత విశ్రాంతి తీసికొన వలెను. రాత్రిపూట తేలికయైన వ్యాయామము, నడకవంటిది తీసికొనవలెను. రాత్రులయందు భోజనమైన వెంటనే పరుండి నిద్రించరాదు.

తాంబూలము, చుట్ట మొదలగునవి జీర్ణకర్మను చెరుపును. గాన వాటిని వదలవలెను. సోడాకూడ నిట్టిదే.

## ౧౨. ఉ ప వా స ము లు

సృష్టియందు ఉపవాసములు అన్ని జీవరాసులయందును గాన బడుచున్నవి. శీతలదేశములందు ధృవప్రాంతజీవులు శీతకాల మెల్ల నిరాహారులై కండలెల్ల బోగొట్టుకొని వసంతఋతువు నందలి పచ్చికను తిని తిరిగి బలపడుచున్నవి. పాములు పూర్తిగా ఒక్క ఎలుకనో కప్పనో తిని అది యరుగువరకును ఆహారమును ముట్టక ఉపవసించును. అట్లే మనమును పండుగలకో విందుల యందో అధికముగ దినినపుడు తిరిగి కర కర యాకలి యగు నంతవరకు ఒకటి రెండుపూట లుపవసించుట శ్రేయోదాయ

కము. అంతేగాక హిందువులలోను మహమ్మదీయులలోనుగూడ మతవిషయికమైన ఉపవాసములు విధింపబడియున్నవి. మతములను పాలించు మతాధికారులుండిన అట్లు చేయనివారు నిందితులగుదురుగదా? ధర్మశాస్త్రములు వైద్యశాస్త్రమునుబట్టియే యేర్పడినవిగాన ఆచారములును, ఉపవాసములును ఆరోగ్యసాధనకే నిర్ణయింపబడినవి. హిందూమతమున ఏకాదశులును మరికొన్ని పర్వదినములైన శివరాత్రి, చవితి, షష్ఠి, శ్రీరామనవమి, కృష్ణాష్టమి, కార్తికసోమవారములు, పూర్ణిమ, అమావాస్య, మాసశివరాత్రి మొదలగు కొన్ని అర్ధోపవాసములకును పూర్ణోపవాసములకును ఏర్పరచబడినవి. ఇవిగాక తద్దినంబున భోక్తలును కర్తయు సాయంత్రిమందు భుజింపరాదను నియమముగలదు. అనగా ఆరోజున మితిమీరి భుజింపబడును గాన సాయంత్రిము మానినగాని జీర్ణము గాదుగదా! ఇట్లే మాసమునకు రెండు మూడును, అప్పుడప్పుడు ఆకలి లేనపుడును, జిహ్వ రుచిని గోల్పోయినప్పుడును పూర్ణోపవాసములుగాని లేక తేలికగా దినిగాని యుండుట ఆరోగ్యమును పునఃస్థాపించుకొను సాధనమగును. తేలికగా భుజించుట యన కేవలము ఫలాహారము గాని లేక ఒంటిపూట భోజనముగాని చేయవలెను. సంసారము నందున్నవారికి ఉపవాసములు పనికిరావని కొందరి మతము. ఇట్టివారు తులసితీర్థమునుగాని, నిమ్మకాయ రసము పిండిన నీటినిగాని తీసికొని ఉపవసించినయెడల మనస్తృప్తి గల్గునుగదా! అప్పుడప్పుడు 4 లేక 5 రోజుల నిట్లు దీర్ఘోపవాసములు గూడ పూర్తిగా ఆకలి గలుగువరకును జేయ

వచ్చును. ఉపవాసకాలమునకంటె పథ్యము తీసికొను రోజున జాగ్రత యవసరము. ఎన్నిరోజు లుపవసించెదరో అంతకు రెట్టింపురోజులకు గాని పూర్వాహారపద్ధతికి రాగూడదు. మొదటిరోజున లేతకొబ్బరినీగును, మరునాడు నీరును, లేత కొబ్బరి మీగడయు, మూడవనాడు నారింజ బత్తాయి మొదలగు ఫలములతో నవియు తినుచు క్రమముగ మామూలు భోజనమునకు రావలెను. ఆరోగ్యము చెడగలదను సంశయముతోచినప్పుడే యిట్లొనర్చిన ఆరోగ్యమెప్పుడును చెడదు. గర్భిణిస్త్రీలు సైతము నిట్టి యుపవాసములు చేయవచ్చును. ఉపవాసములు ఆయుర్దాయమును గూడ బెంచును. రోగమధికముగా నున్నప్పుడు తప్పక ఉపవాసము చేయదగినది. అట్టి సమయములందు గలుగు నీరసము ఆహారముచే బోవునది గాదు. జీర్ణకోశము బొత్తిగా పనిచేయదు కాన ఉపవాసము ఆరోగ్యదాయకము. వ్రణములు, గోరుచుట్టు, చనుగురుపులు, నోటియందలి రణములు ఇవియన్నియు పక్వదశకువచ్చి అతి బాధగా నున్నప్పుడు 1 లేక 2 ఉపవాసములతో చిటికి చీము నొడ్చివేసి బాధతగ్గును. గాయములందు రక్తము గారినప్పుడు గూడ ఉపవాసమువలన చికిత్స తేలికయుగును. నిద్రమాని నాటకములు చూడగోరువారు రాత్రిభోజనము మానినయెడల ఆరోగ్యము అంతగా చెడదు. అట్టివారు భోజనమునకు దోడుటీగూడ త్రాగిన మరింత బాధ నొందుదురు.

అలోపతివైద్యులు లంకణమన భయపడుదురు. శరీరబరువు తగ్గినదన్న వీరికి భయము. రోగమునందు మస్తుగ తిండి బెట్టుటయే వీరిమతము. ఆయుర్వేదవైద్యులుగూడ ఇటీవల కలి

యుగమునందు అన్నగత ప్రాణులనియు, లంకణము పడద
నియు వాదింతురు. తూర్పున పాషాణ మెక్కువ వాడుదురు.
అందుచే లంకణమే కట్టరు. అన్నగత ప్రాణులనుటకు నిదర్శ
నము లేనియు లేవు. ఇటీవల మనదేశమునందు మహాత్ముడును,
ఇతరదేశములందు ఉపవాస చికిత్సకులును ఈశాస్త్ర మబద్ధ
మని ఋజువుచేసి యున్నారు. ప్రకృతివైద్యులుకూడ నీ
విధానమును పూని ఆరోగ్యవంతులుగజేసి చూపుచున్నారు.
నానరోగము రాకముందే ఉపవాసములుండిన ఆరోగ్యము
చెడనే చెడదు.

## ౧౩ పానీయములు

### ౧ మంచినీరు

జీవకోటికంతకును నాహారముకంటెను నధికావసర మగు
నది జలము. భోజనము లేకుండ మంచినీటిని త్రాగి కొన్ని
రోజులు జీవింపవచ్చునుగాని దాహము దీర్చకుండ కొన్ని
గంటలైనను జీవింపజాలము. వేసవికాలమందు నీళ్లులేని స్థల
ములందు వడగొట్టి చనిపోయినారను వార్తలు వినుచునే
యున్నాము. కావలసినంత జలము పుచ్చుకొనని యెడల
రక్తము చిక్కపడి దాహమగును. మంచినీళ్ళు త్రాగుటవలన
వడదీరును. మంచినీరు త్రాగుటవలన వడదీరునట్లు ఇతర
పానీయములచేఁ దీరదు. ఇంతయవసరమగు జలము శుభ్రమై
నది కాకపోయిన యెడల ననారోగ్యము గల్గును. దయాళు
వైన పరమాత్ముఁడు సమస్తమైన జీవకోటికిని బహుతేలికగా
కావలసినంత జలము దొరకు నేర్పాటులు చేసియున్నాడు.

ప్రపంచకమందు మూడు వంతులు జలమును ఒకవంతు భూమి యునుగలవు. ప్రతిసంవత్సరమునందును అపరిశుభ్రమైనజలము నంతయును సూర్యరశ్మిచే నావిరిగా మార్చి శుభ్రపరచి తిరిగి వర్షరూపమున దయచేయుచున్నాడు. నీటియందు తిరిగి చేరు చుండు కల్మషములను తినివేసి శుభ్రపరచుటకు తగిన జల చరముల సృష్టించియున్నాడు. సర్వకాలములయందును సర్వ ప్రదేశములందును నీరుదొరకుటకుగాను నీటికి పారుదలయేర్ప రచి ప్రవాహరూపమున భూమియందంతటను జలము లభించు నేర్పాట్లు గావించియున్నాడు. ఇట్లతిసులభముగ దొరుకునట్లు చేయుటయేగాక మన సర్వపాపములను హరించి, సర్వరోగ ములను గుదుర్చుశక్తిగల మహౌషధముగ సృష్టించియున్నాడు. నీటియొక్క శక్తి యింతయని తెలిసికొనుటకు బ్రహ్మ కైనను తరముగాదు. నీటియొక్క శక్తినిగూర్చి వేదములందును ఆయుర్వేదమునందును పూర్తిగఁ దెలుపబడియున్నది, అది నారాయణ స్వరూపమే! దానిశక్తిని గ్రహించిన నవనాగరికు లగు పాశ్చాత్యులు యంత్రముల నడుపుటయందు దానిశక్తి నుపయోగించి యెంతటిపనులనైనఁ జేయించుచున్నారుగాని, రోగనివారణమందు దానికెట్టి శక్తిగలదో పరీక్షించి చూడ లేదు. కొంతమంది - కూనీమహర్షి, జష్టు, నీప్ మొదలగు ప్రకృతి వైద్యులు దీనిశక్తిని గ్రహించి తమ జ్ఞానముచే లోకో పకారమగున ట్లనేక గ్రంథముల వ్రాసియు, ననేక రోగముల గుదిర్చియున్నను, లోకసామాన్యమున కా వైద్యమును బోధించి వ్యాపింపజేయ వలసినభారము పాలకులయందున్నను నింతవర కే పాలక వర్గముగాని తగు చర్యఁదీసికొని, యీ

మహానీయులకుఁదగిన ధనసహాయముచేసి వైద్యశాలలనిర్మించి మనుష్యజాతి సంతసమొందించుటకు సిద్ధమైయున్న ఔషధ వైద్యమును విడిపింపఁ జూచుటలేదు. రస, విష, గంధక, పాషాణాదులతోను, తత్సమాన మూలికలతోను తయారగు నౌషధములను సేవింపజేసి శరీరములఁ బాడుచేసి, తరుణరోగములనెల్లఁ గాలిక రోగములుగా మార్చుటవలన మనుష్యజాతి ప్రస్తుతమున్న దుస్థితిలోనికి వచ్చియున్నది. ఇట్టి స్థితినుండి మరలించి భూలోకమును స్వర్గలోకముగా మార్చగలశక్తి సర్వరోగ నివారిణియగు జలమునందేయున్నది. దాని నుపయోగించుకొనుటకు దగిన శక్తియు, బుద్ధియు మాత్రము గావలెను. రోగి దాహముచే నోరెండి యేడ్చుచుండ మంచినీరు త్రాగిన జబ్బని, సోడా నిప్పించెదరు. లేక ఆనీటిలో నౌషధ వస్తువులఁగలిపిగాని, కాచిగాని దానియందలి రుచికి సహజశక్తిని మార్చి యిప్పించెదరు. నీటిని భూచరములగు జంతువులన్నియు కల్మషములుగ జేయుచున్నమాట నిజమే. అయినను సర్వసాక్షియగు పరమాత్ముడు దీనికి ప్రతిక్రియగా జలచరముల సృష్టించియు, సూర్యరశ్మిచే కాచియు తిరిగి పరిశుభ్రముగ జేయుటకు దగిన యేర్పాట్లు గావించియున్నాడు. మనుష్యుఁడు తప్ప నితర జీవజంతువు లేవియు నితరపానీయములఁ గోరవు. మనుష్యుడును నితర పానీయములతో నిమిత్తములేకుండ బ్రదికినచో నీరోగియై బ్రదుకఁగలడు. లోపలకు బుచ్చుకొనుట వలనను, పైనపోయుట వలనను, నావిరి తుషార స్నానములవలనను సర్వరోగములను నీరు కుదర్చగలదు. మనము నమ్మి దాని నుపయోగపరచుకొనుటయే చేయవలసినపని.

## ౨ పా లు

ప్రపంచకమునం దెల్లయెడల, అన్ని జాతుల మనుష్యులును పాలను విశేషముగ నుపయోగించుచున్నారు. మన పూర్వులగు మహాఋషులు సైతము పాలను నమృతమువలె నుపయోగించినట్లు గ్రంథములవలనఁ దెలియుచున్నది. పాలిచ్చు నావులను విశేషముగ సంపాదించి వాని నతి దయతోఁ బెంచుటయేగాక, గోవును దైవసమముగ బూజించియున్నారు. చక్రవర్తులు వేలాది గోదానములను జేసినట్లును, అధికగోవుల గలిగియుండుటయే భాగ్యలక్షణముగ నెన్నబడుటయు నాచ్యలందుండెడివి. సర్వక్రతువులందును బాలుకావలెను. పాలకింత ప్రాముఖ్యము గలుగుటకుఁ గారణమును దెలియవలసియున్నది. పూర్వకాలమునందును నిప్పుడునుగూడ శాస్త్రపరిశోధనల వలన పాలయందు మనుష్యుఁడు జీవించుటకుఁ దగిన పోషక పదార్థములన్నియుఁ దగిన ట్లున్నవనియు, నితరపదార్థము లక్కరలేకయే పాలతో నెంతకాలమైన జీవింపవచ్చుననియుఁ గనిపెట్టియున్నారు. కాననే రోగులకు బాలనిచ్చెదరు. యోగులును, బలముఁగోరువారును పాలనుబుచ్చుకొందురు. ఇవి యందరకును దెలిసినవిషయములే గానిపాలు అస్వాభావిక పదార్థముగ ప్రకృతి శాస్త్రవేత్తలచే నిర్ణయింపబడినవి. ఏలనన నేజంతువు పా లా జంతువుయొక్క బిడ్డకె సృష్టింపబడినవేగాని మనుష్యుని కొఱకై కాదు. మనుష్యుడు తనదుర్మార్గముచే దాని బిడ్డను రాటకు విరిచికట్టి దాని పాలను బలవంతముగఁ బిండుకొనుట ఘోరపాపకృత్యము; పశువును మనము మేపుట లేదా యందురేమో? మేపుట స్వలాభముకొఱకే! మేపుకూలి

దాని దూడలలో మొగవానివల్లను, ఆడవాని నమ్ముకొనుట
వల్లను కూడి రాగలదు. ఇంతేగాక మనుష్యులు గాక యే
యితర జంతువును బాలువిడచిన తరువాత తిరిగి పాలు త్రాగు
టకుఁ గోరదు. ఏ జంతువు పా లాజంతువు యొక్క లేగ కను
కూలించియుండుచుగాని మరియొక జాతి లేగ కంతగ నను
కూలించవు. పాలు ద్రవపదార్థమగుటచే జీర్ణమగుటకూడ
కష్టము. ఇవన్నియు నిట్లుండ పాలు బాగుగనుండి సరిగా
నోటిలోనికి పోవలెనేగాని పాత్రలోనికి పిండ దగ్గవికావు. గాలి
తగిలినంతనే పాలయందు క్రిమిపుట్టి వానిగుణమును జెఱచును.
అందుకొఱకే పాలనుకాచి పుచ్చుకొనిన క్రిమిచచ్చునని పచ్చి
పాలను పుచ్చుకొనక బాగుగ మరగించి తీసికొనుచున్నారు.
ఇందుకూడ వైద్య సాంప్రదాయకులు పొరబడియున్నారు.
పురుగు చెడు పదార్థము నందే బుట్టునుగదా! కాచినపుడు
పురుగు చచ్చునేగాని చెడిన పా లెట్లుబాగుపడును? కల్మష
పదార్థము కాచుటవలన గట్టిపడి పాలయందే నిలుచును గాన
చెడిన పచ్చిపాలకంటె వాటిని కాచినందువలన వచ్చులాభము
లేదు. కాచిన పాలు పచ్చిపాలవలె సులభముగ జీర్ణముగావు.
పచ్చిపాలయందుగల నీరు కాచుటచే విరిగి పాలు చిక్కబడును.
గాన తేలికగా జీర్ణముగావు. ఇంతేగాక పాలిచ్చు పశువులను
స్వేచ్ఛగా పచ్చికబయలునందు మేయనిచ్చుటలేదు. దాని
స్వాభావికాహారమును మాన్పి యధికముగఁ బాలు గలుగు
టకుఁగాను, గుగ్గిళ్లు, కుడితి, నాని పులిసిన గింజలపిండి, ఇంకను
కొన్ని బస్తీలయందు కల్లు మొదలగు దుష్టపదార్థముల నిచ్చి
మేపి ఇంటియందు బంధించుచున్నారు. శుభ్రమైనగాలి, స్వాభా

వికమైన పచ్చగడ్డి, ప్రవాహోదకము త్రాగి సుఖముగ జీవించు పశువును కట్టళ్ళలోనుంచుటచేత దాని యారోగ్యము చెడి యదికూడ రోగియగను.

ఆ పాలు ద్రాగుటచే మన రోగమునకు సహాయముగా నిట్టి పశువుయొక్క రోగములు కూడ మనకంటును. ఈ కారణ ములచే పాలు త్రాగదగినవి కావు. చంటిపిల్లలకు వాడవలసి వచ్చినపుడు పొదుగునుండి తీసిన వెంటనే పచ్చివి యివ్వ నగును. కొంచమాలస్యమైన యెడల కొంచెము వెచ్చజేసి యివ్వవలెనే గాని మరుగ గాచకూడదు. పాలను విడువలేని పెద్దలుకూడ నిదేరీతిని పచ్చిపాలు బహుకొద్దిగా జీర్ణశక్తిని బట్టి ద్రావవగును. మనదేశమున పూర్వకాలమందు గోభూమి కావలసినంత యుండెడిది. పంటభూమి తక్కువ. పండించుట యెరుగరు. అట్టితరుణమందు పాలను యోగ్యమైనవిగా సేవిం చువారు. ఆపశువులు స్వాభావిక జీవులుగాని కృత్రిమాహార జీవులుగావుగాన, ఆ పాలవలన అంత విపరీత గుణములు లేవు. పరిస్థితులు మారినప్పుడు వానిని బట్టి మన యాహారములను మార్చవలెను. గాన మన పూర్వులు వాడెడు పాలను మనము వాడ గూడదని నిష్కర్షగా జెప్పనగును.

## ౩. పెరుగు, మజ్జిగ, వెన్న, నెయ్యి

పాలు అస్వాభావికములును, విడువదగిన వనియు నేర్పడగా వానిని మరికొన్ని మార్పులను, బొందించి, వానినుండి తీయు పెరుగు, పాలకంటె జబ్బుది. భోజనమునందు ఆఖరు పదార్థ ముగ పెరుగు వాడుదురు. పాలను కాచి తోడు పెట్టి యొక

రాత్రి నిలువ యుంచుటచే పెరుగు వచ్చును. పాలలోగల వెన్న (క్రొవ్వుపదార్థము) దీనిలో లేదు గాన అంత బలము లేదు. నిలువ యుండుటవల్లను, మార్పుజెందుటవల్లను జీర్ణమగుట యందు పాలకంటె తక్కువ విలువగలది. అన్నిఘన పదార్థములను దినినపిమ్మట పెరుగు త్రాగుదురు. ఈ ఘన పదార్థములు జీర్ణమగుటకు కావలసిన వేడిని పెరుగు తగ్గించునుగాన మందకొడిగా నుండును. అగ్నిదీప్తిని తగ్గించి మందాగ్నిని గలుగజేయును గాన తగినంత దేహ పరిశ్రమ గల వారికి గాని పెరుగుతో కూడిన భోజనము జీర్ణముగాదు.

మజ్జిగ పెరుగుకంటె దక్కువ దోషయుక్తమైనది. పాలనుండి వచ్చునదిగాన మంచిదిగాదు. జీర్ణకోశము నందలి వేడిని మందగింప జేయును. అందుచే మందాగ్ని యేర్పడును. సమస్త రోగముల యందును నపథ్యము. భోజనమందును జ్జిగ, పెరుగు, పాలు మాని వాడిగా లేచినయెడల శీతదోషముచేతను, అజీర్ణముచేతను గలుగు రోగములన్నియు శమించును. పులిసిన మజ్జిగ జీర్ణకారియని కొందరి మతము. పులియుట యన శిలీంధ్రము లందు పుట్టుటగదా! ఈ శిలీంధ్రములు శరీరము నేల పాడుచేయకుండును? అప్పుడు చిలికిన మజ్జిగయే పులిమజ్జిగ కంటెమేలు. కొందరు శాస్త్రవేత్తలు పరిశోధనల గావించి మజ్జిగయందు విటమిను లధికముగ నుండుటచే మజ్జిగ శరీరమున కత్యంతయుపయుక్తమని దెల్పుటచే జాలమంది మజ్జిగ నెక్కువ వాడవలయునని తలంచుచున్నారు. ఇది వట్టి పొరబాటు. అస్వాభావిక వస్తువు లెప్పుడును మంచివిగావు. అస్వాభావికములగు మత్స్యమాంసములకంటెను, మద్యముకంటెను

మేలైనవి గావచ్చునుగాని స్వాభావిక పదార్థములైన పండ్లకంటెను, శాకాదులకంటెను మంచిదిగాదు. కాన వర్జనీయము.

వెన్న, నేయి, పాలనుండి తీసినక్రొవ్వు, జంతు సంబంధమగు చమురు వృక్షసంబంధములగు చమురులైన నూనెలకంటె తక్కువ యుపయోగమైనది. పాలను త్రాగినపుడు ఈ క్రొవ్వు మన శరీరమునందు తగినంత జీర్ణశక్తి యుండిన జీర్ణమైన గావచ్చునుగాని ప్రత్యేకముగా దినినను భోజనమునందు వాడినను జీర్ణముకాదు. క్రొవ్వు పదార్థములు నోటియందును, పొట్టలోను జీర్ణముగావు. చిన్న ప్రేగులలో గొంత జీర్ణమగును. కొంత మలముతో పోవును. మలముతోపోని క్రొవ్వు చర్మముక్రింద నుండును. దీనివలన మనుష్యునకు నిగనిగయును స్థూలశరీరమును వచ్చును. శరీరమునకు చలితగ్గును. క్రిందపడినపుడంత దెబ్బతగులదు. ఇంతకంటె దాని యుపయోగము లేదు. జీర్ణకోశమున కధికశ్రమ గలుగ జేయుటచే నజీర్ణమును బుట్టించును. అజీర్ణము సర్వరోగములకు మూలము గాన నేతివలన నుపయోగములేదు. దీనివలన దేహదార్ఢ్యము గలుగదు. మనుష్యులలో నేయి వాడువారు నూటికి ముప్పదిమంది కంటె లేరు. నేయి త్రాగెడువారికంటె ఇతరులే బలముగా నుండుట మన మెరిగినదే. నేయి త్రాగెడివారి శరీరములు బలములేని గుల్ల శరీరములు. ఈనేతికొఱకు సంసారములు చెడుచున్నవి. ఇట్టి నిరుపయోగమై దరిద్రహేతువైన నేతికొఱకు పాటుపడి యనారోగ్యమును దెచ్చుకొనుటేల? రుచికొఱకే గద! రుచుల దేవతారాధన మానినగాని యారోగ్యము

గలుగవలెగాన నేయి వాడదగినదికాదు. జంత్వాహారము దినని వారు నేయి నేలుపయోగింప వచ్చును?

ఐనను హిందువులు నేతికి బహు ప్రాముఖ్యము నిచ్చి సర్వ పదార్థముల నభిఘరించుటచేత నేయి పవిత్రవంతములుగ జేయుచని తలచియున్నారు. క్రతువు లందును, నిత్యనైమిత్తికాది సర్వకర్మలందును, అగ్ని కార్యములందెల్ల నాజ్యమును హోమము చేయవలెను. భోజనపదార్థములను హోమద్రవ్యములను నేతితో నభిఘరించవలెనని శాసించియున్నారు. అగ్నిలో వేల్చునపుడు నేతిని వాడుటకు దానియందేదో గొప్పమహిమ యుండినను భోజనమందు వాడుటకు దాని రుచియే కారణమని తలంచవచ్చును. మనుష్యుని శరీరమునందు క్రొవ్వు గనబడుచున్నది. దీనిని వృద్ధిపరచుటకు క్రొవ్వు తినవలెనని చెప్పు శాస్త్రజ్ఞుల మాటలు నమ్మవలసినపనిలేదు. శాక, ఫలాదులనుండి ఆయా అవయవములు శరీరమునకు గావలసిన క్రొవ్వును దయారుచేయునే గాని, తయారై సిద్ధముగానున్న నేతినుండియు, చమురులనుండియు క్రొవ్వు నుపయోగించు కొనవు. అవయవములవలన దయారుచేయబడిన క్రొవ్వే మన శరీరముల కుపయోగించును. చమురులలోని క్రొవ్వు వృథగా మలమునందును చెమటయందును పోవును గాన జంతుపదార్థమైన నేతిని వాడగూడదు. ఇది యింటిని నోడలినిగూడ గుల్లచేయును. బ్రాహ్మణ యీనాములన్నియు పోవుటకు నేయియే మొదటి కారణము.

## 4. చెడ్డపానీయములు

పాశ్చాత్య నాగరికతా మాహాత్మ్యముచే మనదేశ జనుల కల వాటై, సంసారముల గుల్లచేసి, మనుష్యుల ననారోగ్యవంతు లుగ మార్చి నిత్యమును వైద్యులదయకు పాత్రులనుగ జేయు చున్న దౌర్భాగ్య పానీయములలోనెల్ల కాఫీ, టీ, కోకోలు ముఖ్యములైనవి. ఇవి క్రమముగ ప్రజలలో నూటికి బదిమంది వఱకును దాసులను జేసికొనినవన్న నతిశయోక్తి గాదు. ఇవి కూలిజాతులలోగూడ చద్దియన్నము, గంజీ పుచ్చుకొనుటను మాన్పించి వాని స్థానము నాక్రమించినవి. గ్రామమునకు కల్లంగ డొక్కటే యుండును గాని కాఫీయంగడులు పెక్కు లుండును. వీనిలోనికిబోయి త్రాగుట యగౌరవముగ నెన్న బడుటలేదు. అరుణోదయమునకు పూర్వము స్నానముచేసి సంధ్యాది కృత్యముల నెరవేర్ప వలసిన బ్రాహ్మణు డీయంగ డిలో సూర్యోదయాత్పూర్వము భుగ్గుభుగ్గున ఆవిరివచ్చు "అగ్ని దీపకమనఁదగు" కాఫీని త్రావుచున్నాఁడు. దీని ప్రభావమున సర్వవర్ణములవారును గలసి సహపంక్తివిందు లారగించుచున్నారు. వేళకు భోజనము లేకుండనుండగలవా రుందురు గాని కాఫీ కడుపులో బడకుండిన పిచ్చియెత్తనివారు లేరు. ఇట్టి ప్రభావము గల యీ పానీయముల గుణముల విచారింతము. కాఫీ యందు, కాఫీన్, టీ యందు టానిన్, కోకోయందు కోకేన్, అనువిషము లున్నవి. ఈ విషము లను వేరుచేసి పుచ్చుకొనినచో మనుష్యుని జంపగలవు కాని యీ విషములను దినమును మనము త్రాగెడు కాఫీ మొద లగు పా నీ య ము ల నుం డి కొ ద్ది కొ ద్ది గ శ రీ ర

మందు ప్రవేశించుటచే నొకవిధము గ చురు
కును బుట్టించును. ఈ విషములు నరములను చురుకుగా
పనిచేయునట్లు ప్రోత్సహించుటచే నవి త్వరలో శక్తిహీనము
లగును. నరముల కేవిధమైన శక్తిని గలిగింపకుండగనే వాటిని
బాధించి చురుకు గలుగజేయుటచే నవి శీఘ్రకాలములోఁ
జెడును. బలహీనము లగుటచేఁ గదలలేవు. కాని కాఫీ
త్రాగిన వెంటనే మాత్రము దాని బాధలకాగలేక "ఓపికలేని
గుఱ్ఱము కొరడాదెబ్బకు వెరచి పరుగెత్తిన విధమునఁ" జురుకుగా
పనులను జేయుచున్నవి. అట్టి బండిగుఱ్ఱము వలెనే మనుష్యు
నివి యకాలమృత్యువు వాతఁ బడజేయుచున్నవి. చురుకుఁ
బుట్టించు స్వభావముచే నివి కొరడావంటి వని చెప్పవచ్చును.
కొరడా గుఱ్ఱమున కెంత యుపయోగమో కాఫీ మొదలగు
పానీయములు మనుష్యుని కంత యుపయుక్తములు. కొద్ది
కాలమునకు గుఱ్ఱము తన శక్తిని గోల్పోయి కొరడాతో
మోదినప్పుడు పరుగెత్తుటకు బలము లేక బుర్రనాడించును.
అట్లే కాఫీదాసులు గూడ బలహీనులై ఆకాఫీవల్ల గూడ
చురుకుగఁ గాదుగదా మెల్లగానైనను పనులు చేయలే
కుందురు. పాముల పుట్టలవలె శరీరములు గుల్లలై జవసత్వ
ములు నశించి రోగపీడితులై కాఫీవల్ల పోగా మిగిలిన యాస్తి
నమ్మి వైద్యుల ముడుపుల జెల్లించి తామును తమమీద
నాధారపడి యున్నవారును తినుటకు తిండిలేక భూమికి
భారమగు చున్నారు. ఇందసత్యమేమియు లేనట్లందరకును
దెలియును. కల్లు, గంజాయి మొదలగు నిషావస్తువులవలె
నొకసారి యీ దురభ్యాసమున కలవడిన మనుష్యుడు దానిని

విడువజాలదు. ఈ పానీయము లతివేడిగ నున్నపుడే పుచ్చు కొన దగినవి గాన నాలుకయు, పేగులును గూడ మాడి వాటి మృదుత్వమును పోగొట్టు కొనును. మందుల వైద్యు లీరోజులలో కాఫీమాత్ర మిచ్చిలంకణములఁ గట్టుచున్నారు. దీని దుర్గుణముల వా రెరుగక యిట్లు చేయుచున్నారని చెప్ప జాలను. గాని రోగమును త్వరలోఁ గుదుర నిచ్చిన తమకు బూర్తియైన కట్నము దొరకదని రోగమును బెంచి రోగి తన చేతులలోనుండి త్వరగ దాటిపోకుండఁ జేయుటకే కాఫీ నిచ్చుచున్న ట్లూహించవలెను. కాకున్న దెలిసియుండియు గట్టి లంకణము కట్టుటకు బదులు, పనికిమాలిన దని తెలిసి యుండియు కాఫీ నిప్పించుటయందా వైద్యుని యభిప్రాయ మేమి ? కాఫీ, యందు పోయు కొద్ది పాలలో దప్ప బలము నిచ్చుట కిందేమిగలదు ? రోగ పదార్థమును దొలగించుటకు ప్రయత్నముచేయు జీర్ణకోశమునకు పనికిమాలిన యీ ద్రవ పదార్థమును జీర్ణము చేసికొను పనిని గల్పించి దాని యుద్య మమును పాడుచేయుటచే నాల్గురోజులలోఁ గుదురు రోగము కుదురుటకు నెలలుపట్టును. లంకణవైద్యము యొక్క శ్రేష్ఠత పాశ్చాత్యులుకూడ గ్రహించియున్నారు. ఆహారమివ్వక తప్ప నిచో నారింజ మొదలగు ఫలముల నివ్వనగునుగదా ? చలి దేశములందు పడకనుండి లేవ లేనంత బధకముతోను, తక్కువ చర్మపు వేడితోను నుండు పాశ్చాత్యులీ యగ్నిద్రావక మును గ్రోలి చురుకు గలవారమగుదు మని అభ్యాసము చేసి కొని యున్నారు. గాని మన దేశమున కిట్టి పానీయము లవ సరము లేదు సరిగదా, వీనివలన నారోగ్యనాశన మగును.

పెద్దవారికిట్టి దురలవాట్లవల్లఁ జెడియు వారిబిడ్డలకుఁగూడ కలవాటుపరచుట విచారకరము. చుట్టగాల్చు రయితు తన కుమారుని చుట్టగాల్చి తెమ్మనును. అట్లే కాఫీ త్రాగు తండ్రి బిడ్డలను దనచుట్టు గూర్చుండబెట్టుకొని సంతోషముతో త్రాగించును. మఱికట్టుబాట్లను, ఆచారములను మంటగలిపి యిట్టి దురలవాట్ల పాలుజేయు తల్లితండ్రులు శత్రువులని చెప్పవలెను. ప్రతిపిల్లవాడును తగినంత సంపాదకుడగునని చెప్పజాలము. నిరుద్యోగబాధ వ్యాపించిన యీ దినములలో సంపాదనలేకున్నను ఖర్చుబెట్టుట కలవాటుపడినవారి గతి యేమగునో ఆలోచింపుము. ఇట్టిబాధలు గలిగి రోగోత్పత్తికి బీజమైన కాఫీ మొదలగు చురుకు పుట్టించు పానీయములు వర్జనీయములు.

సోడా, నారాయము, కొన్ని పరబత్తులును ఔషధపానీయము లని వాడబడుచున్నవి. సోడా జీర్ణకోశము మీద పనిచేసి అజీర్ణముగా నున్నపుడు జీర్ణముచేయుననియు, దాహమగునపుడు పుచ్చుకొనిన దాహము దీర్చుటయేగాక నీటి యందుగల శైత్యాదిదోషములు దీనియందు లేవనియు సేవింపుచున్నారు. ఇదెట్లు పనిచేయునో చూతము:—ఇదియును చురుకు బుట్టించు పదార్థమే. అవసరమైన దాని కంటె అధికముగా దిని దాని నంతను జీర్ణము చేయునట్లు జీర్ణకోశము బాధించు కొరడాయని చెప్పవచ్చును. ఇట్లు దినదినమును అధిక పరిశ్రమచేయునట్లు నిర్బంధింపబడిన జీర్ణకోశము "బంలెద్దుబండివాని యెద్దువలె" శీఘ్రకాలములో జెడును. ఒకటిరెండేండ్లకే ముసలిదై కొట్టినను తోకగొరికినను లేవలేని, యెద్దువలె సోడాప్రయోగము

చేసినను గదలలేని నీరసస్థితిలోనికి జీర్ణకోశము వచ్చును. తీరని అజీర్ణవ్యాధి, మలబద్ధము గలిగి వానినుండివచ్చు సర్వ రోగములకును శరీరమును గురిజేయును. అధికముగా దిన నేల? సోడాత్రాగి దానిని జీర్ణింప బ్రయత్నము చేయనేల? ఒకవేళ కక్కూర్తిచే నధికముగ దిన్నను నది పూర్తిగా నరిగి కరకర ఆకలి యగువరకును మరి తినకున్న శరీరము బాగుపడును. కడుపునొప్పి వచ్చినయెడల అనుభవించుటచే బుద్ధివచ్చి పశ్చాత్తాపము గలిగి మరియొకసారి అట్టి తప్పుచేయుట మానును. ఇట్లే జీర్ణముకొఱకుపయోగించునవి, సారాయి, చుట్ట, తాంబూలము, గంజాయి మొదలగునవియును. ఇవి కూడ సోడాకంటె బలమైన జీర్ణకోశ నాశనకరములు.

సోడాను దయారుచేయుటకు కంపెనీలలో నీళ్ళుదెచ్చు వారు పాకీవాండ్రు. ఒకరు త్రాగినబుడ్డినే మరియొకరు నోట బెట్టుకొని త్రాగుటచే అంటువ్యాధులు వ్యాపింపక మానవు. ఈ సీసాలను గడుగుదు రందురేమో! అదియు శుభ్రముగా నుండునట్లు శ్రద్ధగా కడుగుటకు వారికి కాలము చాలదు. చిన్నపిల్లలకీపని నప్పగింతురు. వీరీ సీసాలను నీళ్ళలోముంచి తీయుదురు. జాగ్రతగా బరీక్షించిన యెడల సీసా కుతికివద్ద సన్నని పురుగులు కంటబడును. అందుచే అసహ్యకరము. ఒక సారి మీరు పరీక్షించిన యెడల తిరిగి సోడా పుచ్చుకొనుట కెవ్వరును అంగీకరింపరు. ప్రవాహోదకము అపరిశుద్ధమైనదిగా జేయబడు చున్నదనియు, గాలి మార్పులవల్లను, వివిధ స్థలములందలి నీటిని దాగినందువలన రొంప మొదలగు వ్యాధులు బుట్టుననియు, సోడా యే మార్పులను లేనిదిగాన

సర్వకాలము లందును ఒకేరీతిగా నుండుననియు జెప్పుదురు. కొ త్తనీరు, గాలి యప్పుడప్పుడు రొంపను దగ్గును గలుగ జేయుమాట సత్యమే! ఈ రొంపవలన శరీరమందలి రోగ పదార్థము వదలి శరీరము బాగుపడును గాని చెడదు. రోగ పదార్థము పోవలెనుగాని శరీరమం దుండదగినదికాదు. నీటి మార్పువలన నీ రోగపదార్థమందు మండమేర్పడి, పొంగి, నీరుగా ముక్కువెంటను, శ్లేష్మముగా నోటివెంటను పోవును. గాన లాభమే గాని నష్టము లేదు. పరమాత్ముడు మనలను జంపుటకుగాను కాలములు మారునప్పుడు నీటిని, గాలిని మార్చుట లేదు. మన యస్వాభావిక నడవడికచే స్వాభావికము లైన గాలియును నీరును మనకు విరోధులగు చున్నవిగాని మన కవి యుపకారులే యగును. ప్రవాహోదకము మన మెంత చెడగొట్టుచున్నను సూర్యరశ్మి చేతను, వడిచేతను, జలచరముల చేతను తిరిగి శుభ్రపడుటయే గాక, నితర నీటికంటెను, నీ అస్వాభావిక పానీయముల కంటెను పెక్కురెట్లు లాభకారి. ప్రజలందరును ప్రవాహోదకమును గోరిరియే దాహమును దీర్చుకొన గోరుదురుగాని, కుళాయి నీటిని, నూతినీటిని త్రాగ నిచ్చగింపరు. అది మూఢత యని ఆరోగ్యశాఖవారన్నను నిజముగా మూర్ఖతగాదు. మనుజుని స్వాభావికమైన అంతరాత్మ బోధయేగాని మరియొకటిగాదు. రాజమండ్రివంటి మునిసిపలు సంఘమువారు ఈ పరిస్థితుల గమనించి గోదావరి జలములోనికి మునిసిపలు కుళ్లును ప్రవేశ పెట్టి ప్రజల ఆరోగ్యమును నాశనము చేయకుందురు గాక! నవనాగరికతయొక్క ప్రభావముచే గలుగుచున్న కాలిక

రోగముల దలచియైనను ఆరోగ్య శాఖవారు ఇట్టి పనులు చేయకుండుట శ్రేయోదాయకము.

సారాయములను ద్రాగుట వలన గలుగు ముప్పును గ్రహించియే హిందువులు త్రాగుడును పంచమహా పాతకములలో నొకటిగఁ బరిగణించియున్నారు. నాగరికత వ్యాపించిన కొలది, దేశీయములగు కల్లు సారాయములు అలభ్యములుగ జేయబడి విశేషద్రవ్యసహాయమున బొందదగిన పాశ్చాత్య సారాయము వృద్ధిజేయబడినది. అందుకు ఫలితముగ బీదసాదలును హీనకులస్థులును మునుపటివలె నంత విశేషముగా త్రాగుట మానిరి గాని భాగ్యవంతులును అగ్రజాతులును సిగ్గును విడచి త్రాగి దొరలగుచున్నారు. పరిపాలకులు అన్యమతస్థులగుటచే త్రాగుడు అంత తప్పుగాదు గాన త్రాగుబోతులిప్పుడు మహాపాతకులుగ నెంచబడక నవనాగరి కాగ్రగణ్యులగు నల్లదొరలని యెంచబడుచున్నారు. దీనివలన ధన ప్రవాహములు దేశమును విడచి విదేశములకుఁ బారుటయు, బుద్ధి నశించి ఇంట భార్యాబిడ్డలు తిండిలేక మాడుచున్నను దాక్షిణ్యములేక వారిత్రాగుడు కొఱకెట్లో చూచుకొను పెద్దలనేకు లేర్పడిరి. సంఘమిట్లు చెడినను కులాచారముల కొఱకు పాటుబడు కొద్దిమంది సనాతనులనుమాట లరణ్యరోదనములు. హిందూమత ధర్మములు నడుపవలెనన్న పాలనాశాసనములలో ధర్మములు చేర్పబడి మీరినవారు శిక్షింపబడవలెనుగాని బోధవలన నెప్పుడును మార్పులు మానవు. దురభ్యాసములలోని దగుట మధువును ద్రాగుట కలవడిన మానవులు దానిని విడువలేరు. మందులలో గలపవలసిన

అవసరమందు లేమో! మందులే యక్కఱలేనప్పుడు దానిని గలపవలసిన యవసరము లేదు. సారాయము వేడిని బుట్టించు నందురా! ఆ వేడి తాటియాకు మంటవలె జల్లారి పూర్వపు స్థితికంటె శరీరస్థితి పాడగును. జీర్ణకరమును, నుత్సాహకరమునందురా! ప్రేగులను నరములను అధికముగఁ బనిచేయునట్లు బలవంతపెట్టి త్వరలో వానిని నిరుపయోగములుగ జేయును గాన దీనిని త్రాగదగదు.

షరబత్తులు:— ఇవి కొన్ని ఫలరసములను వండి నీటితో గలిపియు, ఫలరసములనుండి దీయబడిన ఉప్పులను నీట జేర్చియు దయారు జేయబడి రుచిగనుండునట్లు తియ్యగా జేయబడి చల్లదనము నిచ్చుటకు మంచుగడ్డవంటి చల్లని పదార్థములు గలపబడిన పానీయములు. వేసవికాలమునం దివి విస్తారముగ వాడబడుచున్నవి. ఇవి తాత్కాలికముగ చల్లదనమును గలుగజేయును. ఉత్సాహము నిచ్చును. అందుకొఱ కివి వాడబడుచున్నవి. ఇట్టి గుణములు తాత్కాలికములు గాని నిలకడయైనవిగావు. మనుష్యునకు వేసవి కాలమునందంత తాపము బుట్టుటకుగల కారణమేమి? జీర్ణకోశము శక్తి లేనిదగుటచేతను, అస్వాభావికములగు పదార్థసేవ వలనను, నధికభోజనమువలనను అసమగ్రజీర్ణమేర్పడి ఒకసారి తినిన పదార్థము జీర్ణమగువరకు వేచియుండక అకాలమున తిరిగి తిరిగి తినుచుండుటచే కడుపునుండియు చిన్న ప్రేగులనుండియు త్రోసివేయబడిన పదార్థము మలముగా శరీరమునుండి గెంటి వేయబడక అధికకాలము పెద్ద ప్రేగులలో నిల్వయుండుటచే బుర బురలాడి, పొంగి పులిసి రాసాయనిక మార్పులను బొం

దును. ఈ మార్పులవలన జనించిన వేడి శరీరమందు వ్యాపించు
టచే తాపముగల్గును. ఇదియే వేడియని పొరబాటుచే నను
కొనుచున్నారు. ఈ వేడి తాత్కాలికముగ జల్లారుటకుగాను
ఈ షర్బత్తు లుపయోగపడును. "పాలపొంగు చన్నీళ్ళు చల్లు
టచే జల్లారినట్లు" వెంటనే జల్లారునుగాని పులిసిన పదార్థ
మక్కడనే యుండుటచేం దిరిగి వెంటనే వేడి, తాపము రాక
మానవు. పూర్తిగా నీ తాపము నణచదలచిన యెడల
క్రొత్తగా పదార్థముల కడుపులోనికి పంపక, నిదివరకున్న
పదార్థముజీర్ణమగువరకు లంకణముండుట, లేక ఆ పదార్థము
శరీరమునుండి తొలగించుట జరుగవలెనుగాని పై షర్బత్తుల
వలన లాభము లేదు. జీర్ణకోశమున కధికమైన పనిగల్పించి
బలము లేని జీర్ణకోశమును మరింత బలహీనముగా జేయు
టయు, జీర్ణకర్మ నాపి మందాగ్నిని గలుగజేయునవి గనుకను
షర్బత్తులు పనికిరావు.

## ౧౪. మత్తుద్రవ్యములు

### పొగాకు

మనదేశమునందు పూర్వకాలమునందు లేదనియు, యూరప్
దేశమునుండి ఐరోపీయనులచే గొనిరాబడి మనదేశమునందు
వ్యాపించినదనియు, నొక వాడుక గలదు. పొగాకునందు
'నికొటిన్' అనుపేరుగల విషపదార్థముగలదు. పొగచుట్ట
కాల్చుటవలన ఈ విషపదార్థము నాడులమీద పనిచేసి
తాత్కాలికముగ ఉత్సాహమును గలుగజేయును. ఈయుత్సా
హము కొఱకే చాలమంది పొగాకును అనేక రూపములుగ

వాడుదురు. చురుకు బుట్టించు పదార్థము లన్నిటివలెనే దీనిని గూడ వైద్యులు కొన్నిరోగములకు మందుగా నుపయోగింతురు. దీనియందు గల వను సుగుణము లెవ్వియన:—
(1) జీర్ణ కోశముమీద పనిచేసి భోజనపదార్థములను త్వరలో జీర్ణముచేయుట (2) శ్లేష్మరోగుల ఊపిరితిత్తులమీద పనిచేసి శ్లేష్మమును నోటిగుండ పోగొట్టి ఆయాసమును తగ్గించుట (3) దంతరోగములయందును, శిరోవాతమునందును కొంత తెమడ పోగొట్టి సుఖమును గలిగించుట (4) మాంద్యమును వదల్చి చురుకు బుట్టించుట మొదలగునవి. రోగులు కాని వారికి గూడ పొగాకు ఉత్సాహమును బుట్టించునుగాన సరదా కొరకుగూడ దీనిని ఉపయోగింతురు. ఈ సుగుణము లేవియు దీనియందు లేవనియు ఉన్నట్లు దోచుట భ్రమగాని నిజము గాదనియు, చురుకు బుట్టించు కాఫీ మొదలగు పదార్థముల వలెనే వర్జనీయమెల్లగునో చూపవలయును. చురుకుబుట్టించు వస్తువులన్నియు నరములమీద పనిచేసి వానికున్న శక్తిని మించినపని నవి చేయునట్లు బలాత్కరించుటచే, బలహీనములై కొలదికాలములోనే బాతిగా పనికిమాలిన స్థితిలోనికి వచ్చును. కాన నూరేండ్లు పనిచేయుట కేర్పడిన యవయవములు, 30 లేక 40 సంవత్సరములలోనే పనికిరాకుండఁ బోవును. బండిలాగు గుఱ్ఱములవలె నకాలమృత్యువునకు గురిగాగలవు. ఇందుగల విషపదార్థము రసాయనిక పద్ధతినితీసి ప్రయోగించిన జీవజంతువులను జంపును. ప్రతిసారియు కొద్ది కొద్దిగా ప్రయోగించుటచే చంపునంతటి శక్తిలేక అవయవములను పాడుచేయును. పొగాకు విషపదార్థము గనుకనే చుట్ట

గాల్చుటకు ప్రారంభించిన కొన్నిరోజులవరకు, వికారముపెట్టి కళ్లుతిరిగివచ్చునంత బాధబెట్టి తుదకుకడుపులోనిపదార్థముల నెల్ల వాంతిజేయువరకును బాధతగ్గదు. దీనినిబట్టి పనికిమాలిన వస్తువును బలవంతముగా మనము శరీరమందు ప్రవేశపెట్టుచున్నందున నరములు దమయసమ్మతినట్లు దెలుపుచున్నవని గ్రహించవలెను. మరికొన్ని రోజులట్లు బాధవచ్చినను విడువక కాల్చితిమేని నరములు సత్తువనుగోల్పోయి బలహీనములగును. తమంతట నవి వాని కృత్యములను జేయలేనంత బలహీనమును బొంది "తోకకొఱికినప్పుడు మాత్రమే నడుచు బండియెద్దువలె" చుట్టకాల్చిననేగాని భోజనమరుగదు. విరేచనము గాదు. మరికొంతకాలమునకు "కొఱడాదెబ్బలకు బుర్రాడించుట దప్ప నొక్క యడుగైనను వేయలేని బండియెద్దువలె" చుట్టకాల్చినపుడుగూడ పని జరుగనంత మలబద్ధమును అజీర్తియుఁ గలుగును. చుట్టవల్ల దమ కన్నమరుగునని, విరేచనమగునని, దగ్గు రోగము శాంతించుచున్నదని చెప్పువారు తమ భ్రాంతిచే నట్లందురేగాని దానియందలి యథార్థమును గ్రహింపలేదు. ఈ మనుష్యులే చుట్టకాల్చునపుడు తమ యవయవశక్తి యెట్లుండెనో, కాల్చుట కారంభించిన దావి యెట్లు చెడి, చుట్టగాల్చునపుడు మాత్రమే అవయవములు పనిచేసియావేళకు కాల్చకున్న నెట్టి విపరీత బాధ గలుగునో గ్రహించగలిగిన యెడల వారికే బోధపడును. అవయవములు బలముగా నున్నంతకాలము అన్యపదార్థమును జేరనీయక పేగులలోనున్న పదార్థమును క్రిందకు మీదకు గలిసి కడుపునొప్పి మొదలగుబాధలు గలిగి విరేచనముల ద్వారా యన్య

దరిద్రునిజేయును. చిన్న పిల్లలకు నేర్పినయెడల చుట్ట మొద
లగువానివలెనే డబ్బు లేనట్టినదొంగతనమలవడి దుర్మార్గుల
గుదురు. హుకాకాయను పొగచుట్టకుగల దుర్గుణములుగలదే.

## న ల్ల మ ం దు

పైవాని కన్నిటికంటె నధికమైన విష పదార్థము. విశేష
ముగా వాడిన జంపునంతటి శక్తిగలది. దీనిని విశేషముగ
మందువలె వాడుచున్నారు. ఆవగింజంత మోతాదుతో
నారంభించి వృద్ధిపరచి క్రమముగ కుంకుడుగింజంతకంటె
నధికమోతాదుగా తీసికొందురు. కొన్ని కాలిక రోగములందు
మందులు తీసికొని విసిగి వేరు సాధనములేక వైద్యసలహా
తోనే ప్రారంభించెదరు. ఈ నల్లమందు విషా శరీరమందు
ఉన్నంతవరకు మంచి ఉత్సాహముగను, బలముగనుండును.
మొట్టమొదట రోగములబాధ తగ్గినట్లు కనబడును. కొంత
కాల మగుసరికి శరీరమంతయు నల్లమందు విషమెక్కి నర
ముల సత్తువయు, అవయవబలమును నశించిపోవును. మలబద్ధ
మును, అరుచి, అజీర్ణమును బుట్టును. నల్లమందు వేసికొనిన
రెండుగంటలు మాత్రము దార్ఢ్యముగ పనులు జేయగలుగు
నట్లు జేయును. రాత్రిలు నిద్రబట్టక పగలు కునికిపాట్లు బడ
జేయును. రోగములన్నియు క్రమముగ బ్రబలి ముదిమిని
మృతిని గలుగజేయును. వేళకు నల్లమందును, దానితో బాటు
భోజనమును బడయకున్న నవయవపటుత్వముదప్పి నిలువలేక
బోవునంతటి దుర్బలుడవును. సోమరిపోతుదనమును గలుగ
జేయును. చైనాదేశస్థు లీ నల్లమందువల్లనే చెడిపోయిరిగాని

ఇటీవల గ్రహించి రాజశాసనమువల్ల నల్లమందు దొరకకుండ జేయఁబడుటచేతను, బాగుపడవలెనను బుద్ధిగలిగి మాన్పించ బడుటచే తిరిగి మంచిదశకు వచ్చుచున్నారు. ఈదురభ్యాసము తక్కిన యన్నిటికంటె చెడ్డదియు మానుటకు వీలులేనిదియు. ఎంతయో మనోనిగ్రహము వలననో లేక ప్రవాసశిక్షవంటి నిర్బంధమువలననో గాని విడువరు. సంసారములు నాశనము చేయుట కిది-త్రాగుడు, జూదము మొదలగువానికి దీసిపోదు. గాన నతిప్రయత్నముతో విడువదగినది. నల్లమందువేయు ముసలమ్మలు తమ యింటనున్నవారి కందరికిని ప్రతిజబ్బునందును కొంచెము నల్లమందు దయతో వేయించుచుందురు. పాపము ఈ దుష్టవస్తువు విషప్రాయమని వారెరుగరు. మందుగానైనను దానిని వాడకూడదు. ఈవిషదానమువలన మహాపాతకము సంభవించును. గాన నితరులకు నివ్వకూడదు. పిల్లలకెప్పుడును నల్లమందు వేయరాదు. సాధారణముగ గ్రహణి విరోచనములందు దీనిని ఇతరమందులలో గలిపి వాడెదరు. గ్రహణి ఎందువల్లవచ్చునో దెలియక పోవుట వల్లనే వైద్యులు నల్లమందుచే విరోచనముల గట్టించఁబ్రయత్నించెదరు. తుదకు గ్రహణి కట్టుదుసరిగదా వాంతిపుట్టి యన్నహితవుపోయి తరుణవ్యాధి కాలికముగ మారును. అజీర్ణవిరేచనములయందు ముసలమ్మలు వాడి ప్రాణముమీదకు తెప్పించెదరు. రోగతత్వము నెరుగని యిట్టి వైద్యమువల్లనే కొంద రకాలమృత్యువునకు గురియగుదురు. గాన నల్లమందు నెవ్వరును తాకుటకుకూడ నసహ్యపడవలసినంత దుష్టవస్తువని గ్రహించెదరుగాక.

## గంజాయి

ఇది మైకలన్నిషాను గలుగజేయు విషవస్తువు. దీనిని తరచు
విరాగులమని తలచు కొందరు మూర్ఖయోగులు వాడె
దరు. ఇదిగొట్టములో వేయబడి మరికొన్ని నిషావస్తువులతో
గలిపి అంటించి పీల్చబడినప్పుడు ఒడలు తెలియనంత మత్తు
గలిగి తానేవస్తువును మనస్సునందు తలంచుచుండునో దానిని
దప్ప నితరముమీదకు మనస్సుపోక యుండునట్లు చేసి యత్యు
త్సాహమును గలుగజేయును. యోగులు తమ మనస్సు
సంకల్పరహితమై బ్రహ్మమునందు నిలుచునందురు. సన్నిపాత
రోగిగాని పిచ్చివాడుగాని మెదడుచెడి ప్రేలినమాటలవలె
ఈ నిశ్చయము నిరుపయోగము. గంజాయి పట్టునందున్న
పుడు తనవశములేక మనస్సు నిలిచినందువలన లాభములేదు.
గంజాయిపట్టు వదలినపిమ్మట తిరిగి గంజాయి సంపాదించు
కొనుటకుగాను ఇతరులను మోసపుచ్చు ప్రయత్నము
చేయుచుండునుగాన నీ కుయోగుల చెంతకు బోగూడదు.
వీరు కొందరు మూర్ఖులకు ఉపదేశముచేయుదమని చేర్చి
గంజాయిని నేర్పుదురు. నేర్పినపిమ్మట వారికికూడ వారివలెనే
గంజాయిదమ్ము పట్టువలన బ్రహ్మసాక్షాత్కారమై గురు
బోధచే వితరణము హెచ్చి పిల్లలమెడలోని వస్తువులనైనను
తెంపుకొనివచ్చి గురువులకును తమకును గావలసిన గంజా
యిని కొనితెచ్చెదరు. గంజాయి తాగువారి కున్న త్యాగము
నకు మితియుండదు. తమ సర్వస్వమును పోగొట్టుకొందురు.
డబ్బు దొరికినంతకాలము లేదనక ఎంతమందికైనను తమతో
చాటు గంజాయినిచ్చెదరు. చేత డబ్బులేనపుడు దొంగతనము

వల్లనైనను గంజాయిని సంపాదింపజూతురు. గంజాయి త్రాగువా రనేకులు సంసారులు పిచ్చివాండ్రగుటయు, సంసారత్యాగులగుటయు తరుచుగ గలుగుచుండును. కొన్ని వీర్యవృద్ధికర ఔషధములలో దీనిని జేర్చెదరు. ఎట్లు వాడినను మిగుల దుష్ట పదార్థము. యోగులు దీనిని జ్ఞానపత్రి యందురు. గంజాయిని గంజాయి త్రాగువారిని దరికి జేర్పరాదు.

## నా భి

సుఖముగ మనిషిని చంపగలిన విషపదార్థము. నల్లమందు వలెనే బహుకొద్దిగ ప్రారంభించి క్రమముగ వృద్ధి చేయుటవలన శరీరమంతయు విషమయమై యలవాటు పడును. ఈ విషము శరీరమున కెక్కనకొలది నెంత యాహారమైనను తినగలశక్తి గలుగునుగాని శరీరమునకు ఆ యాహారము వలన పుష్టిరాదు. బహు దురభ్యాసముగాన దరికి జేరనివ్వరాదు.

## తాం బూ ల ము

తమలపాకులు, పోక చెక్కలు, సున్నముచేర్చి కొన్నిసువాసన పదార్థములును వీర్యమునకు ఉష్ణమును బుట్టించు వస్తువులును జేర్చి, భోజనానంతరమందు సేవింతురు. నాగరికతగల వారికిది యొక గౌరవచిహ్నము. దీనివలన అన్న మరుగుననియు, నోటి దుర్గంధము పోవుననియు, ఉత్సాహమును బుట్టించుననియు జెప్పుదురు. పొగాకు వలెనే యీ లక్షణములన్నియు ఉన్నట్లు భావించుటయే తప్ప ఒకట లక్షణమును నిజముగా దీనికిలేదు. జీర్ణకోశమును చెరిపి యవయవశక్తిని నశింపజేయును. అజీర్ణ

రోగమును మలబద్ధమును బుట్టించును. దంతముల జెరిపి దంత రోగముల గలుగజేయును. డబ్బుపోగొట్టుకొని యీ రోగముల కొనుక్కొనుట యెంతమూర్ఖతయో యూహింపుడు. వీర్యమున కుష్ణముగలిగి పలచనై సంభోగవాంఛ హెచ్చును. కొద్ది కాలములో వీర్యపటుత్వము పోయి నపుంసకత్వము గలుగునుగాన వర్జనీయము. విద్యార్థులకు చిన్నతనమునందే రేతస్సుత్పత్తియగు సమయమున వీర్యమును పలచబరచి దుష్ట సంకల్పములను బుట్టించి బుద్ధిని నశింపజేయుటయేగాక నపుంసకులనుగ మార్చునుగాన చిన్నతనమునందు బొత్తిగా తమలపాకుల వేయరాదు. తమలపాకులలో పొగాకు వేసి నములుదురు. దీనిని తంబాకందురు. ఈ యలవాటు బొత్తిగా జబ్బుదిగాన దరికి జేరనీయరాదు. కారపుఖిల్లీ తమలపాకు కంటె అనేక రెట్లు దుష్టవస్తువు. వర్జనీయము.

ఈ చెప్పినవాని కలవడుట దుష్టసహవాసము చేత గలును. ఇంటియందిట్టి దురభ్యాసకులుండుటయు, ఇట్టి దురభ్యాసకులగు వారు దల్లిదండ్రులకు పుట్టుటయు, పురాకృత కర్మఫల మనుకొనవలెను. పిల్లలు లేని వారెట్లున్నను నీ రిదుర్గుణ ఫలితములు వారితోనే యంతరించునుగాని పైకి వ్యాపింపవు. సంతానవంతులకు అట్లుగాదు. దుష్టవర్తనుల కంకురించు రోగముల వలన బీజముచెడి రోగయుక్తులగు సంతానము గల్గును. బీజమును బట్టియే వృక్షముండునుగదా! తల్లిదండ్రుల గుణములే పిల్లలకు వచ్చుటచే పిల్లలుకూడ దుర్మార్గులగుదురు. గాన సంతానము గలిగినతోడనే తల్లి దండ్రులు దమ దుర్వర్తనమును విడచి తమ సంతానమునకు మార్గదర్శులుగనుండ బ్రయత్నింప

వలెను. ఇంతేగాక తమ సౌఖ్యముల నన్నిటిని వదలుకొని బిడ్డలను మంచి మార్గములయందు బ్రవేశ పెట్టుటకుగాను మంచి మార్గములయందు నడుచుకొనవలెను. పిల్లలు బాగుగా చదువుకొనవలెనన్న తండ్రిదగ్గర గూర్చుండి చదివింపవలెను. గాని తాను పరుండి బిడ్డను చదువుకొమ్మనిచెప్పిన వాడును కునికిపాట్లు పడును. తాను త్రాగుచు బిడ్డను మానుమనిన మానడు. దాను విషయలోలుడై దండ్రి వంశమును చెరుచును. గాన బిడ్డలగన్న తల్లిదండ్రులు తమ దురలవాట్లను వదలుకొనవలెను.

## ౧౫. గాలి

గాలి భూమండలమునంతను చుట్టుకొనియున్నది. భూచరము లన్నియు నీ వాయుసముద్రమునందు సంచరించుచున్నవి. ప్రాణులకు లోపలను వెలుపలను అన్నివైపులను వాయువు గలదు. అన్నివైపులను గాలి యొత్తిడి సమముగ నున్నందున మనము స్వేచ్ఛగ సంచరించగలుగు చున్నాము. ఈ గాలి జీవరాశి కనుకూలించురీతిని కొన్ని గాలుల మిశ్రమముగ నేర్ప రచి యుంచబడినది. ఇందు కలుపబడిన గాలులేవో,యవి యేవే వియో, ఎంతెంత చొప్పున కలుపబడినవో శాస్త్రవేత్తలు కని పెట్టియున్నారు ప్రకృతి ననుసరించువారి కీపరిశోధనలతో నిమిత్తములేదు. పశుపక్ష్యాదులవలెనే ప్రకృతిమాత తయారు చేసియుంచిన యాహారమును, బానీయము నెట్లుపయోగించు కొందుమో, అట్లే మనకు లభ్యమగు గాలినికూడ మన ముప యోగించుకొన వలసియుండును. గాని ప్రకృతి సూత్రము లను ధిక్కరించి నాగరకతను గల్పించుకొని స్వచ్ఛమగు

ప్రవాహములును, రుచికరములై ఆయా ఋతువులందు దొరకు ఫలశాకాహారములను, నిర్మలమైన వాయువును వన ములను, పర్వతములను వదలి, వాని సమీపమందుగల పల్లె లనువిడచి. మనుష్యుడు శాశ్వతముగ నుండిపోవునో, యను నట్లు చిరకాలముండుటకు దగినట్లు వేలు; లక్షలు ఖర్చుపెట్టి మేడలను మిద్దెలను గట్టుకొనగా పట్టణములేర్పడినవి. ఈపట్టణ ములలోనికి జనులు విస్తారముగ చేరినందువలన విశాలము లైన స్థలములు లేక ఇరుకై జనసమ్మర్దము చేతను, వారు వాడిన మురుగునీరు, కుళ్ళుచెత్త పోవుటకు మార్గములు లేక వాయువు చెడుచున్నది. ఈ చెడువాయువును పీల్చుటచే నారోగ్యము చెడుచున్నది. ప్రకృతి జీవనులగువారి కిట్టి యవస్థలేదు. గాని నాగరికులకు మంచి గాలి దొరకు సాధనములు చూచుకొనవలెను. గాలి మనకు ఆహార పానీ యములకంటె ముఖ్యమైనది. గాలిలేక యొక నిముషమైనను జీవింపజాలము. ప్రతి శ్వాసతోను మంచిగాలి మనముకుక్కు ద్వారా ఊపిరితిత్తులలో బ్రవేశించి అదివరకే దేహమంతటి నుండియు చెడురక్తవాహినులద్వారా వచ్చి యూపిరితిత్తులలో నిల్వయుండెడి చెడురక్తముతో గలిసి దానిని తిరిగి మంచి రక్తముగామార్చి అందలి బొగ్గుపదార్థములు మొదలగు వానితో గలిసి చెడి తిరిగి యీచెడుగాలి యూపిరి విడుచుట మూలమున బయటికి పంపబడుచున్నది. ప్రతి శ్వాసతోను కొంత మంచిగాలి లోపల బ్రవేశించుటయు, కొంత చెడు గాలి బైటికి వచ్చుటయు నిత్యమును జరుగుచున్నది. ఇట్లు డుగాలి ప్రపంచమందలి గాలితోగలిసి దానిని జెరుపకుండ

సర్వజ్ఞుడగు నా పరమాత్ముడు వృక్షవర్గమునకీ చెడుగాలి నాహారముగ నేర్పరచియున్నాడు. వృక్షము లీ చెడుగాలిని బీల్చుకొని యందలి చెడుపదార్థముల నుపయోగపరచుకొని తిరిగి మంచిగాలిగాజేసి బయటకు విడచిపెట్టునట్లు వానిని సృష్టించియున్నాడు. కావుననే ప్రపంచమునం దీ పరస్పర సహాయముచే గాలి యెల్లప్పుడును స్వచ్ఛముగనే యుండును. ఇట్టి యేర్పాటులున్నను మనుష్యుని ప్రజ్ఞావిశేషముచే భగవంతుని శక్తి కతిక్రమించి గాలి చెడు సాధనములు పట్టణములం దేర్పరచుటచే మంచిగాలి కొఱకు వెదకుకొనుట తటస్థించుచున్నది. అపథ్యాహారమువల్లను, అయోగ్య పానీయమువల్లను ఆరోగ్యము చెడుచుండగా ఈ రెంటికంటె నత్యవసరమగు గాలి చెడదే యారోగ్యము చెడుటయం దాశ్చర్యములేదు. ఆహార పానీయములయందు రుచులుగల్పించి అమితముగఁ బుచ్చుకొందుముగాని, వాయువును అమితముగ సేవించుటకు వీలులేదు. గాన చెడుగాలిని బీల్చుటవలననే యారోగ్యము చెడును. పల్లెలనుంచివచ్చువారుగాని, అరణ్యప్రాంతముల వారుగాని పట్టణములలో బ్రవేశించినపుడు చెడుగాలిని గ్రహించి వారి ముక్కులు పీల్చనొల్లవు. కాని కొంతకాల మక్కడ నుండుట తటస్థించినపుడు ముక్కుయొక్క సునిశిత గ్రహణశక్తిపోయి యా దుర్వాయువునే పీల్చుట కొప్పుకొనును. అందువలననే పట్టములందలి వారికి శ్వాసాశయరోగములు మున్నగు తరుణకాలిక వ్యాధులు గలుగుచుండును. అన్యపదార్థము ఆహారాదులవలన నోటివెంబడిని జీర్ణకోశమందును, ముక్కుద్వారా ఊపిరి తిత్తులలోను ప్రవేశించునని

చెప్పియుంటినిగదా! ఇట్టి దుర్వాయు సేవనమువలన నూపిరి తిత్తులుచెడి వానిపని నవి సక్రమముగ జేయజాలకపోవుటచే దుర్బలమైనవగును.

అంతట దమవద్ద జేరు యన్యపదార్థమును గెంటివేయ లేక పోవును. ఈ యూపిరితిత్తులందు జేరిన అన్యపదార్థము ఋతు భేదములయం దేర్పడు గాలుల మార్పులచేత బురబుర పొంగి ఊపిరితిత్తులయందు వేడిని బుట్టించును. ఈ వేడిచే ఊపిరి తిత్తులలోపలి మృదువైన ఉల్లిపొరవంటి మెత్తని చర్మము కుళ్లి శ్లేష్మరూపమున నోటివెంటను, చీమిడిరూపమున ముక్కువెంటను పోవుచుండును. అట్లు ఊపిరితిత్తులు దార్ఢ్య ముగ నున్నంతకాలము పోవును. వానిబలము చెడినపుడు ఈ శ్లేష్మము నాసికాద్వారముల కడ్డుతగిలి శ్వాస నిరోధించును. అప్పుడే ఆయాసము వచ్చును. ఈస్థితిలో నిర్మలమైన విశాల స్థలమందలి చల్లని వాయువు కావలసివచ్చును. పట్టణమందట్టి వాయువు లేనందున అనారోగ్యము గల్గును. ఋతుభేదము వలన గాలి మారుటవలన శరీరమందలి అవయవములు బల మును జెంది శరీరమందు జేరిన యన్యపదార్థమును నెట్టివేయు ప్రయత్నమును గావించును. ఈప్రయత్నమే రోగముగదా! ఇట్టి ప్రయత్నమువలన శరీరమందలి యన్యపదార్థమంతయు బహిష్కారావయవముల గుండ వెలుపలికి పోవుటచే తరుణ రోగములు వచ్చును. రోగము మనకుపకారమునే చేయును. గాని అపకారమును జేయదు. అట్టి తరుణ రోగము యొక్క తత్వము నెఱుగక వానిని మందులచే నాపి శరీరబలమును జంపి కాలికవ్యాధులకు గురియగుచున్నాము. ఏది మన కుప

కారియో దాని నపకారియనియు, ఏది అపకారియో దాని నుపకారి యనియు తలంచుచున్నాము. ఎట్లన ఋతు భేదము వలన గాలిలో మార్పుగలిగి రొంప, జ్వరము మొదలగు తరుణ వ్యాధులు గలుగుచుండగా ఇవి మన యుపకారము కొఱకనుకొనక, గాలి మంచిది గాదనియు, చెవులకు గుడ్డలు కట్టుకొనవలెననియు, ఇల్లువిడచి బయటికి వచ్చిన శీతగాలి తగిలి రోగమువచ్చుననియు, ఆపాదమస్తకము ఉన్ని గుడ్డలు కప్పుకొని గాలి ప్రవేశింపని మిద్దెలలో గూర్చుందుము. దయాసముద్రుడగు పరమాత్ముడు మన యుపకారము కొఱకే గాలియందిట్టి మార్పులను గల్పించియున్నాడు. మనల రోగపీడితులుగ జేయుటకుగాదు. మనము నివసించు తావునందు దొరకు గాలియు, నీరును, ఫలాదులును మన శరీరమున కను కూలించును. మన శరీర మన్యపదార్థ పూరితమైనపుడే రోగము గల్గి యన్యపదార్థ విమోచనము గావించి తిరిగి యారోగ్యమును గల్గించును. ఇట్టి గాలికి గాని, నీటికి గాని మనము భయపడ నక్కరలేదు. మందుల వరికి పోక, జీర్ణకోశమునకు పనిగల్పించు నట్టి యాహార సేవనము మానినయెడల తిరిగి యారోగ్యవంతుల మగుదుము. గాలిమార్పు మనకుపకారిగాని యపకారికాదు. ఇట్టిగాలి మనకు ప్రాణప్రదమైనదే. చలిగాలిగాని, వేడిగాలిగాని మన కవసరమే. చక్కగా నిండ్లలోనికి ధారాళముగా గాలివచ్చునట్లు మన గృహములను నిర్మించుకొనవలెను. ఈ సంగతినే యారోగ్యశాఖవారు మనకు బోధించుచున్నారు. అట్లు చక్కగా వెలుతురును, వేడిమిని, చక్కని మంచిగాలి గల

విశాలభవనముల నిర్మించుకొనుట యుక్తమే. అట్టి గృహముల నిర్మించుకొనుటకు భాగ్యవంతులకు మాత్రమే శక్తి యుండును జనసామాన్యమునకు శక్తిలేదు. వీరును ఆరోగ్యవంతులగుటకు దగు యేర్పాటుగావలెనన్న శక్త్యనుసారము పైకప్పును మాత్రము నిర్మించుకొని గాలియు వెలతురు ప్రవేశించునట్లు గోడలులేని కాళీస్థలములందు నివసింపవలెను. అందుకును దార్ఢ్యములేనివారు ప్రకృతిమాత దయతో మనకేర్పరచిన చక్కని తోపులందును, చెట్లనీడను నివసించుచున్నపుడే యారోగ్యభాగ్యము మనదగును. ఇట్లు నివసించుట కొంకక ప్రకృతి మార్గావలంబులకే సాధ్యముగాని యితరులకుగాదు. ప్రకృతి ననుసరించువారికి వాంఛలు కొద్ది. అవియును సులభముగ దీరును. సామానులతో వీరికిబనిలేదు. బంగారము వెండి మొదలగు విలువగల లోహము లక్కర లేదు. వీరియింట దొంగలు దోచుకొనుట కేమియు నుండవు. గాన ఎక్కడనుండినను ఎట్లుండినను వీరు నిర్విచారజీవులు. ఇట్టివారి జీవితమును జూచియే ప్రజలందరును నసూయ పడవలెనుగాని రోగములచే నిత్యమును బాధపడుచు సుఖమెరుగని భాగ్యవంతుని జూచి మన మానందింపఁ బనిలేదు. హిందువులుదప్ప నితరదేశస్థు లెవ్వరును ఇంటియందు విశేషమైన విలువగల సామానులనుగాని నగలనుగాని యుంచుకొనరు. వారు వాడుకొను పాత్రలు విలువలేనివి. అందువలననే యూరపియనులు వారిదేశమునందు విశాలస్థలము లభించక పోవుటచే నెట్టి ఇరుకిండ్లలో నున్నను మనదేశమునందు చక్కని విశాలస్థలములందలి పెద్దయిండ్లలో నివసింతురు.

భార్యా భర్త లిరువురే చుట్టుపట్ల యిండ్లులేని ఒకవిశాల స్థల మందలి ఇంటియందు నివసింపగల్గుదురు. మనము విలువగల సరకుల గోరనిపక్షమున పొలములందు చక్కనిగాలిలో నివ సింపగలుగుదుము గదా! మనకు స ర్వ సౌ ఖ్య ము లు దేనివలన గలుగునని యూహించుచుంటిమో, యట్టి ద్రివ్యమే మనకు ప్రకృతి జీవులమగుటకును, సదా యారోగ్య వంతులమై సుఖించుటకును నడ్డుదగులును. గాన గృహానిర్మా ణమునందు సామాన్యజనులంత బాధపడక విలువగల వస్తు వులు సురక్షితముగా నుండుటకు దగిన బ్యాంకులయందు వానిని దాచియుంచి విశాలముగ గాలివచ్చు బయలునందు నివసించిన ప్రకృతి సుఖ మనుభవించ గలుగుదురు. ఇది విరాగులకుగాని సాధ్యపడదు. అందరును విరాగులు గాలేరు గాన మనశక్తినిబట్టి స్వేఛ్ఛగా గాలి, వెలుతురు లోపలకు వచ్చునట్లును, తేమలేక పొడిగానుండునట్లును ఇండ్లు గట్టుకొని పరుండునప్పుడును, ఇండ్లలోనేయుండి పనులు చేయునప్పు డును గాలి బాగుగా ఇంటిలోనికి వచ్చునట్లు గిటికీలను, ద్వారములను దెరచియుంచవలెను. చలిగాలికి శరీరమంతయు ముక్కును మాత్రము దెరచియుంచి చక్కగా గప్పుకొన వలెనుగాని గాలిరాకుండుటకు కిటికీలనుమూయరాదు. ఆయా ఋతువులయందు మనకు లభ్యములగు శాక ఫలాదులను, నీరును ఎట్లు ఆరోగ్య దాయకములగునో అట్లే గాలియును ఋతుభేదముచే మార్పుచెందుచున్నను మనకట్టి సమయము లందు అట్టి మార్పు జెందినగాలియే అవసరమగును. అదియే భగవంతుని యుద్దేశ్యము. ఆయుద్దేశ్యము ననుసరించి నడచు

కొని ఆరోగ్యసౌఖ్యము నందవలసినదేగాని మన తెలివితేటలచే గలిగిన యల్పజ్ఞానముచే భగవంతుడు ప్రజలను బీడించుటకిట్టి వాయువులను గల్పించినాడనుకొని అంతఃపురములందు గాలి దగులకుండ దాగుకొనుట మూర్ఖత్వమే.

ఇండ్లు అపరిశుభ్రముగా నుంచుకొనుట వలనను, మల మూత్రాదులును, ఇంటియందు వాడిననీరును, ఇంటిలోని చెత్తయును, వంటచేసుకొనునప్పుడు తరుగుకొని పనికిమాలిన దని విడచిన పదార్థశేషములును ఇంటిచుట్టు నిల్వ యుంచుకొనుటవలనను, అవి మురిగి దుర్వాయువులను గలిగించును. ఈవాయువులు మనయింటిలోనికి వచ్చుగాలితో గలసి మనముపీల్చుకొను గాలిని జెరచును. అట్టిస్థితి యేర్పడకుండు నట్లు పైని వ్రాయబడిన చెడుపదార్థములు ఇంటి చుట్టుపట్ల నుండక దూరముగా నేరోజున కారోజు పోవునట్లేర్పాటు చేసికొనవలెను. పల్లెలయందు విశాలములైన బయళ్లును, ఇంటిచుట్టు ఖాళీస్థలములును ఉండును. ఆరోగ్యవిధులను మనస్సునందుంచుకొని మలమూత్రముల దూరముగను ఎండ దగులు తావులయందును విడచుటయు, ఇంటిలోనిచెత్తను వాడునట్టినీళ్లను దూరముగబోవు నేర్పాటులు గావింపవలెను. ప్రకృతిననుసరించిజీవించువారికి పట్టణములతోనిమిత్తములేదు. వారు పల్లెలయందే నివసించెదరు. కృత్రిమాహార జీవుల మలమూత్రాదులవలె ప్రకృతి జీవుల మలమూత్రము లంత అసహ్యకరములుగను, దుర్వాసనగలవిగను, ఉండవు. ఎండ దగులు ప్రదేశమునందు మాత్రమే వీరు మలమూత్ర విసర్జనము చేయుదురుగాన అవి కుళ్ళి దుర్వాసనల గలుగజేయవు.

కృత్రిమాహార జీవులైనను పల్లెలయందు మరుగుదొడ్లు నిర్మించుకొనరు. ఇందు పాకీవాండ్రు లేరుగదా! బయటకి పోవుదురు. అట్టి ప్రదేశములను శుభ్రపరచుటకు పరమాప్తుడగు సృష్టికర్త పందులు మొదలగు జంతువులను బుట్టించియున్నాడు. ఈ పందులకు విశేషముగ మనుష్యులచే విడువబడిన మలపదార్థమే పోషకపదార్థముగ నేర్పాటుచేసి యున్నాడు. ఇట్టి యేర్పాటుచే నీ దుష్టపదార్థము కుళ్ళి గాలిని పాడుచేయకుండ ఏరోజున కారోజు బాగుపడుచుండునుగదా! మన మసహ్యించుకొను పందులు మనకెంత యుపకారులో యూహించుకొనుము. ఇట్లే కుళ్లు కళేబరములను దిని బ్రతుకు పక్ష్యాదులును క్రిమికీటకాదులును మనకెంత యుపకారులుగ నున్నవి! సృష్టికర్త ప్రపంచక మందలి చేతనాచేతనములగు సృష్టియందు పరస్పర సాహాయ్యముచే సుఖజీవులగునట్లు తన సర్వజ్ఞత్వముచే సృష్టించి యున్నాడు. ఆరోగ్య విధులను దెలిసికొనినయెడల పల్లెలయందు ఆరోగ్యవంతులుగ జీవించుట కెట్టి యాటంకములును గలుగవు. తాము ఆరోగ్యవంతులుగ నుండవలయు ననియు, తమకొఱకితరుల యారోగ్యముల జెరుపకూడదనియు మనస్సునందుంచుకొని సదా జాగరూకతతో మెలగవలెను. హిందూ ధర్మశాస్త్రములందు మల మూత్ర విసర్జనమునకు తావుల నేర్పాటుచేసి యున్నారు. అనేక విధుల నేర్పాటు చేసియుంచిరి. వానినన్నిటిని గమనించునట్లు పాలకులు బోధించుచు, ఆ విధుల మీరిన వారిని దండించుచుండిన పల్లెలు ఆరోగ్యదాయకములుగ నుండును.

పట్టణములు ప్రకృతి జీవనావలంబులకు నరకలోకములు. ఇవి
వీరికి నివసించుటకు దగినవిగావు. ఇందు కృత్రిమాహార జీవులే
నివసింపవలెను. ఇందలి జనులకు విశాలములైన పెరళ్ళుండవు.
పైకిపోవుటకు దగిన బయళ్ళుండవు. నాలుగైదుమైళ్లు పోయిన
గాని ఆరోగ్యమైన గాలి దొరకదు. స్వభావసిద్ధమైన ప్రవా
హోత్పాదకము లేదు. కృత్రిమాహారమేగాక సర్వమును
కృత్రిమమే. ఇందలి జనుల యావసరములు మెండు. వీటిని దీర్చు
కొనుటకుగాను పలుపాట్లు పడవలెను. మలమూత్ర
విసర్జనమునకు పడకగది ప్రక్కనో లేక వాటయింటి
ప్రక్కనో పాకీదొడ్డి యుండును. వాడిన నీరు వీధిలో
అరుగుప్రక్కను కుండులో నిల్వయుండును. చెత్త ఇంటి
యెదుట కుప్పగానుండును. ఇండ్లు "నరుల యిడవుల వలె"
క్రిక్కిరిసి యుండును. ఇట్టి తావులందు ఆరోగ్యమునకు ప్రయ
త్నించుట లాభములేని పని యగును. ఇందలి జనులు కృత్రిమ
జీవనులై దుర్వాయు దుష్టజలముల కలవాటుపడి యుందురు.
వైద్యులసాహాయ్యము లేకయొకరోజైనను గడపలేరు. సర్వదా
బాధపడుచు ఆరోగ్యమన్న నేమియో వీరెరుగనందున అట్టి
జీవనమునకే యలవాటుపడి యుందురు. పట్టణవాసులకు గృహ
నిర్మాణమును గూర్చిగాని, ఆరోగ్య శాస్త్రమును గూర్చి
గాని బోధింప నక్కరలేదు. ప్రకృతి శాస్త్రాచరణము వీరికి
సాధ్యముగాదు. "ఎద్దునకేమి తెలియును అటుకులరుచి" యను
నట్లు ఆరోగ్యభాగ్యమన్న వీరెరుగరు. లభ్యమైనంత యారో
గ్యము సంపాదించుకొనవలెననిన మునిసిపలు సంఘమువారు
ప్రజలనిరోధించి మరుగుదొడ్లు మురుగునీటికుండ్లు ఇండ్లలో

గట్టుకొనక దూరముగా ప్రత్యేకింపబడి మునిసిపలువారిచే నిర్మింబడిన స్థలములలోనే మలమూత్రవిసర్జనము చేయుటయును, చిన్న చిన్న కాలువలగుండ మురుగునీరు ప్రత్యేకముగ నేర్పాటు గావింపబడిన మురికినీటి గుండములోనికి పోవునట్లును జేసినయెడల కొంతవరకు గాలి బాగుపడగలదు. రైలుబళ్లయందే ప్రతిపెట్టెకును ఒక మరుగుదొడ్డి నేర్పాటు చేసినట్లు ప్రతివీధికిని ఒక బయలు నేర్పాటుచేసి దానియందు మరుగుగానుంటకు దగిన చిన్నరుప్పల పెంచుటయు, విశేషముగా జలచరములుగల గుంటల నేర్పాటు చేయుటయు జరిగి ప్రజలందరును ఆస్థలములలోనికి పోవునట్లు నిర్బంధింపబడిన యెడల కొంత యుపకారము జరుగగలదని నా యల్పబుద్ధికి దోచుచున్నది. ఈ బయళ్లు వృక్షములు గలవగుటచేతను, ఎండదగులునవి గనుకను, సృష్టియందు పాకీపని కేర్పడిన పందులు మొదలగు జంతువులుగల వగుటచేతను, ఏరోజున కారోజు శుభ్రపడును. గచ్చు, రాతిచపటా మొదలగున వక్కరలేదు. ఈ పందులను మునిసిపాలిటీ వారే పెంచునెడల ఇందుకగు ఖర్చులో జాలభాగము రాగలదు. మిగిలినది పన్నులమూలమున రాగలదు. ఎండ కన్నెరుగని ఆగర్భ శ్రీమంతుల కింత దూరముపోవుట మొదట గష్టముగనున్నను అలవాటైనకొలది సుఖముగ నుండును. ఈమలమును వేలమువేసి పొలముల కుపయోగించుటవలన ఈ పెంటచే బెంచబడిన ధాన్యాదులను, శాకములను దినుటవలన మనుష్యుల యారోగ్య భంగము గలుగుచున్నది. పందులకిదిసహజాహారమగుటచే వానికేమియు

ఆరోగ్య భంగములేదు. కుళ్లునీళ్లు దూరముగా నొక చెరువు లోనికి పోయి అందు నిలవయుండినను అందు పెరుగు జల చరములచే ఆ కుళ్లంతయు తినబడి దుర్వాసనరాదు. ఈనీటిని దూరముగ గొనిపోనక్కరలేదు. ఇందలి చేపలనిర్మూలము చేయక పెద్దవానిని మాత్రి మప్పు డప్పుడు పట్టించి అమ్ముకొనుట వలన కొంతద్రవ్యము రాగలదు.

## ౧౯. సూర్యరశ్మి

సూర్యుని యొక్క ఉదయాస్తమానములను బట్టి దివారాత్రము లేర్పడుచున్నవి. ఉదయమందు సూర్యోదయముతో సమస్త జీవకోటియు నిద్రలేచి ఉత్సాహముతో వాని వాని పనులను నిర్వర్తించుకొనగ దార్ఢ్యము గలదగుచున్నది. రాత్రి సుఖనిద్రపోయినందున అలసటదీరి నూతన శక్తి గలవై తమ తమ యాహారముల వెదకి కొనుటకై పశు పక్ష్యాదులు బయలుదేరును. మనుష్యుడును అట్లే నూతనశక్తితో తన దినకృత్యముల దీర్చుకొనుటకు బయలుదేరును. జీవకోటి యొక్క యీ శక్తియంతయు సూర్యుని బట్టియే యుండును. సూర్యుడు ఉదయించినది మొదలు 12 గంటల వరకును తన కిరణముల బెంపొందించుచు, 12 గంటలు మొదలు అస్తమించు వరకును క్షీణింప జేయుచుండును. మొదటి కాలమును పూర్వాహ్ణమనియు, రెండవ దానిని అపరాహ్ణమనియు వాడుదుము. పూర్వాహ్ణమందు సూర్యునికిరణములు భూభ్రమణమున కెదురుగ బడుచుటచే సూర్యరశ్మి ఎక్కువ వేడి గలదగుచుండును. అపరాహ్ణమునం దా కిరణములు భూభ్రమణము ననుసరించి

యుండుటచే వేడి తగ్గుచుండును. రాత్రి నిద్రతో నూతన చైతన్యమునొందిన శరీరావయవములు సూర్యకిరణముల వేడి తోగూడి యెక్కువ శక్తిమంతములై రోగము నెదుర్కొను శక్తియు, జీర్ణముచేయగల శక్తియు అధికముగ గలిగియుండు టచే పూర్వాహ్ణమునందు సమస్తకార్యములును మిక్కిలి శక్తితోను ఉత్సాహముతోను జరపుచుందుము. అపరాహ్ణమం దంతకంతకు శక్తితగ్గ ప్రారంభించిన తోడనే దేహము బడ లికగొని నిద్రించుట కొఱకు జూచుచుండును.గావున సూర్య రశ్మికిని, జీవకోటియొక్క ప్రాణశక్తికిని సంబంధముగలదని తెలియుచున్నది. రోగుల విషయములో పగటికంటె రాత్రుల యందు రోగమును ఎదుర్కొనుశక్తి తగ్గియుండుటచే రోగ బాధ రాత్రులయం దధికముగ నుండును. అందువలననే రోగచికిత్సయు ప్రాతఃకాలమునందు జేసిననే ఎక్కువలాభకారి యగుచున్నది. ప్రాతఃకాలమందలి ఎండకుగల శక్తి మధ్యా హ్నపు టెండకులేదు. ఉదయకాలపు ఎండ, శరీరశక్తి నభివృద్ధి జేయును. గనుకనే రోగపదార్థమును బయటకు గెంటివేయు టకు గలశక్తి వృద్ధియై, ఉదయమున నెండలో దిరుగు మను ష్యులకు వికారము గలుగుచున్నది. రోగపదార్థము శరీర మందులేని ఆరోగ్యవంతుల కట్లుగాక బహు సౌఖ్యముగ నుండును. ఎండలో పనిచేయు మనుష్యులు దార్ఢ్యవంతు లుగ నుందురు. చెట్లలోకూడ ఉదయపుటెండదగులని చెట్లు కాయకుండుటయు, చెట్టునం దేభాగము ఉదయపు టెండలో నుండునో ఆభాగమెక్కువ గాయుటయు అందరకును దెలిసిన విషయమే! కావున నెండయే ప్రాణము. సర్వజనులును

ఉదయమున గొంతసేపైనను ఎండలో దిరుగాడు టత్యావస రము. ఎండయననేమో దెలియని స్త్రీ పురుషులు గొందరు గలరు. వారే యెల్లప్పుడును రోగులై యుండునది. సూర్యుని యొక్క రోగనివారణ శక్తిని గ్రహించియే సర్వరోగములను సూర్యనమస్కారములచేతను, సూర్యకిరణ చికిత్సచేతను ప్రకృతివైద్యులు గుదుర్చుచున్నారు. సూర్యుడు కనబడని రోజును దుర్దినమందురు. ఆరోజున ఉత్సాహము తగ్గియుం డును. కనుకనే అట్టిదినమం నుపవసించుట యేర్పరచి యున్నారు. రాత్రిలు విశ్రాంతి దీసికొనవలసిన కాలమేగాని దిట్టముగ దినుటకును, ఆడుటకును, పాడుటకును దగినకాలము గాదు. సమస్త కార్యములును సూర్యాస్తమయకాలమునకు ముగించి పిమ్మట నిద్రించుటయే ప్రకృతి యేర్పాటు. నాగరి కతనెరుగని జంతుజాలమెల్ల అట్లే చేయుచున్నది. మనుష్యుడు మాత్రము రాత్రిలనుగూడ పగళ్లుగా మార్చుటకు తగినంత వెలుతురును గల్పించి పగటికంటె రాత్రిలయందే వినోద ముల ననుభవించుచున్నాడు. ఇది ప్రకృతి సూత్రముల నిరాక రించుటయే. తత్ఫలితముగనే ఉదయమం దాకలి లేకుండుటయు, యుక్తకాలమందు భుజింపుటకు వీలులేకుండుటయు దటస్థించు చున్నది. జనులు రోగగ్రస్తులగుటకిదియు నొకకారణమే. నాటకములు, సినీమాలు, విందుభోజనములు మొదలగు విషయసుఖముల నెల్ల రాత్రి నిద్రబోవలసిన సమయములం దనుభవించు చుండుటచే విశ్రాంతి నొందవలసిన అవయవ ములు విశ్రాంతి లేక మరింత శక్తిహీనములై తమపనిని తాము సక్రమముగ చేయజాలక పోవుటచే రోగములు పుట్టుచున్నవి.

రోజునందు దివారాత్రములవలెనే ప్రతి మాసమునందును శుక్ల పక్షము, కృష్ణపక్షము నని రెండుపక్షములు గలవు. కృష్ణ పక్షమునందు పగలు ఎండ తీవ్రముగ నుండును. రాత్రు లతి మందముగలవై చైతన్యరహితములుగ నుండును. రోగములు కృష్ణపక్ష రాత్రులయందే ప్రకోపించును. చెట్లలోగూడ కృష్ణ పక్షమందు గొట్టిన కర్రపుచ్చదు. శుక్ల పక్షమందు కొట్టినకర్ర పుచ్చును. ఇట్లే సంవత్సరమునందు ఉత్తరాయణారంభమైన మకరసంక్రాంతి మొదలు సూర్యునికి శక్తి హెచ్చుచుండును. కర్కాటక సంక్రాంతితో ప్రారంభమగు దక్షిణాయనమందు సూర్యునిశక్తి తగ్గుచుండును. దక్షిణాయనమందు వచ్చు శీత కాలము సర్వరోగములును గలుగుకాలము. శరీర మీరోగ ముల నెదుర్కొను శక్తి లేకయుండును. ఈకాలమునందే చావు లధికము. శీతలదేశములం దీ శీతకాలము బహుదారుణముగ నుండును. ఈప్రదేశములందు జీవకోటికి దగిన యాహారము సృష్టియందు దొరకదు. గనుకనే బహుతక్కువ దినుటయు, లేక ఉపవసించుటయు ప్రకృతిమాత యుద్దేశములని గ్రహింప వలెను. ఉపవాసపు పండుగలన్నియు హిందువులం దీకాలము ననే గలవు. రాత్రిళ్లు భుజించుటకు దగుకాలములుగావో అట్లే యీదక్షిణాయనమును విస్తారము దినదగిన కాలము గాదు. శీతగాలి నెదుర్కొనుటకుగాను, విశేషబలకరమును ఉష్ణమును బుట్టించు ఆహారపానీయముల నీకాలమునందు తీసి కొనవలె నను సిద్ధాంతములు సత్యములుగావని ప్రకృతి ననుస రించి జీవించు జంతువులు మనకు బోధించుచున్నవి. ఈ జంతు వులు శీతలదేశములందలి బొరియలలో దాగియుండి వసంత

కాలముతోనే బయటికివచ్చును. చెట్లు చేమలు శీతకాలము
నందు ఆకులురాల్చి మొద్దులవలెనుండి వసంతకాలమువచ్చిన
తోడనే చిగుర్చును. ఈ కాలములో గల పుష్పము లతి
సువాసన గలవి. ఈ దృష్టాంతముల బట్టి శీతకాలమునం దతి
స్వల్పాహారము మాత్రమే దీసికొనదగినది. ఈ కారణము
లన్నిటిని బట్టి జీవకోటియొక్క బ్రతుకంతయు సూర్యునితో
సంబంధించి యున్నదనియు, సూర్యరశ్మి మనశరీరముల కెంత
యెక్కువగా దగిలిన అంత శ్రేయోదాయక మనియు,
ప్రాతఃకాలపు టెండయందు మధ్యాహ్నపు టెండకంటె
రోగనివారకశక్తి యెక్కువగా నుండుననియు గ్రహింప
వలెను. ప్రాతఃకాలపు టెండ కూడదని వ్రాసిన సిద్ధాంతములు
శరీరబలమును జంపునట్టి మందువైద్యుల సిద్ధాంతము. చైతన్య
మును, బలమును అభివృద్ధిపరచి రోగపదార్థమును వెడల
జేయు ప్రాతఃపాలపు ఎండ మధ్యాహ్నపు టెండకంటె అనేక
రెట్లు లాభకారి.

ఎండలో బనిచేయు కూలివాండ్రును, వ్యవసాయదార్లును
జవసత్వములు గలిగి ఆరోగ్యముగా నుందురు. ఎండకు భయ
పడు భాగ్యవంతులు అనారోగ్యులుగను సత్వహీనులుగను
నుందురు. ప్రతిమనుజుడును ప్రాతఃకాల సూర్యకిరణములను
పూర్తిగా వ్యాపింపజేసికొనునట్లు ఎండలో పరిశ్రమ చేయ
వలెను. సూర్యకిరణములు పచ్చనియాకులలో నుండిగాని,
తడిగుడ్డలోనుండిగాని శరీరమునకు దగిలినపుడు, వాని రోగ
నివారకశక్తి అసమానమైనది. ముదురుకాయలు పండుటకును,
లేతకాయలు పెరుగుటకును చెట్లయొక్క ఆకులద్వారా యీ

కాయలకు దగులు సూర్యకిరణములే సాధనములు. అట్లే జ్వరరోగారంభము నందును,రోగి బలహీనుడై నపుడును, సకల వ్యాధులయందును, చర్మము యొక్క శక్తి నభివృద్ధిచేసి, చర్మ ముక్రింద జేరి దానిని మొద్దుబారజేయు అన్యపదార్థమును గరగించి చెమటరూపమున వెలువరించుటయందు సూర్యకిరణము లధికశక్తిగలవి. రోగి పచ్చనియాకులతో గాని, తడిగుడ్డతో గాని శరీరమెల్ల గప్పుకొని ఎండలో బరుండి శరీరమెల్ల చెమ ర్చునంతదనుక ఎండలోపరుండుటచే నీ సదుపాయముచేయ గలుచున్నది. వేసవికాలపు టెండలో ప్రయాణము చేయు మనుజునకు వడ దగులునుగాని యామనుష్యుడే తడిబట్టనెత్తిని వేసుకొని ఎంతదూరము ప్రయాణము చేసినను వడగొట్టదు. ఈ తడిగుడ్డను ఆరనివ్వగూడదు. సూర్యకిరణముల వలననే ప్రవాహములందలి నీరు శుభ్రపడుచున్నది. మురుగు గుంటల లోని నీ రింకుచున్నది. చెడు పదార్థములన్నియు ఎండి దుర్వా యువులు నశించుచున్నవి. చెడు నీరంతయు ఆవిరిరూపమున ఆకాశమునకేగి తిరిగి మేఘరూపమునుదాల్చి వర్షించి మంచి నీరుగా మారుచున్నది. సూర్యుడు లోకమునకు జేయు ఉప కారమింతింతని చెప్పతరముగాదు. కావుననే సూర్యునకు"లోక బాంధవు"డను పేరుగలిగెను. ఇట్టి శక్తిగల సూర్యుని ప్రత్యక్ష దైవమని హిందువులు గొల్చుటలో నేమియు ఆశ్చర్యములేదు.

## ౧౭. నిద్ర

మనుష్యు డారోగ్యవంతుడుగా నుండుటకు మంచి నిద్ర యవ సరము. ప్రకృతి ననుసరించి జీవించు పశుపక్ష్యాది జీవరాసు లెల్లను సూర్యోదయముతో అత్యుత్సాహముగ నిదురలేచి.

ఆహారసంపాదనకై బయలుదేరి పగలెల్ల పాటుబడి భుజించి సూర్యాస్తమయముతో వాని వాని యునికిపట్లయందు జేరి సుఖముగ నిద్రించును. మనుష్యు డట్లుగాక తనకున్న జ్ఞాన శక్తిని దుర్వినియోగముచేసి పగటిని రాత్రిగను, రాత్రిని పగటిగను మార్చి, రాత్రి సుఖనిద్రయం దుండవలసిన సమయమునందు విందులు గుడుచుచునో, లేక పేకయాడుచునో, లేక నాటకములు, సినిమాలు మొదలగువానిని జూచుటయందో గడపుచున్నాడు. పగలెల్ల గష్టించి పనిచేసిన మనుజునకు పాన్పుగుర్రికుసరికి నిద్ర తనంతటతానే వచ్చుచున్నది. అట్టి వానికి చక్కని స్థలముతోగాని, మెత్తని పాన్పుతోగాని పని లేదు. అట్టి వాడే నిద్రయొక్క సుఖము ననుభవింపగలుగును. ఆ నిద్రతోనే శరీరబడలిక యంతయు దీరి మరుచటి దినచర్యకు సంతోషముతో సిద్ధము గాగలడు. పగలు దేహపరిశ్రమ యెరుగని నాగరకజనులు ప్రకృతిని ధిక్కరించి రాత్రులందు చాల సేపు మేల్కొని సుఖనిద్రగానక పరితపించు చుందురు. నిద్ర సకల దుఃఖములను మరపించును. సర్వేంద్రియములకును విశ్రాంతినిచ్చి వానిని తిరిగి శక్తియుతములుగ జేయుచున్నది. నిద్రపోవు సమయమునకు జీర్ణకోశముననున్న పదార్థమంతయు జీర్ణమై విశ్రాంతిగ నుండినచేగాని సుఖనిద్ర గలుగదు. సర్వేంద్రియములును విశ్రాంతి గోరినట్లే, జీర్ణకోశమును విశ్రాంతిని గోరును. కావుననే రాత్రులందు మనము భుజింపక సూర్యాస్తమయ సమయమునకే తేలికగా భుజించి నిద్రకుబోవు సమయమున కరుగునట్లు జాగ్రతపడినప్పుడు మాత్రమే సుఖనిద్ర గలుగును. సర్వరోగముల యందును జీర్ణకోశమునకు పని

గల్పింపక, అనగా లంకణముగాని, అట్టి లఘుభోజనముగాని చేసి జీర్ణకోశమునకు పని తగ్గించి సుఖనిద్రకు తావొనర్చిన సకల రోగములును శాంతించును. నిద్ర, కన్నతల్లివంటిది. మిక్కిలి బాధపడెడు రోగియు, విచారగ్రస్తుడగు పాపియు, కోపముచే మండిపోవు క్రూరుడును, ఒడలెరుగని త్రాగుబోతును నిద్రచే, శాంతించి వానినన్నిటిని మరచి అనంతర మందు సుఖించగలుగుదురు. చంటిపిల్లలు నిద్రపోవుటచేతనే వృద్ధిపొందుచున్నారు. కీటకాదులు నిద్రలో ననేక మార్పులం బొందుచున్నవి. గాన నిద్ర మన కెల్లవిధముల మహోపకారి.

## (1) ఎట్టి స్థలములందు నిద్రించవలెను?

నిద్రపోవునపుడు సర్వేంద్రియములును విశ్రాంతి దీసికొనుచున్నను, శ్వాసాశయములును హృదయమును దమ పనిని తాము నెరవేర్చుచునే యుండును. వీనిని మనస్సు శాసింప నక్కరలేకయే పనిజరుగును. అట్టి తరుణమందు పీల్చుగాలి మంచిదిగానియెడల దుర్వాయువు శ్వాసకోశములోనికి బోగలదు. నిద్రించుతావున శుభ్రమైనగాలి యుండవలెను. మనము విడుచు బొగ్గుపులుసు గాలి పైకిపోవు యేర్పాట్లుండవలెను. ఆరుబయటగాని, లేక పైకప్పుమాత్రముండి విశాలముగ గాలి వచ్చు తావునగాని నిద్రింపవలెను. గదులయందు నిద్రించునెడల అవి విశాలముగ నుండవలెను. ఒకవైపునుండిమంచిగాలివచ్చుటకును, రెండవవైపునుండి చెడుగాలి పోవుటకును దగినట్లుఎదురెదురు కిటికీలుండవలెను. చలికాలమునందైనను ఈ కిటికీల మూసి నిద్రింపరాదు. చలిగా నుండిన ముఖముమాత్రము

పైకుంచి మిగిలిన శరీరమంతయు గప్పుకొనవలెను. పడకగదిలో గాలిని బాడుచేయు పదార్థము లేమియు నుంచగూడదు. సామానుల గదులందు నిద్రింపరాదు. పేదవారికి తగినంత విశాలభవనము లుండవు. అట్టివారు ప్రకృతి మాతచే నొసగ బడిన భూభాగమున, ఆకాశ ఛాందినీక్రింద సుఖముగ నిద్రిం చవలెనేగాని, క్రిక్కిరిసియుండు తమ యిండ్లయందే నిద్రింప రాదు. నిద్రించుతావున రాత్రిలయందు వెలుగుండగూడదు. దీపముల వెలుగు నిద్రాభంగమును జేయును. ప్రకృతియందు పగలు వెలుగును, రాత్రులందు చీకటియును గలదు. రాత్రులు వెలుగైకావలసినచో సర్వజ్ఞుడగు పరమేశ్వరుడు రాత్రులందు గూడ సూర్యునివంటి తేజోగ్రహము నొకదాని నేర్పాటు చేసియే యుండును. అది గ్రహించక మనుష్యులు దమ తెలివి నుపయోగించి రాత్రిలను పగళ్లుగజేయునంతటి తేజోసాధన ముల గల్పించి యున్నారు. అందువల్లనే యీ కాలమునం దెల్లెడల నాడీరోగము లభివృద్ధి నొందుచున్నవి. నిద్రించు స్థలమునందు దీపము లేకుండుటగాని, లేక బహుచిన్నదైన దీప ముగాని చాలును. మనుష్యులుగాక తక్కిన భూచర జంతువు ల న్ని యు ను భూ మి య ం దే నిద్రించునుగాని, మంచ ములను, పరుపులను గోరవు. కష్టించి పనిచేయు పేదవార లందరును, భూశయ్యయందే సుఖనిద్ర గాంచెదరు. భూమి మనశరీరమందలి అధిక అల్ప ఉష్ణములను, తనలోనికి లాగు కొని సమధాతువును గలిగించుచు. ఇట్టి లాభము ఎత్తుమంచ ములందుగాని, పరుపులందుగాని లేదు. నేడు నాగరకతా ప్రభావముచే మట్టియిండ్లే అరుదగుచున్నవి. గచ్చును, రాయి

యు గల నేలయందు బరుండుటచే నట్టి లాభములేదు. మంచ ములమీాద పరుండవలసిన యెడల అంతయెత్తులేని మంచముల యందు బరుండుట మంచిది. సుఖనిద్రకు మెత్తని పాన్పులును, సంగీతాది సాధనములును, చందనచర్చలును సాధనములుగావు. చక్కగా దేహ మలయు పరిశ్రమ, మనోనిర్మలత, సంతోషము, దేహమునకు గావలసినంతకు ఎక్కువ తక్కువగాని తిండియు మాత్రమే సాధనములు. 'నిద్ర సుఖమెరుగదు' 'ఆకలి రుచియెరుగదు' అనునట్లు ప్రకృతి ననుసరించు జీవరాసు లన్నిటివలెనే మనుష్యుడును ప్రకృతిజీవన మవలంబించు నెడల సుఖనిద్రను బొందగలడు.

## (2) ఎంతకాలము నిద్రింపవలెను?

ఇట్టి ప్రశ్నలకు ప్రకృతి ననుసరించువారికి తావులేదు. సర్వ నిర్ణయములను శరీరమే చేయగలదు. ఆ కాలమందు నిద్రగాని మెలకువగాని రాదు. కష్టించి పనిపాటలు చేయువారు పగటి యందు నిద్రించరు. రాత్రులయందు మేల్కొనరు. పనిపాటలు లేని సోమరులకు పగలు నిద్రవచ్చును. రాత్రులు నిద్రపట్టదు. ఇది ప్రకృతి విరుద్ధము. నిద్ర మన చేతిలోని దన్నట్లు ఎవరు "ఎంతకాలము నిద్రించవలె"నను ప్రశ్నకు తావులేదు. ప్రకృతి ననుసరించి జీవించువారు సకాలమందు నిద్రిచే అవశులై ఎంతకాలము గాఢ నిద్రవచ్చునో అంతకాలమును సూర్యాస్త మయకాలము మొదలు నిద్రించవలెను. తెల్లవారుఝామున 4 గంటలు మొదలు మెలకువ వచ్చిన తరువాతనిద్రనుండి లేచి కాలకృత్యములను దీర్చికొని సూర్యోదయమునుండి దినకృత్య

ములకు సిద్ధముగ నుండవలెను. ఆరోగ్యవంతులైన పసిపిల్లలు రాత్రి యంతయు నిద్రించెదరు. రాత్రులందు వీరికి పాలుకూడ అవసరములేదు. 4 గంటలకు లేచి పాలుత్రాగి అల్పాచమాన అధికాచమానముల గావించి పిమ్మట ఆడుకొందురు. ఉదయమున నీళ్లుపోసిన తరువాత చక్కగా అలయుటచే నిద్రించెదరు. తిరిగి మధ్యాహ్నమందు ఎండవేళ నిద్రించి సాయంత్రమందు లేచి ఆడుకొందురు. సగటున వీరికి రోజు 1కి 18 గంటలు కాలము నిద్ర అవసరముండును. ఏడాది గడచినవారికి 15 గంటలును, 3 సం॥లు గడచినవారికి 12 గంటలును,7సం॥లు మొ॥ 12 సం॥ల వరకు 10 గంటలను, పిమ్మట యౌవనులకు 8 గంటలును, కౌమారదశయందు 6 గంటలకుతక్కువగాని నిద్రయును, అవసరము. పనిపాటలు చేయగలిగినంత కాలము ఇట్లే నిద్రించాలును. వృద్ధులు పనిపాటలు చేయలేరు. వీరి శరీరమందు రక్తబలిమి తక్కువ. అవయవ పటుత్వము తగ్గునుగాన వీరికి గాఢనిద్ర యుండదు. కాని 8 గంటలకంటె నధికకాలము విశ్రాంతి కావలెను. చక్కని ఆరోగ్యవంతులకు స్వప్నములు మొదలగు వానిచే కలతపొందని నిద్రపట్టును. అజీర్ణముచే బాధపడువారికి స్వప్నములచే కలతనిద్ర గలుగుచుండును. స్వప్నములు గల్గినయెడల అజీర్తి గలదని తెలిసి దానిని పోగొట్టుకొనవలెను.

## ౧౮. సంభోగము - బ్రహ్మచర్యము.

జీవింపవలెననుఆశ, ఆకలి, తమవంశమును వృద్ధిపరచుకొనవలెనను కోరికయును, ప్రతిజీవికిని సహజములు. తమ జాతి

నభివృద్ధిపరచుకొనుటకు గాను జీవజంతువులేగాక, వృక్ష వర్గములు గూడ ప్రయత్నించును. మనుష్యులలో దప్ప నితర జంతువులలోగాని, వృక్షములలోగాని, సంతానము లేని స్త్రీ జంతువుగాని, వృక్షముగాని ఉండుటకుదు. మనుష్యులలో అనారోగ్య మభివృద్ధియయిన కొలది వంధ్యాత్వ మెక్కువగు చున్నది. ఇదికూడ పనిపాటులు చేయక కూర్చుండి తిను భాగ్యవంతులలోనే, మిక్కుటముగ వంధ్యా స్త్రీలలో జూడనగును. ఇట్టి వంధ్యలకే సంభోగవాంఛ మెండు. కష్టించి పనిపాటలు చేయు కూలివాండ్రి కంత సంభోగవాంఛ యుండదు. ఆరోగ్యము చెడినకొలది సంభోగవాంఛ అధికమగుచుండును. ప్రకృతి ననుసరించి బ్రతుకు జంతుజాలములకు సంభోగమనునది సంతానముకొఱకైన పవిత్రకర్మ. సంతానము కనుటకు సిద్ధముగా నున్న తరినే "ఋతుకాల"మందురు. అప్పుడే సంభోగేచ్ఛ జనించును. ఆ తరుణమందే పురుషజంతువుచు సమీపించును. సంభోగము జరుగును. వెంటనే గర్భము గలుగును. పిమ్మట పురుష జంతువును దగ్గర జేరనీయదు. తిరిగి పిల్లలను గని వానిని పెంచునంత కాలము సంభోగవాంఛ గలుగదు. ఇటే సంతానము కొఱకే సంభోగవాంఛ గలుగును గాని విషయసుఖము కొఱకుగాదు. గొఱ్ఱెలలో దేనికైనను అధిక సంభోగవాంఛ గల్గినయెడల గొల్లవాడు దానికి రోగము పుట్టినట్టు గ్రహించి తగు చికిత్సచేయును. మనుష్యులయం దిట్లుగాక మైథునమనునది నిత్యకర్మగా నెంచబడుచున్నది. పశుపక్ష్యాదులయం దీకర్మ పవిత్రమగునదై నందున రహస్యకర్మగాదు. మనుష్యులయం దిది అతిరహస్య

కర్మగా జేయబడి అర్ధరాత్రి యందే జరుపబడు చున్నది. కావున పురుషులయందు వీర్యపటుత్వము లేకుండుటయు, వీర్యవృద్ధికరమగు వాజీకరణౌషధ రసాయనాదుల సేవనమును అత్యవసరము లగుచున్నవి. స్త్రీలయందు బలహీనత, బాల్యావస్థగడచినపిమ్మట నే యౌవనములేక యేవృద్ధాప్యము, కురూపత్వము, దుర్బల సంతానమును ఫలితము లగుచున్నవి. ఉభయులందును నాడీరోగము లభివృద్ధి గాంచుచున్నవి. స్త్రీలు గర్భమును ధరించినదాది వేవిళ్ళతో కొంతకాలము బాధపడుదురు. తదుపరి మాసపూర్తి యగువరకు కదలలేక యుండుటయు, నిత్యము నేదోబాధచే బీడింపబడుటయు, సుఖప్రసవమనునది లేక వైద్యసహాయమును శస్త్రసహాయమును లేక ప్రసవమగుట దుర్లభ మగుచున్నది. సంతానముగూడ దుర్బలమే. పిల్లలను బెంచుటకు దగినపాలుండవు. దీని కంతకును గారణములు అస్వాభావికాహార విహారములని గ్రహించలేక బాల్యవివాహములనియు, బలముగల తిండితినుట లేదనియు, వైద్యసహాయము చాలదనియు, శాస్త్రవేత్తలు చెప్పుచున్నారు. పిల్లలకు పాలులేకుండ, దుర్బలసంతానము, దుర్బల ప్రసవములు, కురూపత్వము మొదలగున వన్నియు పూర్తిగా కృత్రిమ జీవనులైన నాగరకులయందును, భాగ్యవంతులయందే యుండునుగాని, పల్లెటూరి స్త్రీలయందును, పేదవారియందును బహు తక్కువగా నున్నట్లు చెప్పక తప్పదు. బాల్యవివాహములు అనేక కారణములలో నొక కారణమగునేగాని అది యొకటే కారణముగాదు. వివాహ మెప్పుడు జరిగినను రజస్వలలై యుక్తవయస్సు రాకపూర్వము, గర్భధారణగాదు.

రజస్వలయగుట సంతానార్హతను దెల్పును. పశుపక్ష్యాదుల యందెల్ల నీ నియమమే పాటింపబడుచున్నది. మనుష్యుల యందు యుక్తవయస్సు రాకపూర్వమే రజస్వలయగుటకు కారణము లున్నవి. అస్వభావికాహారసేవనమేగాక పుట్టి నప్పటి నుండియు పెద్దల నోటినుండివచ్చు వివాహసంబంధ మైన మాటలు వినుటయు, ఆటలయందు పిల్లలను పెంచుట, నీళ్ళుపోయుట, పాలిచ్చుట మొదలగు వానినిగూర్చినఆటయు, దుశ్చింతలతో బాల బాలికలుచేరి ఆటలాడుటయు, చదువు టయు, ఇట్టి నాడీరోగములకును, దుర్బల, అనారోగ్య సంతా నమునకును కారణములు. పాశ్చాత్య నాగరకతా వ్యామో హములో జిక్కుకొని, మనదేశ శీతోష్ణస్థితికిని, పాశ్చాత్య దేశ ముల శీతోష్ణస్థితికిని గల వ్యత్యాసములనైన గమనింపక కృత్రి మాహార విహారాదుల కలవడి, ఆరోగ్యమును పూర్తిగ నశిం పుచేసుకొని సరియైన కారణముల నెరుగక బాల్యవివాహ ..ల వలననే దేశారిష్టమగుచున్నదని వానిమీద మాత్రమే దాడి వెడలుట అనాలోచితమైనపని. స్త్రీపురుషు లారోగ్యవంతులై బలవంతులై దీర్ఘాయుర్దాయవంతులై సత్సంతానమునుగని, దేశాభివృద్ధి గాంచవలెనన్న మొదల, స్వాభావికాహారమునకు మరలవలెను. స్వాభావిక జీవనులు గావలెను. పశ్చిమదేశ నాగరకత అడుగంటి మనదేశ శీతోష్ణస్థితుల కనుకూలించి మనపూర్వులచే ఆచరింపబడిన ఆచారవ్యవహారములను ఇప్పటి దేశ కాల పాత్రల కనుకూలించునట్లు తగుమార్పుల నొనరించి సక్రమ పరిపాలన గావింపవలెను. మన దేశములో పూర్వ కాలమునందు పురుషునకు 25 సంవత్సరముల ప్రాయము

వచ్చువరకు నిర్బంధ బ్రహ్మచర్య వ్రత ముండెడిది. బ్రహ్మ చర్యాశ్రమములో నున్నంతకాలము గురుకులవాసమును, తోడి బాలురతో విద్యాభ్యాసము, గురుశుశ్రూష చేయుటయే తప్ప నితరచింత లేమియు బాలున కుండెడివిగావు. బాలికలు వీరి దృష్టిపథమందు పడుటయే లేదు. సంసార సంబంధమైన చింత వీ రెరుగరు. ఎక్కడనో ఏదోవిధముగ వేళకు దొరికినదానిని భుజించి గురువునే దైవముగా నమ్మి విద్యలు పూర్తిపరచు కొనుటయే వీరి పరమావధి. గురువులు పరమయోగ్యులై శిష్యులకు సన్మార్గములను బోధించుటయే గాక తమనడతలు శిష్యుల కాదర్శపాత్రములగునట్లు నడచుకొనువారుగ నుండెడి వారు. విద్యాభ్యాస కాలమునందు శిష్యులకు స్త్రీలను గూర్చిన చింత మనస్సునందు పుట్టకుండునట్లు తగుజాగ్రత యీవిద్యయందుగలదు. గనుకనే పదునారేండ్లలోపున పర్పడు వీర్యము చక్కగా వృద్ధిపొంది చలింపక, విద్యను పూర్తిపర చుకొని తమ పుట్టినిండ్లకుబోవుసరికి పూర్ణారోగ్యమునకు సాధన మగుచుండెడిది. అప్పుడు వివాహము చేసుకొన్న బాల, యుక్తవయస్కయగు వరకును ఇతరదుశ్చింతలులేక తాను నేర్చుకొనిన విద్యాకౌశలమును ధనవంతులకు జూపిపేరుకీర్తులు సంపాదించి ముందురాగల సంసారపోషణకు తగు ద్రవ్యార్జ నకును, లేక ఉద్యోగ సంపాదనకును తగుసాధనముల గూర్చు కొనుటయందే తనదృష్టినంతను ఉపయోగించుటయే గాని యితర విషయేచ్ఛలకు వారిదృష్టి పోయెడిదిగాదు. అట్టివారిదే అమోఘవీర్యమై యుండెడిది. స్త్రీలు పవిత్రహృదయులై తమ తోడి బాలికలతో గలసి ఆడుచు, పాడుచు, విద్యాభ్యాసము

చేయుచు జ్ఞానముగలిగినదాది, వివాహము చేసికొనిన పతినే దైవముగా నెంచి, వారినే ప్రేమించి తమ సర్వస్వమును పతియేయనియెంచి, యుక్తవయస్సు వచ్చుసరికి ఉన్నదనిగాని, లేదనిగాని సంసారచింతలేక, అత్తమామలు సంసారమును దిద్దుకొనుచుండ నిర్మలహృదయములతో పతులతో రమించి సత్సంతానమును గనుటలో ఆశ్చర్యమేమున్నది! మనది ఉష్ణదేశ మగుటచే సంభోగేచ్ఛ స్త్రీలకును పురుషులకును చిన్నతనమందే పుట్టును. చిన్నతనము నుండియు పరస్పర స్పర్శనాదులచేత మనస్సులయందు బాల్యముననే వికారములు పుట్టును. దానివలన వీర్యమేర్పడుసరికే దానికి చలనము గల్గి చిక్కబడక నీరై యుక్తవయస్సురాకపూర్వమే సంభోగేచ్ఛజనించును. అందువల్ల ఆరోగ్యముచెడి, ఇంద్రియపాటవము లేక వారికి గల్గు సంతానము బలహీనమును, అర్ధాయువుగలదిగను నేర్పడుచున్నది. ఈకారణమును లేకుండజేసి వివాహకాలమును బెంచి, బాల్యవివాహములు మాన్పవలెనని చేయు ప్రయత్నమే "శారదా చట్టము". ఈచట్టమువలన శరీరములను బాహ్యకృత్యములను నిర్బంధించనగునుగాని, మనోవృత్తులను, రహస్యాచరణల నెట్లు నిరోధించగలరో యూహింపజాలము. దేశోన్నతికి పునాదివేయవలెనన్న విద్యాభ్యాసపద్ధతులను మార్చి పురుషులయందు స్త్రీవాంఛ యుక్తవయస్సు వచ్చునంతకాలము పుట్టకుండునట్లు తగినంత పనిని గల్పించి, బాలురయొక్క కాలమునంతను, పగలును రాత్రియుకూడ, ఒక్కనిమిషమైనను వృథపుచ్చకుండ, దుస్సహవాసము చేయుటకును దుశ్చింతలకును అవకాశము లేకుండ యోగ్యులై

నిర్దుష్టమైన నడతలుగల గురువుల యెదుట శాస్త్రములను జదువుటయుండును, తాము చదివినవాని నాచరణలో బెట్టుటయుండును. సమర్థములను జేయు పాఠశాలలను, విద్యాక్రమమును ఏర్పాటుచేయవలెను, ఇట్టి యేర్పాట్లచేత పురుషులయొక్క మనస్సంతయు విద్యాభ్యాసమునం దుపయోగపడి దుష్టవాంఛలకు పోకుండ వారు వీర్యవంతులగుదురు.

దేశమునందంతటను ప్రాథమిక, మాధ్యమిక, ఉత్తమ పాఠశాలలుగలవు. వీనియందు నేర్పువిద్య బొత్తిగా ఉపయోగము కానిదిగా నున్నది. పూర్వపు హిందూదేశపద్ధతి ప్రకారము బాలురకు జ్ఞాపకశక్తి అక్కరలేకుండ జేయుట, ప్రతి విషయమును చిన్నప్పటినుండియు బాలుర వయస్సునకు మీరి నేర్పుటచే ఏవిషయమునందును పాండిత్యము లేకపోవుటయు, చివరకు విద్యాభ్యాసము మానుకొనుసరికి ఏమియు రాకపోవుటయు తటస్థించుచున్నది. మతవిషయములుగాని, దేశభక్తిగాని, ఐకమత్యమును గూర్చిగాని, బోధింపబడకుండుటచే బాలురకేమియు పనికివచ్చు విద్య అబ్బుటలేదు. తల్లిదండ్రులు బాలురవిషయములో తగుశ్రద్ధ దీసికొనకపోవుటచే పిల్లలకు మత సాంప్రదాయములు తెలియకపోవుటయేగాక అన్యమతధర్మముల నేర్చుకొని చెడుపిల్లవాండ్రగుచున్నారు. "విద్యాగురువులు నిర్దుష్టమైన నడతగలవా రుండవలె" నను సంగతి విడచి, విద్యనుమాత్రమే తీసికొని ఉద్యోగము లిచ్చుటచే దుర్నడతగల ఉపాధ్యాయుల ననుసరించి బాలురు దురభ్యాసముల నేర్చుకొనుచున్నారు. బాలురు యుక్తవయస్సును సమీపించు సమయమందు తల్లిదండ్రులుగాని, ఉపాధ్యాయులు

గాని తగు శ్రద్ధదీసికొని, దుష్టసహావాసము, దుర్నడతల పాలుగాకుండ మంచిమార్గమందు తాము నడచుకొనుచు పిల్లలు నడచుకొనున ట్లు చూచుట అవసరము. చాలమంది బాలురు వీర్యోత్పత్తి సమయమగు 15 వ యేడు వచ్చుసరికి స్త్రీవాంఛ మనస్సున బెట్టుకొనుటచేతను, ముష్టిమైథునాది దుష్కర్మలచేతను పలుచబడిన వీర్యముగలవా రగుచున్నారు. పురుషులు మైథునకర్మను నిత్యకర్మలో జేర్చుకొని రాత్రిం బగళ్లు తదేకదృష్టితో నుండుటచేతను, దుష్టసంకల్పముతోనే స్త్రీని పురుషుడును, పురుషుని స్త్రీయు సమీపించుటచేతను వీర్యము స్థానమునుండి కదలి, బలహీనమై చెడిపోవుచున్నది. రాత్రులందు శరీరమును మనస్సును అలసి విశ్రాంతిగోరును. శరీరమందు జలముతగ్గి రోగబల మధికముగ నుండును. మనస్సు నిర్మలముగ నుండదు. అట్టిసమయమందు గర్భమున బడిన శిశువు బలహీనుడు, తల్లిదండ్రులకు గల రోగాం కురములు గలవాడునై అల్పాయుష్మంతుడు నగును. అట్లు గాక వేకువన నిర్మలముగా నుండు సమయమున గర్భస్థుడైన పిండము బలారోగ్యములు గలిగి తల్లిదండ్రులయొక్క ఆరోగ్య మును మాత్రమే పొందును. కాన స్త్రీ సంభోగము వేకువన 3 గంటలకు తరువాత సూర్యోదయములోపల చేయవలసి యుండును. రాత్రులందు కూడదు.

గర్భధారణమయిన పిమ్మట స్త్రీకి సంభోగేచ్ఛ జనింపదు. పురుషప్రేరణచే అట్టి వాంఛ గలుగుచున్నది. గర్భిణి పురుష సంయోగముచేతనే వేవిళ్లు, అరుచి, బలహీనము మొదలగు రోగములకు గురియగును. స్త్రీలయందు ఋతురక్తము గర్భ

మును ధరించువరకు నెలకొకసారి విడివడుచుండును. గర్భధారణమైన పిమ్మట నదికనుపించక, శిశుపోషణకు దగిన పాలుగా మారును. అట్టిసమయమున సంభోగముండుటచే నా ఋతురక్తము జననేంద్రియమువంకకు మరలి స్త్రీలయందు పాలులేకుండుటకు కారణమగును. పాలులేనితల్లులుండుట కిదియే కారణము. జంతువులం దీ విపరీతములేదు. పాలులేని దూడలు బ్రతుకజాలవు. తల్లుల నెవ్వరును పోషింపరు. పోత పాలు, పాలతల్లులు, డబ్బాపాలు, కృత్రిమాహారములు, నవ నాగరికతా ఫలితములు. స్వాభావికాహార, విహారములచేగాని యిట్టి విపరీత శిశుమరణములు, దుర్బలసంతానము మానదు. బలముగల యాహారమునుదినుటవలనగాని, వివాహవయస్సు హెచ్చించుటవలనగాని ఉపకారముండదు.

స్వాభావికాహారము దినుచు నిర్మలవర్తనుడైన పురుషునకు సంభోగముతో నిమిత్తము లేదు. స్త్రీచే ప్రేరేపింపబడనియెడల పురుషుడెన్నడును సంభోగేచ్ఛగలవాడు కాడు. ఒకయింద్రియ బిందు వేర్పడుట కెంతయో రక్తము గావలెను. అనవసరముగ వీర్యమును వృథపుచ్చక ఋతుకాలము నందు స్వభార్యయందు మాత్రమే వీర్యమును నుపయోగించి యితరత్ర దుర్వినియోగపరచని పురుషునకే ఆరోగ్యమును, శరీర మనో దార్ఢ్యములును గలుగును.

వీర్యమును వృథచేసుకొని స్త్రీపురుషులు విచ్చలవిడిగ సంచరింపనియెడల సత్సంతానము గలుగును. శిశువు పాలు త్రాగుచున్నంతకాలము సంభోగావసరము లేదు గాన మూడు సంవత్సరముల కొకటి రెండుసార్లు తప్ప సంభోగావసరముండదు.

స్నానమువలన మోక్షముగల్గునని తీర్థములందును, పుణ్యనదు
లందును హిందువులు స్నానములు చేయుచుందురు. మనస్సే
సర్వమునకు కారణము గాన నమ్మికయుండిన పక్షమున సర్వ
రోగములును నివర్తించును. కాని తడిబట్టలతో నానుట, శరీర
మునకు తిరిగి వేడిరాకుండ భుజించుట నిద్రలేకుండ నాటక
ములు చూచుటవలన ఉపకారమున కంటె అపకారమే తట
స్థించును.

స్నానమువలననే మోక్షము వచ్చునని, రోజున కనేకసార్లు
స్నానము చేయుటవలనను, రోజంతయు నీటితో నానుచు తడి
బట్టతో నుండుటయు, పెంకుతొక్కితిమని స్నానము చేయు
టయు మూర్ఖత్వమును వెల్లడిచేయును గాని యవి మోక్ష
దాయకములు గావు. నియమముల గణింపుచుండిననే స్నానము
మొక్క లాభముగల్గునుగాని నియమముల గణింపకుండిన
అపకారమే గలుగును.

## ౨౧. సబ్బులు, వాసనద్రవ్యములు

పాశ్చాత్య నాగరకత కలవడిన మనదేశజను లెల్లరును సబ్బు
లను వాడుచున్నారు. సబ్బునందుగల వస్తువులను తెలిసు
కొనిన యెడల వాటివలన గలుగు చెడుగులను గ్రహింప
వచ్చును. సబ్బునందు సున్నమును, పొటాషియమును, సోడి
యమును గలవు. ఈ పదార్థములు కంటికి దగులుటవలన
దృష్టి చెడుననియు, శరీరమునుకూడా చెడగొట్టుననియు ఆలో
చన గలవారికెల్ల విశదమే. శరీరము మృదువుగనుంచుట
కొఱకు చర్మమునందు చమురు ఊరును. సబ్బుతో తోముట

వలన ఆచర్మమురునశించి చర్మము చిటచిటలాడును. ఒడలంతయు సబ్బువాసన గొట్టుచుండును. ఈ వాసన అనారోగ్యమేగాక, మరుకు దీనికలవడినపిమ్మట భరించగలునా. సబ్బులకొఱకు ఒక కుటుంబమునకగు ఖర్చుతో ఒకపేదకుటుంబపోషణ జరుగును. సబ్బునందుపడు కొవ్వులు తాకరానివిగదా! అనుపయోగ మును,అనవసరమునగుట యేగాక, అరిష్టదాయకమును దృష్టిని జెరుపునవియు, వృథావ్యయమునుగాన డబ్బులేదని విచారించు వారిట్టిఅరిష్టదాయకమగు సబ్బులవాడుట మానుకొనవలెను. మనదేశమునందు శరీరమునందలి మురికిని బోగొట్టు సీకాయ, కుంకుడుకాయ, కట్టుగెంజలవంటి వస్తువు లనేకములుగలవు. వాటిని వాడినయెడల సబ్బువలన గలిగెడు నష్టములు లేవు. అంత ఖర్చుకాదు. కాన సబ్బులను వాడరాదు. సువాసన కొఱకు కొంచెము అత్తరులనుగలిపి చెడు పదార్థములుగల సబ్బుల నలవాటు చేసుకొనుట మంచిదిగాదు గాన మాన వలెను.

## సు వా స న నూ నె లు

ఈ కాలమునం దెక్కడజూచినను సువాసనగల తలనూనెలను వాడుచున్నారు. పూర్వమునందు వాడెడు కొబ్బరినూనె మోటుఅయినది. వార్తాపత్రికలయందెల్ల ఈ నూనెలవలన వెండ్రుకలు తెగబారెడు పెరిగినట్లు బొమ్మలను వేయు చున్నారు. వానిని జూచి మోసపోయి కొందరును, వానినిజూచి వేలంవెర్రిచే మరికొందరును ఇట్టి నూనెలకొఱకు మితిలేని ద్రవ్యమును వృథచేయుచున్నారు. ఈ నూనెలవలన వెండ్రు కలు పెరిగినవని ఋజువు చేయగలవారి నేరిని గానము. ఈ

నూనెలు వికర్రియదారులు చెప్పినట్లు, మెదడున కుపకారము చేయవుసరిగదా ఇందుపడుచున్న ఔషధ వస్తువులవలన శిరో వ్యాధులుకూడ పుట్టును. కొన్నిటివలన నఉన్న జుట్టుకూడ ఊడి పోవును. మెదడులోని వ్యాధులు, శిరోవాతములు, తల నొప్పులు మొదలగునవి కుదరవలెనన్న అజీర్ణ రోగమును, మల బద్ధమును పోగొట్టుకొనవలెను. అందుకొఱకు ప్రకృతి సిద్ధమైన యాహారమునకు మరలవలెను.గాని అసత్యవచనములనమ్మి మోసబోయి ఆరోగ్యమును ద్రవ్యమును వృథాగా పాడుచేసు కొనకుడని హెచ్చరించెదను. శిరోరోగములన్నియు అజీర్ణ వ్యాధిని సూచించును. దానిని పోగొట్టుకొనుటవలన అట్టి వ్యాధులు కుదురును. ఉపశాంతి గావలెనన్నను, వెంట్రుకలు నల్లబడిపెరుగ వలెనన్నను తడిరేగటిమట్టి పట్టీలును రేగటి మట్టిని తల రుద్దుటవలనను ఉపకారమగును. వ్యయములేదు. ఇట్టి సూక్ష్మ క్రియలవలన ధననష్టము లేకుండ అధికలాభ మును పొందుటకు జ్ఞానముండుట సామాన్యమా ?

అత్తరుల నుపయోగించుట సువాసనకొఱకుగదా! మత్స్య మాంసాదులగు దుర్వాసనవస్తు సేవవలనను, అజీర్తి గలుగు నల్లు చెడకినుటవలనను శరీరములు దుర్వాసన గొట్టుచున్న పుడు దాని నడచిపెట్టుటకుగాను అత్తరులను శరీరమందును, బట్టలయందును రాచుకొందురు. విషము మింగించుటకు పంచ దారలో పొదిగినట్లు దుర్వాసనను ఈ సువాసనచే గప్పి పుచ్చి పీల్చుటగాదా! పంచదారపూసిన విషగుటికముయొక్క గుణము పోనిరీతిని సువాసనలో గలిసి దుర్వాయువు మన యూపిరితిత్తులయందు బ్రవేశించు చున్నది. ఈసువాసన నెప

మున గాకున్న ముక్కు ఈ విషవాయువుల లోపలకు తీసి
కొనదు. ఆవిధముననే చెమటకంపుగొట్టు శరీరమునకు అత్తరు
పూసిన లాభమేమి? ఉల్లిపాయల వాసనపోవుటకు తాంబూల
మేల? అగరు వత్తులుగాని, పునుగు మొదలగునవిగాని,
గాలిని శుభ్రము చేయజాలవుగాని, దుర్వాయువును దమలో
కలుపుకొని ముక్కునకు దుర్వాసన దెలియకుండ జేయును.
ఆరోగ్యవంతుల శరీరములుగాని నోరుగాని వాసనగొట్టవు.
వాసనబోగొట్టుకొనుటకు శరీరము నారోగ్యస్థితిలోనికి దెచ్చు
కొనవలెనేగాని అనర్థదాయకములగు సువాసన ద్రవ్యములను
వాడకూడదు. భాగ్యవంతులు ఆరోగ్యవంతులుగా నుండియు
సరదాకొఱకు వీని నుపయోగించినను అంత కీడు గలుగదు.
ఆరోగ్యమును ముందు గాపాడుకొనవలెను. పేదల విషయము
నందిది మిగుల నష్టమును గలుగజేయును. సోకుకొఱకు తప్ప
ఉపయోగము గలదని యెంచి దీనిని వాడనవసరము లేదు.

వైద్యశాస్త్రజ్ఞులు పాకీదొడ్లయందును, అంటువ్యాధులు గల
యిండ్లయందును క్రిమిని సంహరించుననియు, దుష్టవాయువుల
హరించుననియు, ఫినైలును, జల్లుదురు. దానివాసన దుర్భర
ముగ నుండును. ఈవాసనకూడ పై సువాసనలవలె దుష్ట
వాయువును గప్పిపుచ్చుటయే గాక, "ముల్లుదీసి కొఱ్ఱుగొట్టు
కొన్నట్లు" మరుగుదొడ్డి వాసనకంటె భరింపరానిదిగ నుండును.
పేదలు భాగ్యవంతుల జూచి అనవసరమైన, అనారోగ్యకర
ములగు నిట్టి పరిమళములకొఱకు తమకువచ్చు స్వల్పద్రవ్య
మును పోగొట్టుకొని అత్యావశ్యకములైన ఖర్చులకు డబ్బు
లేక చింతపొందకుండురుగాక! సువాసనలు గావలెననిన

ప్రకృతిమనకు ప్రసాదించిన పుష్పములున్నవి. వానివలన మనో వికాసమును, దుర్వాయు హారణమును గలిగి ఆరోగ్యము గల్గును. పేదలుకూడ సువాసనగల పూలచెట్లను పెరళ్లయందు పెంచు కొనుటవలన ద్రవ్యవ్యయము లేక వీనిని పొంద వచ్చును.

## ౨౨ బలవర్ధకపుష్టౌషధములు, రసాయనములు, లేహ్యాములు

నేటిదినములందు నిరుద్యోగ పురుషులందరకును వైద్యము మంచిసహాయ మొనర్చుచున్నది. ఏవో పేటెంటుమందుల పేర్లను నాలుగు తెలిసికొనుటచే ఘనవైద్యులుగా పరిగణింప బడుచున్నారు. గ్రంథములలో జెప్పిన మూలికల గొన్నిటిని చూర్ణముచేసి లేహ్యాములుగను, రసాయనములుగను, కొన్ని ఫలములతో మురబ్బాలను దయారుచేసి వీర్యపుష్టిచేయున వని సామాన్యప్రజలను మోసపుచ్చి అమ్ముకొనుచున్నారు. ప్రతిమనుష్యుడును ఏదోరోగముతో నుండుటయు, బలము రావలెననియు, రక్తము బాగుపడవలెననియు, ఔషధముల సేవించి వైద్యులసలహాలనుబట్టి విశేషముగ బలమువిచ్చు మాంసాదులను గ్రుడ్లను తినుచున్నందున రోగము కుదరక పోవుటయు, బలము గలుగక పోవుటయేగాక విశేషమైన అజీర్తిగలిగి విషయేచ్ఛ పెంపొందును. ఇంద్రియము నీరైనందున పటుత్వము తక్కువగా నుండుటచే స్త్రీలను జూచి భయపడుచుండుటయు గలుగుచున్నది. ఇట్టిస్థితిలో ఇంద్రియపుష్టికరములనియు, నూర్గురు స్త్రీలతో భోగించి

నను బలము తరుగదనియు చెప్పుమాటలకును, వార్తాపత్రికలందుగల ప్రకటనలకును మోసపోయి బలవర్ధకములైన రసాయనములను, సిద్ధమకరధ్వజము, పూర్ణచంద్రోదయము, ఆతంకనిగ్రహమాత్రలు, సాలామిస్రీ, రత్నపురుష మొదలగు లేహ్యములు, హల్వాలు కొని వాడుచున్నారు. ఇవి చాల బలమైనలోహములు; దుంపలు, నేయి, మొదలగువానితోను, కొన్ని లేహ్యములు మాంసాదులతోను తయారగుటచే మిక్కిలిబలమైన జీర్ణకోశముకూడ వీనిని జీర్ణము చేసుకొన జాలదు. జీర్ణకోశమునకు సహజముగా లభించు ఫలములను; కూరగాయలను; జీర్ణముచేసుకొనగల శక్తిగలదు గాని, యిట్టి బలముగల మందుపదార్థములను వంటకములను జీర్ణముచేసుకొను శక్తిలేదు. అందువలన జీర్ణకోశము పూర్తిగాచెడును. తినిన యీ బలవర్ధకపుపదార్థములన్నియు రోగపదార్థములుగ మారి కొన్నికాలికరోగములు గలుగుటకు సాధనములగును. గాన వీనివలన కొంచెమైనను లాభములేదు. శరీరమందు రోగముగలిగినపుడు శరీరపాటవము తప్పును. అనగా అవయవములన్నియు వానిపని నవిచేయకుండ రోగపదార్థముచే నిరోధింపబడినవని యర్థము. అట్టి సమయములందు లంకణములచేతను, తేలికయైన భోజనముచేతను, వాటికిఇక ముందు అడ్డంకులు గలుగకుండ జేయుటయేగాక, చన్నీటితోను, మట్టిపట్టీలు మొదలగు వానితోను అవయవములకు బలముగలిగించి యడ్డంకుల ద్రోసిపుచ్చి సహజశక్తి గలిగింపవలెను. రోగపదార్థము వదలినతోడనే మనముతినిన ప్రకృతియందు లభించిన యేపదార్థమైనను రక్తముగామారి శరీరము

నకు గావలసినంత శక్తినిచ్చును. రక్తము బాగుపడిన ఇంద్రియ బలము దానంతటది వచ్చునుగాని బలమైనపదార్థములు తినిన బలమురాదు. చిన్న దీపమును విసనకఱ్ఱతో విసరిన ఆరిపోవును. గాని పెద్దమంట కాదు. అట్లే జీర్ణశక్తిలేక మందాగ్నిచే పుట్టిన ఇంద్రియనష్టపురోగములందు బలముగల యాహారము సేవించుటవలన ఉన్న జీర్ణశక్తికూడ అంతరించి మృత్యుసదనమునకు త్వరలో బంపును. గాన వార్తాపత్రికల యందలి ప్రకటనలకు మోసపోయి ఔషధముల దెప్పించి వాడరాదు. కొన్ని మూలికలు ఇంద్రియమును గలిగించునని వైద్యగ్రంథము లందు వ్రాయబడియున్నది. మూలికలు సేవించుటవలన రక్తమునుండి క్రమముగ ఏర్పడవలసిన ఇంద్రియమును ఒక్క సారిగ పీలుకును. అందుచే రక్తము బలహీనమగునుగదా! ఎల్లప్పుడును అదేవిధముగ ఇంద్రియము పుట్టదుగదా! దీని వలన లాభమేమి? కావున బలముకొఱకుగాని, ఇంద్రియపుష్టి కొఱకుగాని, రక్తము బాగుచేయుటకొఱకుగాని ఔషధముల వాడగూడదు. జీర్ణకోశమును బాగుపరచినయెడల సర్వశక్తులును గల్గును. సర్వరోగములకు మూలకారణమైన అజీర్తిని లఘుభోజనముచేతను, లంకణములచేతను, నాడులకుశక్తినిచ్చు ప్రకృతి సాధనములచేతను పోగొట్టుకొని స్వభావసిద్ధమైన ప్రకృతి భోజనమునకు మరలవలెను. అప్పుడే అన్నిరోగము లును పోయి శక్తి కావలసినంత గలుగును. బలమైన యాహారము జీర్ణశక్తి లేనివానికి నిరుపయోగము. ఆకలిలేనివానికి షడ్రసోపేతమైన భోజనమును, నపుంసకునకు రంభయు

దొరికిన నేమిలాభమో, అట్టిలాభమే పై ఔషధములవలన రోగులకు గల్గును.

## ౨౩ టీకాలవలన గలుగు లాభనష్టములు

మశూచికము, పొంగు, వేపపువ్వు, ఆటలమ్మ, మొదలగు చర్మవ్యాధులును; కలరా, నీళ్లవిరోచనములు, జిగటవిరోచనములు, ప్లేగు, విషజ్వరములు, చలిజ్వరములు, మొదలగు అంటువ్యాధులన్నియు కొన్నిజాతుల సూక్ష్మ క్రిములచే పుట్టి; దోమలవలన వ్యాపించుచున్నవనియు, అట్టి రోగములు వ్యాపించకుండ ముందుగ టీకాలు వేసుకొనిన పక్షమునందు టీకాలచే దేహమునం దెక్కించబడు విషము శరీరమునందున్నంతకాలము ఆక్రిములు శరీరమున కెక్కక చచ్చిపోవుననియు ఈ క్రియలవలన ప్రజలలో చావు తగ్గుననియు వైద్యశాస్త్రజ్ఞుల సలహానను సరించి కోట్లాది రూపాయలు ఖర్చుపెట్టి ఆరోగ్యశాఖ నొకదానిని గల్పించి గొప్ప గొప్ప వైద్యశాస్త్ర నిపుణులను విశేషవేతనముల నిచ్చి యేర్పాటు చేసియున్నారు. మొట్ట మొదట ఈ టీకాలవలన మశూచికము లాగినమాట వాస్తవమేకావచ్చును. క్రమముగ శరీర పాటవము ఈవిషప్రయోగము వలనజెడినందున ఒకసారి టీకాలువేసిన చాలుటలేదు. అందుచే అనేక సార్లు టీకాలువేయుచున్నారు. ఇట్లు జాగ్రత తీసికొనబడుచున్నను ఈఅంటువ్యాధుల వలన మరణముల సంఖ్య హెచ్చుగనే యుండుటచూడ వీనివలన లాభములేనట్లు వివేకముగలవారికెల్ల విశదమే. ఇంగ్లాండు, హాలెండు, ఆస్ట్రేలియా, మొదలగు చాలదేశము

లందు టీకాల వలన గలుగు నష్టములను బరిశోధించి నిర్బంధ ముగ టీకాలువేయు పద్ధతిని మానుకొన్నట్లు తెలియుచున్నదిం బ్రిటను దేశమునందు గూడ నిర్బంధము, పూర్వమువలె నున్నట్లులేదు. మనదేశమునందు మాత్రము ఒక సారియే గాకుండ పెక్కుసార్లు బలవంతముగ టీకాలు వేయుచున్నారు. పసిపిల్లలకు టీకాలువేయుటవలన బలహీనులైన పిల్లలు కొందరు ఈ విషమును ఎదుర్కొనుశరీరపటుత్వము లేనందున టీకాలువేసిన దాదిగా పెక్కు వ్యాధులకు గురియై తుదకు చచ్చుటయో లేక బ్రతికినను అంగహీనము గల్గుటయో లేక క్షయమొదలగు కాలికవ్యాధుల పాలగుటయో తటస్థించుచున్నది. టీకాలవలననష్టములున్నవనిగొప్పగొప్ప వైద్యనిపుణులగు పాశ్చాత్యులు ప్రకటించియున్నారు. వారిపలుకుబడినెల్ల నుపయోగించి ఆ యా దేశములందు నిర్బంధమును మాన్ప గల్గిరి. మన దేశమునందట్టి ఆందోళనము చేయుటకు తగుబుద్ధిమంతులు బయలుదేరలేదు. ప్రజలయొక్క దృష్టియంతయు రాజకీయములందును,మతసంస్కరణములందును కేంద్రీకరింపబడి యున్నది. ఆరోగ్యశాఖాధికారులు తమవిధానమువలన దేశారిష్టముకలుగుచున్నట్లు గ్రహించిరో లేదో తెలియదు.ఆందోళనవలనగాని వారికి పరిశోధన చేయవలెనను ఊహపుట్టదు. ఒకవేళ బుద్ధిమంతులగు వైద్యశాస్త్రజ్ఞులకు గ్రహింపు గలిగినను తమ ఖ్యాతికి భంగము గలుగుననియు, టీకాలు వేయు రసముకొఱకు ఉపయోగించిన డబ్బంతయు వృధయగుననియు, ఈ శాఖయందు విశేషవేతనము పొంది జీవించు పెక్కుమందికి జీవనోపాధి యుండదనియు ఊహించి ఆ సంగ

తిని వారు దలపెట్టరు. ప్రకృతి వైద్యశాస్త్రజ్ఞులీ మధ్య ఆందోళమును మొదలు పెట్టిన పరిపాలకులకు వీరిమాటలు వినబడుటలేదు. బ్రతికియున్న వానిని చచ్చినట్లును, చచ్చిన వానిని బ్రతికియున్నట్లును సర్టిఫికెట్టు నిచ్చినను వారికళ్లతో జూచుచుండినను ఉద్యోగస్థులీ సర్టిఫికెట్టును నమ్మవలెనే గాని తమ నేత్రములగూడ నమ్మి పనిచేయుటకు వీలులేని యీ కాలమునందు ఆంగ్లవైద్య నిపుణులవద్దనుండి టీకాల వలన నష్టమేగాని లాభములేదను వార్త వచ్చువఱకును దేశమునకీ దుస్థితి తప్పదు. స్వలాభమునే గోరునట్టి యీ ఆంగ్లవైద్యు లెప్పుడును ఇట్టి సంగతిని బయలుపర్చరు. ప్రజలే యిందలి సత్యాసత్యముల గ్రహించి తమకు గలుగు చున్న విపత్తునుండి తప్పించుకొనుటకు గాను పరిపాలకుల దృష్టిని ద్రిప్పి టీకాలవలన గలుగు నష్టమును తెలుసుకొను టకు దగునేర్పాట్లు చేయువఱకును ఆందోళనము చేయవలసి యున్నది. అందుకుగాను టీకాలన నేమి? శరీరమందు ప్రవేశ పెట్టబడు ఈ విషమెట్లు సంపాదింపబడు చున్నది? ఇది చేయు పనియేమి? దీనివలన నష్టమెట్లు గలుగుచున్నది? యను ప్రశ్నలకు జవాబులు ప్రజలకు బోధపడవలెను.

పూర్వకాలమునందు మశూచికము, పొంగు, కలరా మొద లగు వ్యాధులన్నియు అమ్మవారి కోపమువలన గలుగు ననియు, అందుకొఱకు అమ్మవారికి సేవలు చేయుట వల నను మొక్కుబడుల వలనను అవి తగ్గుననియు మూఢ నమ్మక మొకటి వ్యాపింపజేసిరి. ఇందొక సత్యము గలదు. మశూచకజ్వరము తగిలిన దాది ఔషధములు వాడ కూడ

దనియు, వాడిన అమ్మవారి కాగ్రహము వచ్చుననియు మందులు వాడుటలేదు. కాని బొత్తిగా మూఢులగు జనులు జ్వరము తగిలినదాది అమ్మవారిని శాంతింపజేయుదు మను నూహాతో రోగికి బలవంతముగా నాహారమిచ్చుట వలనను, పొక్కులు కనబడి కొంచెము తెలివిగలిగినదాది రోగి కోరిన సర్వపదార్థములు పెట్టుటవలనను రోగము ప్రకోపించి శరీర మునకు గల శక్తి యంతయు, తినిన పదార్థముల జీర్ణము చేయుటయందు వినియోగపడుట వలన పాటు సరిగా తేలక రోగి మృత్యువాత బడుటయో లేక ఏదైనను అంగహీనత గలుగుటయో జరిగెడిది. కొంచెము తెలివితేటలు గలవారు మందులు వేయక లంకణముల గట్టియు రోగి కోరినపుడు మితమగు నాహారము నిచ్చియు శరీరశక్తి వృద్ధియగునట్లు చేయుటవలన సులభముగ రోగివిముక్తుడై జీవించుటయే గాక దేహమందలి రోగపదార్థమంతయు వెలువరింపబడి పూర్వపు రోగములన్నియు దీనితో పోయి పరిపూర్ణా రోగ్యము గలుగుచుండెడిది. రోగము నెదుర్కొనుటకు దేహ బలము గావలెననియు అందుకొఱకు ఆహారమివ్వక తప్పదను సిద్ధాంతము ఆంగ్లవైద్య సాంప్రదాయమే. ఆయుర్వేదము నందు జ్వరములకు లంకణమే విధించబడియున్నది. పాశ్చాత్య సంబంధము మనకు గలిగిన పిమ్మటనే మశూచికము వలనను విషూచివలనను జననష్టము ఎక్కువగుట తటస్థించినది. అందు మీద టీకాలపద్ధతి వలన మశూచికము నాపుట మొదలిడిరి. టీకాలు వేయుటకు ఒకవిధమైన చీమును శరీరమందు ప్రవేశ పెట్టెదరు. పూర్వకాలమునందీ చీము మశూచికము వచ్చిన

రోగియొక్క మశూచికపు పొక్కులనుండి గ్రహించి దానిని ప్రతి వానియొక్క దండచేతులయందును ఎక్కించు చుండుటయు ఆచీము పొక్కి పొక్కులు బయలుదేరి చీము పట్టునపుడు తిరిగి ఆ చీమును తీసికొని జాగ్రతపెట్టి మరియొకరికి తిరిగి ఎక్కించు చుండుటయు చేయుచుండెడివారట.

ఇటీవల ఈ పద్ధతి మార్చి ఆవుపెయ్యల పొదుగునందు టీకాలు వేయుచుండిరి. ఆ టీకాలవలన శరీరమంతయు పొక్కి సలసలలాడి బాధపడును. పిమ్మట శరీరమంతయు పొక్కులుగలిగి పోటు, దురద పుట్టును. అప్పుడు ఆ పెయ్య దూడను కదలకుండునట్లును మెడ కదల్పకుండ నాకు కొనుటకైన వీలులేకుండ కర్రలమధ్య బెట్టి నిరోధించెదరు. అటు పిమ్మట దాని పొక్కులలోని రసినంతయు గొట్టములలోనికెక్కించి దానిని మనుష్యుల శరీరమందు టీకాలవలన ఎక్కించెదరు. ఇట్టి ఘోరకృత్యమును వినినంత మాత్రము చేతనే కన్నీరురాని పాషాణహృదయు లుందురా? ఇంత ఘోరముగా సంపాదించిన యీ విషరసము వలన గలుగు ఫలితములును ఇంతకంటె ఘోరములుగనే పరిణమించు చున్నవి. మన దేశమునందు పూర్వకాలమునందు టీకాలు వ్యాపింపనపుడును, టీకాలు వేయుట పూర్తిగ వ్యాపించిన యీ కాలమునందును గలుగు కాలికవ్యాధులు-అందు ముఖ్యముగా కుష్ఠు, క్షయ, ఉబ్బసము, బోదకాలు, బుడ్డలు, నేత్రరోగములు మున్నగునవి- గల జనుల సంఖ్యల దెలుసుకొనిన యెడల టీకాల వలన దేశమునకు గలిగిన కీడు తెలియగలదు. పూర్వకాలము నందు అక్కడక్కడ కాలికరోగులు కనిపించు

చుండెడివారు. ఇప్పుడెక్కడ జూచినను ఇట్టివ్యాధి గలవారే కనిపించుచున్నారు. దాని కారణమును గ్రహించుట మిక్కిలి కష్టము కాదు. మనము సహజాహారమును విడచి రుచి గల్పించుకొని కృత్రిమాహారములను తిన మొదలిడినప్పటి నుండియు జీర్ణకోశమునకు వాని నన్నిటిని జీర్ణము చేయగల శక్తిలేక కొంత యాహారమును జీర్ణము కాకుండగనే త్రోసి వేయును. ఈ పదార్థము రోగపదార్థమై రక్తమునందు సంచరించి శక్తిలేని అవయవములందు చేరి వాటిని స్వస్థానమునుండి గెంటియు నొక్కివేసియు వాటిపని నవి సరిగా చేయలేకుండు నట్లు చేయును. వానితో సంబంధించిన కండరములును, నరములును బిగుసుకొనిపోయి తమపని నవి సరిగా చేయలేకుండును. ఇట్లుండ నీ రోగపదార్థమును నెట్టివేయుటకు శరీర మెల్లపుడును ప్రయత్నించు చుండుటచే నీ రోగపదార్థమందు మండమేర్పడి పొంగు పుట్టి అనేక రసాయనికమార్పులు గలుగును. అందువలన పుట్టువేడియే జ్వరమనబడును. ఈ జ్వరమును మాత్రలచే నణచుటవలన రోగపదార్థము గట్టిపడును. ఇట్టి స్థితి చిరకాలముండదు. శరీర మెల్లప్పుడును ఈ పదార్థమును గెంటివేయుటకు జూచుచుండును. గాలి యందలి మార్పుల వలన శరీరము దార్ఢ్యముగలదై యీ పదార్థము నందు మండము కల్పించి త్రోసివేయుటకు గట్టి ప్రయత్నము చేయును. అప్పుడే విశేషమైన జ్వరము గలిగి చర్మము యొక్క అడుగున జేరియున్న రోగపదార్థ మంతయు పొక్కుల రూపమున చర్మమును బ్రద్దలు చేసుకొని పైకి వచ్చును. ఆ పొక్కులలోనికి దేహమందలి యన్యపదార్థమెల్ల

రక్తవాహినుల వలన గొనిరాబడి పొక్కులు పెరిగి పక్వము నకు వచ్చి చివికి రసిరూపమున అన్యపదార్థ విమోచనము కాగా శరీరము సంపూర్ణమైన శక్తి గలిగి పూర్ణారోగ్య వంతులగుదురు. జీర్ణకోశము నందే విశేషమైన యన్య పదార్థము చేరియున్నచో నది జీర్ణకోశముయొక్క ఊర్ధ్వఅధో ముఖములగుండ విడివడి పోజూచును. దానినే విషూచి, గ్రహణి, నీళ్ళ విరేచనములు అందురు. ఈరోగముల వలన అనేకసంవత్సరములనుండి చేరిన రోగపదార్థము కొద్ది రోజులలో నెట్టివేయబడుటచే శరీరదార్ఢ్యము లేనివారు ఆగలేక మరణింతురు. గాని ప్రకృతి వైద్య సాహాయ్యమున చన్నీటితోను, మట్టిపట్టీలతోను సూర్యకిరణ శక్తివల్లను నరము లకు తగు శక్తిని గలుగజేసిన పక్షమున నిరపాయముగ నీదుష్ట పదార్థమును త్రోసిపుచ్చి తిరిగి రోగి పరిపూర్ణ ఆరోగ్యవంతుడు గాగలడు. అంతేగాక కూనే మహాశయుని ముఖవైఖరివిద్యచే నీరోగములు ఇంకను ఒక సంవత్సరమునకు రాగలవని మనము తెలుసు కొనవచ్చును. రాకముందే ప్రకృతిచికిత్స నారంభించిన యెడల నీ రోగము లక్కరలేకయే క్రమక్రమముగ రోగ పదార్థమును గెంటివేసి ఆరోగ్యము నిచ్చును. అట్లుగాక టీకాలువేసి యీ యన్యపదార్థము పొంగి పైకిపోకుండ అణచి పెట్టియును, అట్టి యన్యపదార్థమును గెంటివేయుటకు ప్రయ త్నించగల శక్తిని అవయవములకు గలుగకుండ చంపుటవల్లను ఈ యన్యపదార్థము దేహమందు నిలచి క్రిమక్రిమముగ అన్నిఅవయవముల యొక్కయు, నరముల యొక్కయు శక్తిని జంపి చర్మముయొక్క శక్తిని కూడ నాశనము చేసి

పక్షవాతము, క్షయ, కుష్ఠు మొదలగు పెక్కు రోగము లకు మనుష్యులను గురిచేయు చున్నది. టీకాలు లేని కాలమునందు ఈ కాలికరోగములకు కారణము లేదు. గాని తరుణరోగములు గలిగి ముందు జాగ్రత్తపడని మూర్ఖులను మృత్యుసదనమున కనుపుచుండెడివి. బ్రతికియుండి ప్రజలందరిచేతను, స్వజనుల చేతను గర్హింపబడుచు తమ జీవితము కొఱకితరులపై ఆధారపడి. కుటుంబమునందలి ద్రవ్యమెల్ల వైద్యులపాలు గావించి తమ కుటుంబములను దరిద్రముగ జేసి చావునకు మొగమువాచి బ్రతికియుండుటమేలా? లేక అట్టి తరుణవ్యాధులచే చచ్చుటమేలా? ఇట్టి రోగులుబ్రతికియున్నంత కాలమును దమ హీనస్థితినైనను గుర్తింపలేక పిల్లలను గనుచుండుటచే వారి సంతానముకూడ బీజమందెట్టి రోగాంకురములుగలవో ఆయా రోగములకెల్ల గురియగుచున్నారు. టీకాలవలనఆపబడిన రోగపదార్థము నేత్రములకును శ్రోత్రములకును వ్యాపించి వానిని పాడుచేయుటచే నేత్రాది రోగము లధికములైనవి. ఇట్లే మరికొంతకాలము టీకాలు వేయబడిన పక్షమునందు క్షయాదిరోగములు ప్రకోపించి హిందూదేశము నెల్ల తమ పొట్టను బెట్టుకొనును. శరీరమందు నోటిద్వారా పోయబడిన మందులు జీర్ణకోశమునందలి రసములచే పటుత్వహీనములుగ జేయబడును. అందు చేవాని విషములు విరిగిపోయి నిర్వీర్యములగును. రక్తములోనికి ఎక్కించబడిన యీ విష మట్లుగాక శరీరమును పూర్తిగ జెరుపుచున్నది. త్రాచుపాము విషము కడుపులోనికి మ్రింగి నప్పటికంటె దాని కాటుచే రక్తములోని కెక్కించ బడినపుడు

ప్రాణహాని యగుచున్నది. అట్లే టీకాలవలనగూడ హాని తట స్థించుచున్నది. బుద్ధిలేని దుష్టజంతువులైన పాము, తేలువంటి విషజంతువులు విష మెక్కించు చున్నందువలనగదా. వాని కంత భయపడుచున్నాము. జ్ఞానముగలిగి రాబోవు బాధల గూర్చి ఘనవైద్యులు మొఱబెట్టుచున్నను, ఇతర దేశములు మానుకొనుచున్నను "తామ పట్టిన కుందేలుకు మూడేకాళ్ళ" న్నట్టు తమ పట్టుదలను విడువకుండ టీకాలవేయుపద్ధతిని మానివేయని ఆరోగ్యశాఖవారి నేమనవలయునో గ్రహింప వలెనేగాని చెప్పుటకు జాలదు. ఇంతటినుంచి రాజకీయాందో ళనముతో బాటు టీకాలు మానుటకు గూడ ఆందోళనము జరిపి టీకాలు మాన్పించుటకు శాసనసభ్యుల ప్రోత్సహించ వలెనని ప్రజల గోరుచున్నాను. ప్రకృతి చికిత్సలచే నిరపాయ ముగ అన్యపదార్థములను నెట్టివేసి యీ రోగములురాకుండ నాపుకొనవచ్చును. దేహమందు అన్యపదార్థమే లేని యెడల ఈ అంటు వ్యాధులు వ్యాపింపవు. అంటు వ్యాధులయందు వ్యాపించు క్రిమి, రోగపదార్థము మిక్కుటముగగల రోగి యందే వృద్ధి పొందునుగాని రోగపదార్థము లేనివారియందు చచ్చిపోవును. కాలుచున్న నిప్పు తుక్కులోపడినపుడే అంటు కొనునుగాని తుక్కు లేనిచోట దానంతటఅదే నశించి పోవును.అందుచే రోగపదార్థములేకుండ మన శరీరమునుస్వచ్ఛ ముగ నుంచుకొనవలెనేగాని శరీరమును చెరుపుకొని క్రిమిని చంపప్రయత్నించు వైద్యసాధనములు వృథయగుచున్నవి.

అంటువ్యాధుల కెల్ల క్రిమియే కారణమని నవీన శాస్త్రజ్ఞులు గనిపెట్టియున్నారు. రోగిశరీరమందలి క్రిమిని వారు చూచు

చుండుట యథార్థమే! అయినను 'చెట్టుముందా విత్తుముందా' యన్నట్లు రోగమువలన క్రిమియా, క్రిమివలన రోగమా, యని విచారింపవలసియున్నది. ప్రపంచమునందు కుళ్ళుపదార్థముల యందెల్లను క్రిమిపుట్టి ఆ పదార్థము నశించినతోడనే అదియు నశించుచుండుట చూచుచున్నాముగదా! కుళ్లుపదార్థముల దిని జీవజంతువులకు హానిగల్గు దుష్టవాయువులు పుట్టకుండ జేయు టకుగదా యీ క్రిమిని దయామయుడైన పరమాత్ముడు కల్పించినది. ఇట్లే మన శరీరమందలి రోగపదార్థము నశింపు చేయుటకొఱకే యీ క్రిమి పుట్టుచున్నదనియు, ఆక్రిమిని మందులవలన జంపి రోగపదార్థమును, నిల్పినపుడు తిరిగి క్రిమి పుట్టకమానదనియు, రోగపదార్థమును గెంటివేయగల శక్తి అవయవములకు గలుగజేసి ఆ రోగపదార్థమును, నెట్టివేసిన యెడల దానితోపాటు క్రిమిగూడ నశించుననియు గ్రహింపవ తగ్గది. బెల్లమునకు చీమలుపట్టినపుడు ఎన్నిసార్లు చీమలను నలిపి చంపినను లాభముగలదా ? చీమలు నశించవలెనన్న బెల్లమునే దీసి వేయవలెను. తుక్కుగల గదులయందు క్రిము లుండిన గదులను శుభ్రపరచవలెనేగాని క్రిమిని జంపజూచుట పొరబాటుపనికాదా ? మన శరీరమును స్వాభావికాహారముచే రోగ పదార్థరహితముగ జేసికొనవలెనేగాని టీకాలవలన క్రిమిని జంపుటవలనను, ఈగలను, దోమలను, ఎలుకలను జంపజూచుట వృథాప్రయాసమే యగును. కుళ్ళులేకుండ జేయవలెనేగాని దోమలపై కత్తిగట్టుట ఆలోచనలేని పని. దోమలు పోవలెనని కుళ్ళునీళ్ళగుంటలు, బందలు పూడ్చి వేయవలెను. అప్పుడే మన ప్రయత్నము సఫలమగును.

దోమలను జంపుటకుచేయు వ్యయమంతయు "బుగ్గిలోపోసిన పన్నీ" రగును. రోడ్ల వెంబడి మురుకు బిగపట్టుకొనకుండ పోజా లనంత మురికిసీటి వెల్లువలుగల పట్టణములం దేపరియత్నము లచే దోమలుపోవునో యూహింపుడు. శరీరములు స్వచ్ఛము గానుండినవారిని క్రిమి తాకలేదు. దోమ లేమియుచేయ జాలవు. గాన ప్రజ లెల్లరు వైద్యులకును, మందులకును భయపడవలసినంత క్రిమికి భయపడనక్కరలేదు. "అమ్మవారు మనలను మ్రింగుటకు మశూచికము, విషూచి మొదలగు రోగములు గల్పించుననినమాటయం" దెంత జ్ఞానమున్నదో సూక్ష్మజీవులు మనలనుజంపుటకే యేర్పడినవను మాట యందును అంతసత్యమే గలదు. భగవంతుడు కృపామయుడు. మనల నన్నివిధముల గాపాడును. మన తప్పిదములచేగాని, పొరపాట్లచేగాని కినిసి మనల దుర్భరరోగముల పాలుచేయు క్రిమికీటకముల బుట్టించడు. మనబుద్ధిహీనతచే విషయలంపటు లమై జిహ్వాపేక్షలకు దాసులమై ఆరోగ్యముల జెరుపుకొని మనశరీరములను మరుగుదొడ్లుగా మార్చుకొని కుళ్ళును బెంచుకొన్నపుడు మనయందు దయగలిగి మన బుద్ధిహీనతను గ్రహించి, క్షమించి తిరిగిమనలను ఆరోగ్యవంతులుగజేయుటకే యీ క్రిమిని పుట్టించియున్నాడు. అట్టి తరుణములందు నీటి వైద్యమువంటి ప్రకృతి వైద్యములచే నాకుళ్ళును తోసి వేయగా ఆ క్రిమికూడ ఆకుళ్లుతోనే పోయి కుళ్ళు నశించిన తోడనే నశించునుగాన క్రిమిమీద దండెత్తనవసరములేదు.

## ౨౪ దుస్తులు

సృష్టియందు తమంతటతాము చలిగాలి నుండియు వేడిగాలి నుండియు కాపాడుకొనుటకు తగినంత జ్ఞానములేని జంతుజాలముల పై చర్మములం దంతటను వెంట్రుకలు గలవు. మిక్కిలి శీతలదేశములం దీరోమములు పొడుగుగాను ఒత్తుగాను ఉండి వేసవికాలమునందు రాలిపోవును. మనుష్య శరీరమం దట్టి వెంట్రుకలు లేవు. మనుష్యుడు కాలానుసరణముగ గాలి తేడాలవలన గలుగుబాధలనుండి కాపాడుకొనుటకు దగినంత శక్తిగలవాడగుటచే భగవంతు డట్టి జాగ్రతను విడిచిపెట్టి యున్నాడు. మనముకూడ దుస్తులను ధరించక మన శరీరముల జాగ్రతను ప్రకృతిమాతకు విడచిన యెడల అచిరకాలములోనే అలవాటువలన చలినుండి మనకు బాధ లేకుండపోవును. మన దేశమునందు హిమవత్ పర్వతప్రాంతములందు దిగంబరులై చరించు యోగిపుంగవుల శరీరము లిట్లేర్పడుటచేతనే వారు నిర్విచారముగ తపసు చేసుకొన గలుగుచున్నారు. అందువలననే మనము అతి జాగ్రతపరులముగాక సర్వమును ప్రకృతిమాతకు విడచిన పక్షమున మన కేలోటును గలుగనివ్వదు. మనకు భగవంతునిచే ప్రసాదింపబడిన జ్ఞానము నుపయోగించుకొని సౌకర్యములగలుగ జేసుకొనినకొలది ప్రకృతిమాతయొక్క సంరక్షణనుండి దూరస్థుల మగుచున్నాము. దుస్తులు మనకు మానసంరక్షణ కొఱకును, గాలియొక్క మార్పుల నుండి మన శరీరోష్ణమును గాపాడుటకును, ముండ్లు మొదలగునవి సులభముగ చర్మమును పగులగొట్టకుండుటకును ఏర్పడినవి. ఈ దుస్తులు దేశముయొక్క శీతోష్ణ స్థితిని

బట్టియు వారుచేయు వృత్తులనుబట్టియు వేరువేరువిధములై కట్టుకొనుటయందు గూడ మార్పులను జెందియున్నవి. మిక్కిలి శీతల దేశములందు నివసించు జనులు చర్మములనే ధరించెదరు. శీతల దేశములందలివారు ఉన్నితో నేసిన బట్టలను ధరించెదరు. సమశీతల దేశములందలి వారు ఉన్నిబట్టలను, నార బట్టలను, పట్టుబట్టలను, కొంతవఱకు నూలు బట్టలను గూడ ధరించెదరు. ఉష్ణదేశవాసులు నూలుబట్టలను, నారపట్టు బట్టలను ధరించెదరు. శీతల దేశవాసులు శరీరమం దే భాగము గాని కనపడకుండునట్లు దళసరి గుడ్డను బిగువైన దుస్తులుగా దయారుచేసి కట్టుకొందురు. ఉష్ణ దేశపు వారు పల్చని నూలుబట్టలను వదులుగా కుట్టుకొని కట్టు కొందురు. ఇట్టి యేర్పాట్లు పూర్వ కాలమునందే గలవు. నాగరికత వ్యాపించి మహమ్మదీయులతోను పాశ్చాత్యులతోను సాహచర్యము గలిగినప్పటినుండియు హిందువులు తమ పూర్వాచారముల విడచి మహమ్మదీయుల వలెను, పాశ్చాత్యులవలెను, దమ దుస్తుల మార్చుకొనుచున్నారు. దుస్తులు ధరించుట కేవలము అందముకొఱకే గాదనియు, "పరమతావలంబనము భయావహ" మని వీరు గ్రహించిన యెడలను, తల్లిదండ్రులు పిల్లలకు బోధించు చున్నను ఇట్టిమార్పులు జరిగియుండవు. మనది ఉష్ణదేశమగుటచే విలువగల ఉన్ని బట్టలతో మనకు నిమిత్తము లేకపోవుటయే గాక సరియైన గాలి, చర్మమునకు తగులక అది పాలిపోవును. వదులుగా నుండు దోవతి గట్టుకొనుటచే మర్మస్థానములకు గూడ గాలి తగులుచుండును. ఉద్యోగనిర్బంధము లేనివారు

చొక్కాలను, కోట్లను, టోపీలను ధరింపనవసరములేదు. గాంధి మహాత్మునివలె కటివస్త్రముతోనే కాలక్షేపము చేయవచ్చును. అందువల్ల దుస్తులకొఱకు మనసంపాదనలో గొంత భాగమే ఖర్చుపడి మిగిలినదంతయు శరీరపోషణకనువగు నాహారసంపాదనకొఱ కుపయోగించునుగదా! మన యవసరము లన్నియు పూర్తిగా దృప్తిపరుపబడిన పిమ్మట వృద్ధాప్యదశలో మనంతట మనము స్వేచ్ఛగా బ్రతుకుటకు దగు జాగ్రత పడిన పిమ్మటను మిగిలిన గదా సరదాలకు తావివ్వవలసినది? పెక్కండ్రు తక్కువ సంపాదకులగు పేదజనులు తమ యిరుగుపొరుగువారైన భాగ్యవంతులను జూచి వారివలె నుండవలెనని దుస్తులకొఱ కమితవ్యయము చేసుకొని తమ సంపాదన తమకు జాలదని విచారించెదరు. మనదేశము ఉష్ణదేశ మగుటవలన బట్టకు విశేషవ్యయ మవసరములేదు. ఉన్నిబట్టలు మన కవసరమేలేదు. భాగ్యవంతులు మాత్రము పట్టుబట్టలును నారబట్టలును గట్టుకొనవచ్చును పేదవారికి నూలుబట్టలు చాలును. మనపొలమునందు పండు ప్రత్తినుండి స్వయముగా దారమును తీరికగా నుండు సమయములందు దీసికొని బట్టలు నేయించుకొని కట్టుకొనినయెడల బట్టల ఖర్చు మన సంపాదనలోనుండి తగులబాటు గాదు. ఒకప్పుడు స్త్రీ పురుషు లందరును దమ తీరిక సమయములందు నూలు దీయుచుండిన పక్షమున మనకు కావలసినంత బట్ట రాగా మిగిలిననూలునమ్ముకొని కొంతద్రవ్యము చేర్చుకొనవచ్చును. నూలుదీయుటవలన మనస్సు విషయములకు పోక నిలుచును. అందువల్ల ఆముష్మికముగూడ గలదు. ఖద్దరు గుడ్డలు శీతా

కాలమునందు వెచ్చగానుండును. ఉష్ణకాలమునందు చల్లగా నుండును. నూలుకండలి పురి విడి మెత్తగానుండును. ఖద్దరుబట్టలు ధరించుటవలన పేదలగు మన దేశవాసులకు భుక్తిని గలుగజేయుట యేర్పడుచున్నది. ఖద్దరుబట్టలకు వెల యధికమైనను చాలకాలము మన్నుటవలన సగటున ఖద్దరు బట్ట ధరించువారికే బట్టల విషయములో ఖర్చు తక్కువగును. గాన సర్వవిధముల ఖద్దరుబట్టనే ధరించవలెను. పంట్లాములు, ఇజార్లు, బనియనులు మొదలగు శరీరము నంటిపెట్టుకొను వస్త్రములు మన కనవసరములే గాక, గాలి చొరనివ్వక, శరీరమునకు కళ లేకుండజేయును. మెడపట్టాలు మొదలగు పాశ్చాత్య బంధనములు శిరస్సునకు సరియైన రక్తప్రసారము లేకుండ జేయును. గాన మనకు దగవు. స్త్రీలయందు మూర్ఖురాండ్రు మంచిచెడ్డలు తెలుసుకొను జ్ఞానము తక్కువ యగుటచే రోజున కొకమార్పు గలిగించుకొనుచున్నారు. తమ కుటుంబాదాయమును గుర్తింపక యిరుగుపొరుగు స్థితిమంతులతోబాటు దామకూడ నుండవలెనని యాదాయమునకు మించి వ్యయమునుజేసి దాపుడుచీరల కొఱకును, అనవసరమైన దుస్తులకొఱకును వ్యయపరచి తిండికి లేకుండజేసి అదివరకే తీరిక లేకుండ పనిచేయు మగవానికి మనస్స్థిమితముగూడ లేకుండజేయుచున్నారు. ఇట్టివారు కొంచెము తెలివితెచ్చుకొని ఖద్దరుదీక్షను వహించినపక్షమున సుఖపడగలరు. అవసరమైన బట్టలనే తప్ప నిలవకొఱకుగాని సరదాకొఱకుగాని పేదవారు బట్టలగొనరాదు. హరిజనులు దమ సంపాదనమునందు చాల భాగము త్రాగుడుకును, మిగిలినదానిలో గొప్ప భాగము

బట్టలకును పెట్టుటమాని ఖద్దరును స్వయముగా వడుకుకొని కట్టుకొనినయెడల వారి దుస్థితితప్పి, ద్రవ్యవంతులై తమ బ్రతుకునకు నన్యులపై నాధారముపడ నక్కరలేకుండ గౌరవముకు సంపాదించుకొన గలుగుదురు. విద్యకొఱకును పరిశుభ్రముకొఱకును, ఆరోగ్యముకొఱకును తమ ద్రవ్యమును వినియోగపరచుకొని తమ కాళ్ళపై నిలచుట నేర్చుకొనిన యెడల అస్పృశ్యత తనంతటనే నశించును. తమ నుదల వ్రాతను మానక దుస్థితిలోనుండి చేయూత యిచ్చువారిని గూడ పడగొట్టుమ అస్పృశ్యతమాన్పవలసినదని అరచిన లాభముండదు. ఒక తరమునందు కటివస్త్రముతోను గంజికూడుతోను జీవించి ద్రవ్యముచేర్చి బిడ్డలకు విద్యాబుద్ధులు చెప్పించిన, మరియొక తరమునను అస్పృశ్యత తనంతనే నశించును. స్వయం సాహాయ్యమువలననే సర్వకార్యములును తీర్పబడును. గాన పాశ్చాత్యులయొక్క దుస్తులతో మన కవసరములేదు. నూలు బట్టలను ధోవతులను, చీరలనే ధరింపవలెను. ఖద్దరుబట్టనే ధరించవలెను. స్వయముగ నూలు వడకుకొనవలెను. సంపాదనలోని పైకము దుస్తులకొఱకు వ్యయపడనీయరాదు. సాధ్యమైనంత తక్కువబట్టనేకట్టుకొని మన శరీరమునకు గాలియు నెండయు దగులనీయవలెను. శరీరము నితరులు చూచినసిగ్గుపడనవసరము లేదు. సాధ్యమైనంతమట్టుకు బట్టలవిషయమైన ఖర్చు తగ్గించుటయే లాభము.

## ౨౫ తృప్తి

సంతోషమువలన మనకు లేనిశక్తి గలుగును. ఆరోగ్యము పెంపొందును. సర్వకార్యములును నెరవేరును. అట్టి సంతోష

మునకు తృప్తియే బీజము. సర్వవిషయములందును మనకు కున్నదానితో తృప్తినొంది తనకంటె హీనులను జూచి వారి కంటె తాను మంచిస్థితియందున్నందుకు సంతోషించుచు, అట్టి స్థితి తమకు గలుగజేసిన భగవంతునియందు కృతజ్ఞులై యుండవలెనే గాని తమకన్న నెక్కువ స్థితియందున్న వారిని జూచి వారికంటె దమస్థితి హైన్యముగా నున్నదని విచారింప రాదు. తృప్తిగలిగి యుండవలెనని సోమరిపోతుగ నుండి తిండికిలేకుండ మాడుట మంచిదికాదు. సర్వవిధముల ప్రయత్నముచేసి మనకు దొరకినదానితో దృప్తి నొందవలెను. దానినే నిష్కామకర్మ యనవచ్చును. తమకున్న ఐశ్వర్యమునకు దృప్తిలేక తనకంటె నధికైశ్వర్యవంతుని జూచి తమ కట్టిభాగ్య మబ్బకపోయెనని మనోవ్యాధి గలవారు సర్వదా విచారించుచుందురు. "మనోవ్యాధికి మందులేదు" గాన ఆరోగ్యము నశించును. ఆరోగ్యము నభివృద్ధి నందించుకొనుటకు నిత్యసంతోషము గావలెను. పూర్వకాలమునందు మన దేశమున సర్వజాతులవారును తమ తమ తాత తండ్రుల వృత్తులనే జేసికొనుచు అందువలన లభించు ద్రవ్యముతో గడుపుకొనుచు వారి వారికి నియమింపబడిన కులధర్మముల ననుసరించి బ్రతుకుచు సర్వదా సంతుష్టాంతరంగులై యుండెడివారు. పూర్వ హిందూరాజుల కాలపు చరిత్రలయందెల్ల ప్రజలు జార, చోర బాధలు లేక, వ్యాధి దరిద్రములు లేక తమ కులచారములు విడువక సుఖులై యున్నట్లు చదువుచున్నాము. ప్రస్తుతమందు కులధర్మము లడుగంటి తండ్రి తాతల వృత్తుల విడచి యన్యవృత్తుల కలవడి తమకున్న

దానితో దృప్తిలేక యెల్లప్పుడును మార్పునే గోరుచు అది లభించకపోవుటచే సర్వదా అసంతృప్తినే గలిగి యుండుట వలన సుఖమనునది లేక ఒక కులము లోనివారు మరొక కుల మందు గలువవలయు ననియు, తమ మతధర్మముల వీడి అన్య మతధర్మముల నవలంబింపవలె ననియు స్త్రీలు తమ ధర్మ ముల వీడి పురుషధర్మముల నవలంబింపవలె ననియు, పురు షులు స్త్రీధర్మముల నవలంబింపవలె ననియు తొందరపాటు నొందుచుండుటచే సంతోషమనునది లేక ఆరోగ్యము చెడి బాధనొందుచున్నారు. గాన తృప్తిగలిగి తనస్థితికి సంతోషించు చుండవలెను.

## ౨౬ ఇంద్రియముల విషయమున జాగ్రత్త

చర్మము, కండ్లు, నాలుక, ముక్కు, చెవులు అనునవి జ్ఞానేం ద్రియములు. మనకు పైకి గనుపడునవి ఇంద్రియములుగావు. వీనిననుసరించి సూక్ష్మేంద్రియము లున్నవి. వానివలననే మనము విషయముల గ్రహించి వానిజ్ఞానమును బడయుచు న్నాము. మృతదేహమునకీ యింద్రియములున్నను విషయము లను గ్రహించుశక్తి లేదుగావున అంతరింద్రియ సంబంధము వలననే ఇవి ప్రకాశింపజేయబడుచున్నవి. ఐనను ఈ పైకికన బడెడు ఇంద్రియములు జాగ్రతగా నున్నపుడే అంతరింద్రియ ములద్వారామనస్సు వీనిని గ్రహించుచున్నదిగాన వీనిజాగ్ర తగా సంరక్షింపని యెడల అంతరింద్రియములకూడ చెడును. ఏ యింద్రియము చెడునో ఆసంబంధమైన జ్ఞానముగలుగు సాధనము లేక పోవును. నేత్రేంద్రియము లేనివానికి ప్రపంచ

మొదలి వస్తువులను జూచుటకు ప్రాప్తిలేదు ఇట్లే యితరేంద్రియములును. ఆరోగ్యవంతుడగువాడు సర్వేంద్రియములును వాని వానిపని నవి జాగ్రత్తగా జేయుచుండ సుఖించుచుండును. అట్లుగాకపయింద్రియముద్వారా జ్ఞానము గ్రహింపవీలు లేకున్నను అట్టివాని నారోగ్యవంతుడనగూడదు. "సర్వవ్యాధులకు మూలకారణ మజీర్తి"యని చెప్పబడినదిగదా! అట్టి యజీర్తికి కారణములేకుండ జేసుకొనుటచే ఇంద్రియములేవియు జెడక వానిపని నవి చేయగలిగియుండును. మన యజాగ్రతవల్లను మనజాగ్రతకు మించిన దైవఘటనలవల్లను ఒక్కొకప్పుడు మనకు దెలియకుండ ఆగంతుకములుగ దటస్థించు దెబ్బలవల్లను, అగ్ని, జలము మొదలగువానివలన గలుగు పమాదములవలనను ఇంద్రియములు చెడగలవు. అట్టివానినిగూడ ప్రకృతిమాతయే కుదిర్చి తిరిగి యెప్పటిస్థితికి దేగలదు. మందులతో నిమిత్తమేమియులేదు. శరీరమునకు, తనకు వచ్చు సర్వబాధల నివారించుకొను శక్తిగలదు. దానియందు మనకు నమ్మకముండి మనయడ్డంకి లేకుండ నుంచుటయేగాక దానికి మనముగూడ దోడ్పడిన పక్షమున సర్వరోగములును దమంతటవియే శాంతించును.

నాగరికతా విశేషముచే ప్రకృతిమాత యేర్పరచిన విధులను మీరుటవలన ఈ యింద్రియములు దమశక్తిని అచిరకాలమునందే గోల్పోవుచున్నవి.

కన్ను-పగలుసర్వవస్తువులను జూచుటకును రాత్రులందుచీకటియందు కొంతవఱకు మాత్రమే చూడగల్గుటకును ఏర్పడి

యుండగా రాత్రులందు దీపము లేర్పరుచుకొని దానికి కొంతభారము గలుగజేయుట వలనను, మితిమీరి తిని శరీర మందు అన్యపదార్థము ప్రవేశించినపుడు ఆ యన్యపదార్థము కంటివద్ద జేరి కంటివద్దకు వచ్చు నరముల జెరుపుటచేతను, దృష్టిమాంద్యము, చత్వారము, హ్రస్వదృష్టి, కంటిరోగ ములు గలుగుచున్నవి. అంతకంతకు సామాన్యదీపముల వెలు తురు చాలక, లాంపులు, లాంతరులు కొంతకాలమును, పిమ్మట అంతకంటె వెలుతురుగల పెట్రోమాక్సు లాంతరుల వెలుగుచు, విద్యుద్దీపముల వెలుతురును వచ్చినవి. అందువలన దీపము లేకుండనే చూడగల శక్తి యంతరించినది. క్రమముగ విద్యుద్దీపపు వెలుతురున కలవడిన కన్ను తక్కువ వెలుతురు నందు జూడ జాలదు. ఇట్టి వెలుతురు అస్వాభావికమైనందున నేత్రేంద్రియముచెడి చిన్నతనమునందే కళ్లజోళ్లు కావలసివచ్చు చున్నవి. సాధ్యమైనంత వఱకు రాత్రులందు చూచుట మాని అన్ని పనులును పగలే చేసుకొనుచు రాత్రులందు నిద్రించు చుండినయెడల ఇట్టి నేత్రరోగములు రావు. వచ్చినపుడైనను అస్వాభావికముగు వెలుతురునందు సంచరించుట మాని దేహమును అన్యపదార్థమునుండి తప్పించిన యెడల నిట్టి రోగములనుండి విముక్తులగుదురు. సరదా కొఱకుగాని, చల్ల దనము కొఱకుగాని కంటియందెట్టి కాటుకలను, మందు సరకులను, అరఖులను వేసుకొనరాదు. వీటి అన్నిటివలన గలుగు నష్టములు లేకుండ సుగుణము నిచ్చునవి చల్లని మంచినీరును, సూర్యకిరణములును. వానిని వాడువిధము చికిత్సాభాగమునందు వ్రాయబడును. స్వతస్సిద్ధముగ నేత్రము

వద్ద అన్యపదార్థము చేరినపుడు కళ్లకలక వంటి రోగముపుట్టి పుసి, నీరుకూడమున దానిని గెంటివేసి కన్నును బాగు చేయును. నలుసుపడినపుడు కావలసినంత నీరువచ్చి యానలుసును కొలికివద్దకు జేర్చును. రెప్ప కంటియం దేపదార్థమును పైనుండి పడకుండ గాపాడును. ఇట్టిజాగ్రత స్వాభావికముగనే యేర్పడి యున్నది.

ముక్కు - శ్వాసలనుబీల్చుటయు, మనము తినుపదార్థములు అర్హములా? కావా? యనుదానిని నిర్ణయించుట కేర్పడినది. దీనిశక్తిని ముక్కుపొడుము వంటివి పీల్చుటచేతను, సువాసన ద్రవ్యములను అడ్డుపెట్టి దుర్వాసనను గ్రహింప జేయుట వలనను, తప్పనిసరిగ దుర్వాసనస్థలములం దునికి చేతను మనము పాడుచేయుచున్నాము. మనము పీల్చెడి గాలి యందు గల నలుసులను, మిక్కిలి శీతవాయువును ఊపిరితిత్తులలోనికి పోకుండ ఆపుటకిందు వెండ్రుకలేర్పడినవి. నాసికా సంబంధమైన వ్యాధులు గలిగినప్పుడు రొంప పట్టి అక్కడచేరిన రోగ పదార్థమంతయు నశించును. అట్టి ప్రయత్నమును మనము మందులచే నాపరాదు. ముక్కుపొడుము మొదలగునవి నాసికాశక్తిని పోగొట్టి, కళ్లదృష్టిని జెరచి మెదడును పాడు చేయునుగాన వానిని పీల్చకూడదు.

చెవి-ఇది ధ్వనులు వినుట కేర్పడినది. దీని సాహాయ్యమున ఇతరులనోటినుండి వారి యుద్దేశములను గ్రహించుచున్నాము. ఈయింద్రియమునం దన్యపదార్థము చేరినపుడు, పోటు, చీము గలిగి ఆయన్యపదార్థమును తొలగించును. మందులు వాడు

టచే ఆయన్యపదార్థము గట్టిపడి యింద్రియమును పాడు చేయును. చెముడువచ్చును. చెవిని గాపాడుట కొఱకే చెవి యందు గులిమియుండును. దీనివలన గూబయెండక చెమర్చు చుండును. గులిమి ఎక్కువై దానియుపయోగము లేనపు డదియే యెండి క్రిందపడిపోవును. గాన గులిమిని పుల్లలతో పొడిచి తీయకూడదు. చెవియందు పోయుమందులవలన రోగ పదార్థమెండిపోయి చెవిని జెరుచుటచే చెముడుకల్గును. మందు లువాడక అన్యపదార్థవిమోచనము చేసుకొనుటవలన గట్టి బాధ గలుగదు.

నాలుక- ఇది రుచినిగ్రహించి తినదగిన వస్తువునుమాత్రము లోపలకు పోనిచ్చును. నోటిలో వేసుకొని యేవస్తువునైనను నమలునపుడు పళ్లసందున కావస్తువును త్రోయును. సహజ స్థితియందు బహుమృదువుగా నుండును. తినదగని వస్తువును జెప్పగల యింద్రియమైనను దీనికి కూడని వస్తువులరుచిని జూపినపుడు కొంతకాలము మట్టుకు అసహ్యించుకొనును. దానిబోధనలవినక అదేవస్తువును దిననగోలది ఆవస్తువులకు గూడ నవి యలవడును. ఆవిధముననే మనుష్యులు మాంసా హారమునకును, ఉప్పు, కారము, చురుకు బుట్టించు సువాసన ద్రవ్యములను దినుట కలవాటుపడిరి. సహజాహారము దినునపుడు కావలసినంతకంటె అధికముగా దినుట కొప్పుకొనదు. అరుచిని సూచించును. కాని మసా లాలు, కృత్రిమరుచుల కల్పించినపుడది లంచగొండియై దాని పని నదిచేయుట మానును. అజీర్ణము వ్యాపించినపుడు కడుపు నుండివచ్చు వేడిగాలులచే నాలుకబండబారును. నాలుకపై

నొకవిధమైన ఖారమేర్పడి సహజరుచుల దెలిసికొనజాలదు. మనుపటికంటె అధికమైన ఉప్పు, కారము, సువాసన వస్తువులు, తాలింపులు తగిలిన గాని తృప్తిపొందకుండునట్లు చెడిపోవును. అందువల్లనే మనుష్యులిప్పుడు సహజమైన వస్తువుల రుచిని గ్రహించజాలక కృత్రిమరుచుల గోరుచున్నారు సర్వవ్యాధులందును జీర్ణకోశము పనిచేయుటకు వీలు లేని స్థితియేర్పడును. అప్పుడు నాలుకకు రుచి తెలియదు. అన్ని వస్తువులును అరుచిగానే యుండును. ఆ విధముగ ఆహారమక్కరలేదని నాలుక మనకు బోధించును. ఆ బోధనను విని లంకణము చేసితిమా తిరిగి ఆరోగ్యవంతుల మగుదుము. మందులచే రోగము నణచి నాలుకయొక్క శక్తిని పాడుచేసి భుజించితిమా కాలిక రోగముల వాతబడుదుము. అస్వాభావికాహార సేవనమువలననే నాలుకయందు పాచిపట్టును. అజీర్తిలేనప్పుడట్టిపాచి పట్టదు. నాలుకపూత, పుండ్లుపడుట మొదలగు వ్యాధులన్నియు అజీర్తివలన గర్భకుహరమునుండి పైకి వ్యాపించు చెడుఉడుకుచే వచ్చును. వానిని పోగొట్టుటకు, పటికనీరు గాని, యితర వగరుపదార్థములు రాయుటగాని తప్పు. అజీర్తిని పోగొట్టిన యెడల ఆరోగములు తమంత నే శాంతించును. నాలుక మృదువగును.

చర్మము-ఇది ఆరోగ్యస్థితియందు మృదువై స్థితిస్థాపకశక్తిగలిగి రక్తము చిమ్ముచుండెడి రంగుతో నుండును. చర్మవ్యాధులేమియు నుండవు. అలసినపుడును ఉష్ణమువలన చెమట పట్టును. రక్తహీనమై పాలినట్లుండదు. వెంట్రుకలుండవలసిన తావులందు వెంట్రుకలు గలిగియుండును. అనారోగ్యవంతుని

చర్మము గట్టిపడి స్థితిస్థాపకశక్తిని పోగొట్టుకొనును. చెమట పట్టదు. వాలిపోయి వెల వెల లాడుచుండును. మర్మస్థానములు కూడ కొంచె మించు మించుగ దక్కిన శరీరభాగముల వంటి రంగులు గలిగి యుండవలెను. గాని వివర్ణముగ నుండ జనదు. తిమ్మిరి, మొద్దుబారుట యనునవి రోగసూచకములు. గాన అనారోగ్యహేతువులు గనబడిన తత్‌క్షణముననే సహజాహార స్వీకారము, ప్రకృత్యనుసరణాదులచే తిరిగి సహజరూపమునకు దేవలెను.

శరీరమునం దేభాగముననగాని, యే యవయవమునందు గాని కొంచెమైనను నొప్పులును, బాధలును, పోటులు గలుగ రాదు. కీళ్ళు సర్వదా మణుగుచు, చాపబడుచుండవలయును. దానికి వ్యతిరేకము సంభవించిన తత్క్షణమున ప్రకృతి చికిత్సను బొందవలెను గాని ఉపేక్ష చేయరాదు. తలయందుగలుగు బాధలు అజీర్ణిని సూచించును గాన ఆ భాగమునకు పట్టు కట్లు వేయుటవలన కారణనివృత్తికాదు. లంకణము, ప్రకృతి భోజనము మొదలగువానిచే కారణమును నిర్మూలించవలెను. పాదములు నడచుటకొఱకు కేర్పడినవి. దానిని నడచునపుడు ముళ్లు రాళ్లు గుచ్చుకొనవచ్చును. విషజంతువులు కరువ వచ్చును. వేడిచే పొక్కవచ్చును. అంతేగాక అరకాలియందు గలుగు ఉష్ణాధిక్యమువలన శిరస్సునకును నేత్రములకును బాధ గలుగునందురు గాన పాదరక్షలచే వానిని సర్వదా కాపాడ వలయును. పాదరక్షలు బూట్సువంటివై కాలిని నొక్కిపట్టి యెదుగుటకును, రక్తప్రసారమునకును, చక్కని గాలి తగులుటకును అడ్డు రాకూడదు. గాన హిందూపద్ధతి ననుసరించి.

జావ, రొట్టెలును ఫలములతో పుచ్చుకొనవలెను. విరోచన బద్ధముండిన సముద్రపు ఇసుకను సేవింపవలెను. ఈచికిత్స రెండు లేక మూడు సంవత్సరములు విడువక చేయుచు పిమ్మట సమ్మిళించిన తరువాత స్నానములు మానినను ఆజన్మాంతమును ఉప్పుకారములు తైలముతోగాని, నేతితోగాని తయారైన పిండివంటలు వదలి ప్రకృతి యాహారమునే సేవింపవలెను. ఏలనన శరీరము పూర్తిగ చెడి నరములన్నియు బలము చెడి యుండునుగాన ఏమాత్రము అజీర్తి ప్రవేశించినను తిరిగి అన్యపదార్థము పూర్వపుచోట్ల చేరవచ్చును. ఆకారణముచే ఇతరులతోబాటు విందు లారగించవలెనను కోరిక వదలి ప్రకృతిమాతను సేవింపుచు సుఖజీవనము చేయుటయే వీరికనుకూలమగు మార్గము.

కాలిక స్థితిలోనికి మారినపుడు రోజునకు ఒక లింగస్నానమును ఒక కటిస్నానమును 15 నిమిషములతో ప్రారంభించి క్రమముగ 45 నిమిషములవఱకును వారమునకొక నిమిషము చొప్పున హెచ్చించుచు రావలెను. వారమునకు రెండు ఆతపస్నానములు ఆయాసము లేకుండ తేలికగా వారమున కొక ఆవిరిస్నానము చేయుచు, చుట్ట, నల్లమందు, పొడుము, కాఫి మొదలగు చురుకుబుట్టించు రస దురభ్యాసముల నెల్లవిడిచి అవిదాహియాహారమును, రసయుతమైన పళ్ళను గోధుమాహారమును తీసికొనవలెను. చికిత్స సంవత్సరములు పట్టును. చికిత్స యారంభించిన కొద్ది కాలమునుండి సుఖముగా నున్నను ప్రతి సంవత్సరమందు చిత్తకార్తిలో తిరిగి కనబడుచుండును గాన అట్లు కనబడుట

మూని నిశ్శేష మగువఱకును తొట్టివైద్యమును ఆజన్మాంతము వఱకు గోధు మాహారముతో అవిదాహి పథ్యమును జేయవలెను. ఈ రోగము మందులకు సాధ్యమగునదికాదు. వైద్యులకు బోధపడదు. రోగి ఆరోగ్యవంతునివలె తిరుగుచునే ఏ సమయమందో గుండె ఆగిపోయి కడతేరును. గాన జీవింప గోరు ఈరోగులు బ్రతికియున్నంతకాలమును సాత్వికాహారమునే సేవింపవలెను.

## ౩౪ బొబ్బ తెగులు

మహా భయంకరమైన యీ రోగము సయితము జలవైద్యమునకు సుసాధ్యమేయగును. మహా తీవ్రమైన జ్వరముతో నారంభించును గాన రోజునకు పెక్కుసార్లు అనగా ప్రతి 2 గంటలకును అరగంటకు తక్కువగాని కటిలింగస్నానములు ఒకదానితరువాత నొకటిగా ప్రవాహోదకముతో జేయవలెను. తొట్టిలోని నీరు 4 లేక 5 కావిళ్లుండవలెను. తరుచు ఆవిరి పట్టవలెను. తొట్టిస్నానాంతరము ఉన్నిదుప్పట్లతో కప్పియుంచవలెను. ఇట్లు చేయుటచే శరీరోష్ణము తగ్గుచు హెచ్చుచు ఒక రోజు రాత్రింబగళ్ళు చేయుసరికి తగ్గిపోవును. పిమ్మట నారింజకాయమాత్రి మిచ్చుచు పూర్తిగా ఆక లగువఱకు లంకణములుకట్టి జ్వరవేగము తగ్గిన తరువాతను రోజునకు 3 లేక 4 స్నానములు మాత్రము చేయుచు పూర్ణారోగ్యము గలుగువఱకు ఉపశమన స్నానములును అవిదాహిపథ్యమును జేయుచుండవలెను. బొబ్బ తెగుళ్ళందు పట్టణములందు ప్రతివారును రోజునకు 2 లేక 3 ఉపశమన స్నానములును వార

మునకు రెండు బాష్ప స్నానములును గోధుమజావ లేక రొట్టెతో అవిదాహిపథ్యమును రసయుక్తమైన పండ్లను సేవింపుచు ప్రకృతి ననుసరింపుచుండినచో బొబ్బతెగులు వచ్చునను భయము కలుగనే గలుగదు. ఆరోజులలో కొద్ది ఆకలితో నుండవలెనేగాని ఎప్పుడును అజీర్తి గలుగునట్లు తిన కూడదు, బొబ్బతెగులు వచ్చునను భయముతో టీకాలు వేయించుకొని జ్వరముతో బాధపడుట కంటె ఇట్లు స్నాన ములును పథ్యమును జేసినయెడల తెగులుభయము లేదు. సరిగదా ఇతరరోగములు కూడ రాక ఆరోగ్యముగల్గును. టీకాలవల్ల అన్యపదార్థము బిగుసుకొనిపోయి ఆరోగ్యము పూర్తిగా చెడును. అట్టి విషముల శరీరమందు ప్రవేశ పెట్టుకొని ఆజన్మాంతరమును కాలిక రోగమునకు గురియగుట కంటె తరుణరోగముతో చచ్చినను మంచిదే! ఏలనన శరీర మందు కాలికరోగము ప్రవేశించిన పిమ్మట గలుగు సంతాన మునకు తప్పక ఆయారోగబీజము లుండకమానవు. అందుచే కుటుంబములు చెడిపోవును. ఈ టీకాలు ప్రారంభించిన తరువాత హిందూదేశమంతయు, క్షయ, బొద, కుష్ఠు, బుడ్డ, మొదలగు కాలికవ్యాధులకు గురియై బాధ నొందుచున్నది. ఇట్టి జాగ్రతయే కలరా గలిగినపుడును, మశూచకము, పొంగులు, విష జ్వరములు కలిగినప్పుడును టీకాలు వేయుటకంటె ప్రకృతి యాహారములు ఉపశమనస్నానములను బోధించిన పక్షమున ఆరోగ్య శాఖవారు దేశమునకు పెక్కువిధముల ఉపకారము జేసిన వారగుదురు అప్పుడే వారు ఖర్చుపెట్టు డబ్బునకు సరిపడెడు ఉపకారము ప్రజలకు కల్గునుగాని ప్రస్తుతమందు.

ఉపకారము చేయుచున్న గ్లొంచుకొని తీరని యపకారము చేయుచున్నారు. పెక్కు దేశములందు టీకాలవలన నష్టమే గాని లాభములేదని తెలిసికొనిన పిమ్మటగూడ మనదేశమున కీకర్మ మానకపోవుట దురదృష్టమే!

౩౫. కుష్ఠ రోగమునకు చికిత్స.

ఈ రోగము దేశమెల్ల వ్యాపించి పెక్కుమంది జనులను పాడుచేయుచున్నది. ఈ రోగమున కింతవఱకు నిర్మూలము జేయు మందులు మందుల వైద్యములో లేవు. ఆయుర్వేద వైద్యమందు కూడ కనిపించదు. గోసాయీ లెవరైన తామ్రి భస్మమునుగాని, మూలికను గాని యిచ్చి వారి మహిమచే గుదిర్చిరని పూర్వపుకథలు విందుమేగాని ప్రస్తుతమందెక్కడను అట్టి చికిత్స కూడ కనబడుటలేదు. అనేకులు పాశ్చాత్యులు కుష్ఠురోగ చికిత్సాలయముల గట్టి యీ రోగులకు మందులిచ్చుచున్నారుగాని రోగము పూర్తిగా కుదిరినవాని నొకని నైనను ముచ్చటకైనను గానము. ఇట్టి రోగులను ప్రజలలో గలియకుండ తోడి రోగులతోబాటు చికిత్సాలయములందుంచి బ్రతికినన్నాళ్ళు ఇన్నినీళ్ళు మందని పోయుచు తిండిబెట్టుచు ఈరోగులకెల్ల సంతానవృద్ధి కలుగకుండ జేసి నిర్మూలించుటయే యీచికిత్సాలయముల ఉద్దేశమైన సరియేగాని, రోగనిర్మూల మగునను ఆశతో నీచికిత్సాలయముల స్థాపించి ద్రవ్యమును ఖర్చుపెట్టుట నిష్ప్రయోజనము. ఈడబ్బులో నూరవవంతు ఖర్చుతో తొట్టి వైద్యశాలలను స్థాపించి ప్రతి రోగియు ఉపశమన స్నానములు, మట్టి, ఆవిరి,

ఎండనుపయోగించు కొనునట్లు చేసి సాధ్యమైనంతవఱకు పచ్చి యాహారమున కలవాటుజేసి ఒక సంవత్సరమైన పిమ్మట అదే మాదిరి చేయునట్లు దిట్టపరచి విడచుచుండిన నెంత యుపకార మగునో మాటలతో జెప్పజాలను. ఈ రోగులిటు పూర్ణారోగ్యము గలుగువఱకు తొట్టిస్నానములను మరణమువఱకు పచ్చి తిండినిగాని లేక గోధుమయు సాత్వికాహారమును పళ్ళను తినుచుండి ఆరోగ్యము గలిగిన పిదప సంతానవంతులైనను ఈరోగబీజములు సంతానమునకు వ్యాపించవు. ఊడిపోయిన అవయవ భాగములు తిరిగి రానేరవు. గాని శరీరము తిరిగి పూర్తిగా బాగుపడి అసహ్యారూపముండదు. సంఘముతో జేరుట కర్హతగలుగును. ఈరోగులకు తమ నిర్భాగ్యస్థితి బోధపడదు. కామమధికము. తిండియందు కోరిక ఎక్కువ. తామస స్వభావము. వీని నన్నిటిని మనోదార్ఢ్యముచే వశపరచుకొని కొంతకాలము ప్రభుత్వశాసన భయముచేగాని, కుటుంబమువందలి యజమానుల నిర్బంధముచేగాని తొట్టి వైద్యమును. ప్రకృతి ననుసరించి ఆహారవిహారములును జేయుచుండినట్లేర్పాటు చేసినయెడల తామసతత్వము సాత్వికముగా మారి దుర్మార్గము వదలి సన్మార్గములోనికి వచ్చి దైవభక్తి, పాపభయము, దయ మొదలగు సద్గుణములు గలిగి యీ రోగులు ఇహాపర సుఖము బొందగలరు. చికిత్సాపద్ధతులు మామూలే. దినమునకు రెండు లేక మూడు తొట్టిస్నానములు, వారమునకు రెండు బాష్పస్నానములు, ప్రతిరోజును ఉదయాది అస్తమానమువఱకు వీలైనపుడెల్ల రోగముగల భాగములు తడిరేగటి మట్టితో గప్పి ఎండలో నుండుట, పచ్చి

యాహారమును సేవించుట. అంత కఠినముగా తినలేనిచో గోధుమాహారము అవిదాహిపథ్యము. ఎట్టిబాధలు గలిగినను ఇతరమందుల దెస బోరాదు. మనస్సునందు దైవధ్యానము జేయుచు ఆరోగ్యవంతుడ నగుదు నను ఆశయు ధైర్యమును గలిగియుండవలెను. ఇతరుల సంపర్కము వదలవలెను. కుష్ఠురోగ చికిత్సకు లక్షలాది ద్రవ్యమును దానముజేయు మహాశయులు గొందరు కూడి ఇట్టి చికిత్సకు తోట్టివైద్యము జేయించుచు భోజన సదుపాయ మేర్పాటు చేసిన అచిరకాలములో దేశమునందెక్కడను కుష్ఠురోగి యుండడని ఘంటాపథముగ జెప్పగలను. పరిపాలకులు గాని ప్రజలలో దాతలు గాని యిట్టి సుసాధ్యరోగమును ఈ తేలిక వైద్యముతో గుదర్చ యత్నించి చూచి అద్భుతఫలమును బొంది పుణ్యము గట్టుకొందురుగాక.

## ౩౬. బో ద కా ళ్లు, బు డ్డ లు

ఈ రోగములు పూర్వము ఉత్తర సర్కారులలో కెల్ల విశాఖపట్టణమందుగలవని వాడుక. అక్కడ మ్యునిసిపాలిటీవారు నీటిని శుభ్రపరచి గొట్టములగుండ పట్టణమంతటకును పంపుటయు మురుగు కాలవలను తీయించి సముద్రములోనికి మురికినీటిని పోగొట్టుటయు జరిగించిన పిదప తగ్గినవి. ఇటీవల పాలకొల్లునందుగూడ బయలుదేరినవి. తరువాత క్రమముగా దంపసాగుబడిగల చోటులందెల్ల వ్యాపించుచున్నవి. గాని మెరక ప్రదేశములం దంతగా వ్యాపించుటలేదు, దోమల వలన గలుగుచున్నవని వైద్యశాస్త్రజ్ఞులు చెప్పుమాట కంతఅర్థము

లేదు. కుళ్ళుగల చోటులందు దోమలు చేరకమానవు. క్రిము లవలన రోగములు పుట్టునను మాటయు సరిగాదు. చెట్టు ముందా? విత్తుముందా? యనునట్లు రోగములవలన క్రిములు పుట్టునా? క్రిములవలన రోగములు బుట్టునా? ప్రకృతియందు కుళ్ళుపదార్థమును నశింపుజేయుట క్రిమియొక్క పనియై యున్నది. గాక ఎక్కడ కుళ్ళుపదార్థము గలదో అక్కడ క్రిమి పుట్టుచున్నది ఈ క్రిమి దోమలవలన వ్యాపించినను మరియొక విధముగ వ్యాపించినను రోగపదార్థము శరీరమందు లేనివారియందు ఈ క్రిమిజేరినప్పుడు ఆహారములేక తనంతటనే నశించును. ఎవరి శరీరములు రోగపదార్థ పూరితములో వారి యందే యీ క్రిమి చక్కగా వృద్ధినొందును. గాన దోమల కును క్రిమికిని భయపడిన లాభములేదు. కోట్లకొలది ద్రవ్యము వెచ్చించినను ఈక్రిమిని నిర్మూలము చేయలేముగాని మన శరీరములను అన్యపదార్థ పూరితములు గాకుండ స్వాభావి కాహార సేవనమును, దుర్నడకలను, దురాచారములను, అస్వాభావికమైన నాగరికతయు వదలినచో ఇట్టి రోగములు అంకురించుటకే తావుండదు. దోమలు లేకుండవలెనన్న దంప హొలముల నెండగట్టి గ్రామములలో మురుగునీరు లేకుండ చేయవలెను. ఇది యెన్నటికిని సాధ్యముకాదు. దోమలున్నను రోగముల సంబంధమైన క్రిమిలేనపుడు ఈ క్రిమినెట్లు మోసి కొనిపోయి ఇతరుల శరీరములందు బ్రవేశ పెట్టగలుగును? కావున ఈరోగములు గలుగు కారణములనే తీసివేయవలెను. కారణములలో నిజమైనకారణము తెలియుట దుర్లభము. వైద్యశాస్త్రజ్ఞులు అస్వాభావికాహార సేవవలన గలిగినట్లు

కనిపెట్టలేరు. ఏలనన వీరికి స్వాభావికాహార మన నేమో తెలియదు. అనేక శాస్త్రజ్ఞులు అనేక కారణములు వారి తెలివితేటలను బట్టి కనిపెట్టుచుందురు. మరియొక కారణమును కనిపెట్టువఱకు మొదటిది నిజమని నమ్ముచుందురు. తుద కేదియు నిజముకాదు. ప్రకృతి శాస్త్రజ్ఞానమునుబట్టి చూడ రోగము లన్నిటికిని ఏదికారణమో అదే దీనికిని కారణమని తెలియవలెను. రోగములు వేరురూపములలో నుండినను రోగమంతయు ఒక్కటే. దాని కారణమును ఒక్కటే. చికిత్సయు ఒక్కటే. అన్యపదార్థమువల్లనే గలుగును. దానిని దొలగించిన నశించును. ఈ యన్యపదార్థమే యే అవయవము లందు జేరునో ఆ యవయవములబట్టి రోగమున కా పేరు వచ్చును గదా! ఎట్టి విపరీత రోగములుగల ప్రదేశమునందును, జనులెల్లరును ఒకటే రోగములచే బాధింపబడుట లేనందున రోగపదార్థము లేనివారిని క్రిమిగాని దోమలుగాని బాధించుట లేదని యూహించక తప్పదు. ఇట్టి తావులందు ప్రజలెల్లరు ప్రకృతి ననుసరించి ఆహార విహారముల మార్చుకొనిన యెడల కొద్దికాలములోనే పట్టణము లన్నియు బాగుపడగలవు ఇట్టి జాగ్రత తీసికొనవలసిన పూచీ పరిపాలకులకును, పురపాలకుల కును, ఆరోగ్యశాఖకును గలదు. ప్రజలకు సద్బోధజేసి యిట్టి రోగములవలన పిల్లపిల్లతరమును వంశములు చెడుననియు, వితుచెడుటచే సంతానము చెడక మానదనియు వచ్చునట్లు బోధించి ప్రకృతి మార్గమునకు మరల్చి రోగాంకురముల నశింపజేయ బ్రయత్నించవలెను.

అట్లుగానినాడు ఈ రోగములకు మందులు లేవు. ఇంజక్షనులు, ఆపరేషనులు తాత్కాలికోపశాంతి నిచ్చునేగాని శాశ్వత సుఖము నివ్వజాలవు. అంతేగాక ఇట్టి వైద్యమువలన రోగము మరింత ఘనీభవించి వీనికి తోడు, కుష్ఠు, క్షయ మొదలగు వానికి కూడ దారితీయును. చాలమంది రోగులుండు ప్రదేశములందు ఒకరిని జూచి యొకరు తనతోపాటు బాధపడు వారు మరికొందరు గలరుగదా యని తృప్తిజెందుచున్నారు. వంశపారంపర్యా సంతానము చెడునని వీరికి తెలియనందున ఇట్టి తృప్తిని జెందుచున్నారు. వైద్యులనేకులు జీవనోపాధిగా నున్న యీ రోగములు కూడనవని రోగులకు వైద్యులు బోధించరు. ప్రకృతివైద్యుడు చెప్పినను రోగులకు మందు నందుండెడి వెర్రినమ్మకము వలనను వైద్యులు గలుగజేయు నదుపాయమైన భోజనాదుల వలనను ప్రకృతి వైద్యులను నమ్మరు. డబ్బు ఖర్చులేని ప్రకృతివైద్యమునందు లక్ష్యముంచరు. రుచులవిడచి స్వాభావికాహారు లగుటకు భయపడి రోగముతో జచ్చెదమందురేగాని ప్రకృతియాహారమందలి సుఖమును గనిపెట్ట గోరరు. ఇట్టి రోగులలో నెవ్వరైనను బాగుపడ గోరునెడల చికిత్స లేకపో లేదనియు ప్రకృతి మాత తన యాజ్ఞల నుల్లంఘించిన వారిని నిర్దాక్షిణ్యముతో నెట్లు శిక్షించునో అంత దయతో తన యాజ్ఞల పాలింపబూని పశ్చాత్తాపతప్తు లగు వారిని క్షమించి కరుణించు ననియు నిర్భయముగ ప్రచురింపగలను.

రోగారంభమునందే ప్రకృతి చికిత్సలోనికి మరలిన యెడల శీఘ్ర కాలమునకే గుణమిచ్చును. పూర్తిగా అంతరించును.

అట్లుగాక రస, విష పాషాణాదుల మ్రింగి, ఇంజక్షనులు, ఆక్షేపనుల బొంది రోగమును ఘనీభవింప జేసుకొని మందుల వలన బ్రయోజనము గానక యీ చికిత్స నారంభించిన యెడల బ్రతికియున్నంత కాలమును స్వాభావికాహారము దినుచుండుటయు కొన్ని సంవత్సరముల వఱకు చికిత్స చేసుకొనుటయు తప్పదు, కొందరు రోగులకు చికిత్సారంభము నాటి కుండు రూపముతోనే ఆగి, ఇకవృద్ధిగాని, జ్వరము, వాపు మొదలగు బాధలుగాని యుండవు. చాలమందికి పూర్తియగు గుణము నిచ్చును. మామూలు చికిత్సకంటె వీనికిని వేరు లేదు. కటిలింగస్నానములు గాక రోజున కొక సారి రోగమున్న తావులకు ఆవిరిబట్టి పూలకు నీళ్ళుబోయు డబ్బాలతో ధారబట్టి నీళ్ళు బోయుచుండవలెను. వీలైనపుడెల్ల మట్టికట్లు గట్టుచుండవలెను. వారమునకు రెండు ఆవిరి స్నానములును, రెండు ఆతప స్నానములును శరీరమంతకును ఇచ్చుచుండవలెను. పచ్చితిండి తినిన త్వరలో పూర్ణారోగ్యము గలుగును. పచ్చితిండి యనిన ఏకాలమందే ప్రదేశమునందే కూరకాయలును ఫలములును లభించునో వానిని జీర్ణశక్తి ననుసరించి తినుట. ధాన్యములను, పప్పుదినుసులను కొంత కాలము వదలవలెను. అంత ఓపిక లేనివారు ఉప్పు, కారములు, పోగుపులు, వాసనద్రవ్యములైన మెంతులు, ఆవాలు, ఇంగువ, మొదలగునవియు వదలి కొంచెము నీటితో ఆనీ రిగురు వఱకు ఉడికిన కూరగాయలు, దుంపలును, రసయుతమైన పళ్ళును, గోధుమరొట్టెగాని, జావగాని రెండుపూటలు మాత్రము దినుచు మధ్యమధ్య పానముల విడువవలెను. పాలు

వచ్చినకూడ పనికిరావు ఇంతవఱకు శరీరమందు జేరియున్న రోగ పదార్థమంతయు జీర్ణకోశములోనికి జేరి బహిష్కరించ బడువఱకును బహు స్వల్పాహారమే సరిపోవుచుండును. గాన ఆకలి లేదనియు, శరీరము శుష్కించుచున్నదనియు, బరువు తగ్గుచున్నదనియు విచారింప నవసరము లేదు. పూర్తిగా దుష్ట పదార్థము నశించినపిమ్మట మామూలు ఆకలి వచ్చును.

## ౩౭ దగ్గు, ఉబ్బసము, మేఘరంజి, క్షయ మొదలగు శ్వాసాశయ వ్యాధులు

శ్వాసాశయ వ్యాధులు నూటికి 75 గురికి గలుగుచున్నవి. ఈ వ్యాధులకు అంత్యదశయందు మందుల వైద్యమునం దింత వఱకు పూర్తిగా కుదుర్చు సాధనములు లేవు. ప్రారంభ దశ యందు చేయు చికిత్సల వలనను, రస విష పాషాణాదుల వలనను, ఇంజక్షనుల వలనను క్రమముగ అంత్యదశలోనికి లాగుకొనివచ్చి చివరకు రోగియొక్క అర్థప్రాణములు లాగు కొనిగాని వైద్యులీ రోగులను విడువరు. మందులు లేవని చెప్పినను ఆ వైద్యులనే రోగు లాశ్రయించెదరు. గాని అతి సులభముగ కుదురు ప్రకృతివైద్యమును ప్రారంభ దశ యందు జేయ నిచ్చగించరు. ఏ రోగమైనను మొదటనే తీవ్ర దశలోనికిరాదు. అసాధ్య దశలోనికి వచ్చుటకు కొన్ని సంవ త్సరములు పట్టును. అంతకాల ముపేక్షచేయక ప్రారంభ దశయందు ఉపశమన స్నానముల చేయుచు ప్రకృతి యాహారమునకు మరలిన మొడల మొలకను గిల్లి వేసినట్లు నశించగలదు. అట్లుగాక క్షయవ్యాధిలోనికి వచ్చువఱకు

మందుల మింగి వైద్యులు తమవల్లగాదని విడచిన పిమ్మట
తొట్టివైద్యము చేయుటకు ప్రారంభించినవారు కూడ జీవితాశ
గలిగినది. మొదలు ప్రకృతి సిద్ధమైన యాహారమును వదలి
కొంచెము ఉప్పు చేర్చి కొందఱనియు, కొంచెము పొగుపు
కావలెననియు చెప్పుటయు రహస్యముగ తినుటయు మొద
లిడుటచే పూర్తిగా నిర్మూలించుట దుస్సర మగును. వైద్యు
నితో అబద్ధము చెప్పవచ్చును గాని ప్రకృతి మాతను మోస
పుచ్చలేరు. శ్వాసాశయ వ్యాధులందు ఉప్పు బొత్తిగా పనికి
రాదు. గోధుమ యాహారము తినుట మేలు. రసయుతమైన
నారింజ, నిమ్మ మొదలగు ఫలములను విశేషముగ వాడుటచే
దాహ మణచవలెను. జీర్ణకోశము పూర్తిగా చెడినగాని
యిట్టిరోగములు అంత్యదశలోనికి రావు. క్షయ రోగమునందు
అంతరింద్రియములను దహింపజేయు వేడి యుండును. ఈ
దహింపును మాన్పవలెనని రోగికి బలము గలిగి రోగమును
ఎదుర్కొనజేయవలెననియు, బలమునుగలిగించు టానిక్‌లును,
తేలికగా జీర్ణమగునని విదేశ మందు తయారైన ఆహారము
లును, మాంససారములు, గ్రుడ్లు మొదలగునవియు, తినిపించె
దరు. ఇంతవఱకే చెడియున్న జీర్ణకోశ మీ పదార్థములను
జీర్ణము చేయలేక పోవుటయే గాక రోగప్రయత్నముల నెదు
ర్కొను శక్తిలేక రోగిని త్వరలో కడతేర్చును. అన్యపదార్థ
విమోచన మగువఱకు ఆహారముతో నిమిత్తములేదు. క్షయ
రోగమునందు నిపుణులగు ప్రకృతి వైద్యుల సహాతో లంక
ణముల జేయించుటయు, ఉపశమన స్నానములను రాత్రిం
బగళ్ళు శరీరమందలి తాపము వదలువఱకు అరగంటకంటె

ఎక్కువకాలము చొప్పున పెక్కుసారులు చేయించవలసి యుండును. జ్వరము, తాపము వదలి జీవితాశ గలిగిన పిదప ఆహారము నివ్వవచ్చును. మొదటి రోజులలో కొబ్బరికాయ లోని గోరుమీగడయు, నారింజకాయయు నిచ్చుటవలన కూడ అపాయము లేను. లంకణములు గట్టుటకు సలహానిచ్చు ప్రకృతివైద్యులు దొరకనపుడు ఇట్టి తేలిక యాహారముతో నడుపవలెను. రోగి కోరనిదే ఆహార మివ్వరాదు. ప్రారంభ దశయందైనను శ్వాసాశయరోగులకు ఉప్పు పనికిరాదు. ఉప్పు కొంచెము వాడుచున్నను బాగుపడినవారు గలరు. గాని అట్టి వారికి పూర్తిగా స్వస్థత గలుగదు. శ్వాసాశయ రోగులు, కుష్ఠురోగులవలె బ్రతికి యున్నంత కాలమును ప్రకృతి ననుసరించియే బ్రతుకవలెనుగాని ఇతరజనుల జూచి తాము కూడ వారివలె తిని తిరుగవలె నను భ్రమ పెట్టుకొన గూడదు. లంకణములు గట్టినపుడు మొదటి రోజులలో నీరస మెక్కువగా నుండును. నాడి క్షీణించుచుండు. ఎట్లున్నను, నిమ్మ కాయ పిండిన నీళ్లు తప్ప ఇతర యాహారము నివ్వకూడదు. తరుచు తొట్టిస్నానముల వలన శ్లేష్మము జీర్ణకోశములోనికి దిగి క్రమముగా కుట్రవవలిన పొయ్యివలె రోగియొక్క జీర్ణ శక్తి బాగుపడును. తరుచు ఆతపస్నానములచే చెమటపట్టించు చుండవలెను. చికిత్సావిధాన మంతయు ఒకటే యగుటచే తిరిగి వ్రాయలేదు.

౩౭. నేత్రవ్యాధులు

నేత్రవ్యాధులు పృష్ఠభారముచే గలుగుచుండును. ఈ వ్యాధులుకూడ జీర్ణకోశము చెడినగాని గలుగవు. నేత్ర

రోగములకు పథ్యమక్కర లేదనుకొనరాదు. కన్ను లేనిది ప్రపంచకమే లేదు గాన ఈ వ్యాధులందు వనికిమాలిన ప్రతి వైద్యుడును ఇచ్చిన మందులను, కాటుకలను పెట్టుకొనరాదు. అపరేషనువలన గూడ నష్టమే తటస్థించునుగాన ఎట్టి నేత్రరోగమైనను ప్రారంభ దశయందుండగనే యుపశమన స్నానములు ప్రారంభించి అవిదాహిపథ్యమును జేయవలెను. కొద్ది కాలములోనే తప్పక అపరేషను చేసిన నేత్రమునకంటె ఎక్కువ బాగుగ కన్ను కనిపించును. ఆవిరి, ఆతపము, మట్టిపట్టీలు తొట్టిస్నానమునకు సహకారులుగనుండును.

### ౩౯ బాలింతరోగములు

బాలింతరోగములం దెల్ల మలినరక్తము సరిగా జారీకాకపోవుట కారణమై యుండును. అది జారీ యగుటకు ఇచ్చు వేడి ఔషధముల వలన ఇతర రోగములుకూడ పుట్టును. బాలింతజ్వరమునకు క్వయినా వంటి విషముల నిచ్చుటవలన ప్రయోజనము లేదు. మట్టికట్లు పొత్తికడుపునకు తరుచు వేయుటచే మలినరక్తము పూర్తిగా జారీయగుటయు, రోగిని ఆపదనుండి తప్పించుటయు జరుగును. బాలింతరాలునకు ఈ మట్టి చేయు ఉపకారము, కస్తూరి, ఇంగువ మొదలగునవిగాని ఇంగ్లీషు మందులుగాని చేయలేవు. కటిలింగ స్నానములు చేయుచు, మట్టికట్లు వేయుచుండుటచే, విరోచనము కూడ సాఫీగా అగును. జ్వరము దానంతట అదియే తగ్గును. సన్నిపాతము మొదలగు దోషములు గాని వాతాదిదోషములు

గాని చేరవు. మందులతో నిమిత్తములేదు. దాహమైనపుడెల్ల నిమ్మకాయ రసము పిండిననీరు నిచ్చుచు, ఆకలి యగువఱకు లంకణములును, పిమ్మట శరీరమునందు స్వస్థత గలుగువఱకు నారింజకాయలును, కొబ్బరిబొండములోని నీటిని, అందులోని గోరుమీగడ వంటి కొబ్బరి ఇచ్చుచుండవలెను. బాగుగా ఆకలి గలిగిన తరువాత రోజున కొకపూట గోధుమజావయు, నారింజ మొదలగుపండ్లను ఇవ్వవలెను. రెండవపూట తినుటకు తగినఆకలి పుట్టువఱకును తినకూడదు. పిల్లలకేమాత్రము సుస్తీగానుండినను తల్లి తొట్టిచేసి అవిదాహి పథ్యమవలంబించవలెను.

## ౪౦ గర్భిణికి గలుగు రోగములకు కారణమును, చికిత్సయు, సుఖప్రసవ సాధనము.

గర్భము ధరించిన పిమ్మట మనుష్యులు తప్ప ఏయితర జీవరాసులయందును ఆడజీవి పురుష సంగమము గోరుట లేదని అందరికిని తెలిసిన విషయమే. నాగరికతచే మార్పునొందక ప్రకృతిమాతయొక్క సూత్రములను మాత్రము ఆమూలాగ్రముగా పుట్టుకనుండియు తెలిసికొని వానిని ఏమార్పును లేక పూర్తిగా మన్నించుటచే నీ జీవరాసులలో గర్భము ధరించుటయు పిల్లల గనుటయు అతి పవిత్ర కర్మముగా నెంచబడుచున్నది. ఎట్టి చింతయు లేదు. పురిటి నిమిత్తమే ప్రయత్నములను జేయనవసరము లేదు. మందు మాకులతో గాని వైద్యులు, పనిముట్లు, మంత్రసానులు మొదలగువానితో గాని అవసరములేక సుఖప్రసవమును గాంచి పుట్టినశిశుడిదు.

నుండియు తమ సంతానమునకు వలయు క్షీరసమృద్ధి గలిగి తమకుగాని తమబిడ్డలకుగాని ఎప్పుడును ఏరోగము నెరుగక సుఖజీవనము చేయుచున్నవి. మానవులయం దిట్టి సుఖము లేకుండుటయు, పిల్లలను పెంచుటకు తగిన పాలు తల్లికి పూజ్యమగుటయు పాల బుడ్లను, వైద్యులనునమ్మి మాతా పుత్రులు జీవించుటయు ఎక్కడజూచినను గలుగుచున్నది. దీనికి కారణము 1 అస్వాభావిక ఆహార సేవనము, 2 గర్భ ధారణమైన పిమ్మట పురుష సంపర్కము. 3 అస్వాభావికనడక. 4 పనిపాటలు లేక జీర్ణమగు శక్తి నశించుచుండగా మరింత కోరికతో పిండివంటలు తినుట. కారణము నశింపజేసిన గాని కార్యము నశింపదు. మందులు వేయుట వలనను ప్రసవ సమయమున ఆపరేషనుల వలనను గర్భకోశమును, తత్సం బంధమైన వాహికలును సరిగా పెరుగుటయు పిమ్మట ముకు ళించు కొనుటయు లేక అకాల మరణములును లేక బ్రతికి యున్నను కురూపమును, జీర్ణశక్తి నశించి కాలిక రోగములకు గురియగుటయు తటస్థించుచున్నది. ఇట్టి విపరీతస్థితులు గలుగ కుండ మానవకోటి సుఖించవలెనన్న గర్భిణి గల్గినదాది సంగమమును వదలుకొనవలెను. గర్భిణిస్త్రీ ప్రసవ మగు వఱకు తన జీర్ణశక్తి ననుసరించి తగు స్వాభావికాహారమును దినుచు, తేలికైన పనులచే దేహపరిశ్రమ గలిగించుకొనుచు భయము గలుగునట్టియు, విచారకరమగు నట్టియు ప్రసంగ ముల గట్టిపెట్టి సంతోషముగా కాలము గడుపుచుండవలెను. పామరితనమును జేరనీయకూడదు. సూడిదలు పనికరావు. అపరూపమైన పండ్లను జీర్ణశక్తి ననుసరించి తినుటవలన

దోషము లేదు. ఇట్లు తొమ్మిది మాసములును సుఖముగా గడిపి సుఖప్రసవము గలిగి చక్కని కౌమారుడు గలుగునను ఆనందముతో కాలము గడుపుచుండవలెను. అట్టి సంభాషణ మునే వినుచుండవలెను. గర్భిణి యగుటకు పూర్వ మేదినములలో బహిష్టయ్యెనో ఆ దినములు నాల్గును ప్రతి నెల యందును గర్భిణిస్త్రీకి గండపు రోజులు గాన ఆదినములందు బహుజాగ్రతగా సంచరింపు చుండవలెను. భయము గలుగు నట్టియు విచారము గలిగించు నట్టియు దుష్టవాక్యముల విన కూడదు. తేలికగా తిని సుఖముగా సంతోషముతో కాలమును గడుపుచుండవలెను. రోగము గలిగిన తనకేగాక తన గర్భమందలి నోరెరుగని శిశువునకు కూడ బాధ గలుగును. గాన మహాపాతకము తటస్థించునను జ్ఞానము గలిగి గర్భిణి స్త్రీ స్వాభావికాహార విహారములు మీరి నడువరాదు. ప్రసవించినమీదట కూడ పిల్లలు పాలుత్రాగుచున్న రోజులలో కూడ నిట్లే ప్రకృతి జీవనము చేయవలెను. ఇట్టి నియమములు జరుపవలెను. గనుకనే మాతృదేవత యని తల్లిని భజించెదరు. స్త్రీయై పుట్టినందు కిట్టి మాతృత్వము వల్లనే ధన్యత. పాలుగలిగిన పిల్లలను పెంచుట బహు తేలికయును సుఖమును. పాలు గలిగినను పిల్లల కివ్వని తల్లులును, పాలులేని తల్లులును భూమికి భారహేతువేగాని వారివలన ప్రయోజనము లేదు. జంతువులలో నిట్టివుండిన నెట్లు గర్హింపబడునో అట్లే అట్టి స్త్రీలు కూడ నింద్యార్హులు. ప్రకృతి జీవనము నడుపువారిలో నిట్టి వారి నెక్కడను గనజాలము. గర్భిణిగానుండి పురుష సంపర్కము పొందుటవలన పాలుం

డవుగాన అట్టి దోషము చేయకూడదు. గర్భిణిస్త్రీ ప్రకృతి జీవనము జరుపుచు నవమాసపూర్తి యయిన పిమ్మట కొంచె మించు మించుగా 280 రోజులు గడచిన పిమ్మట ప్రసవించును. పశుపక్ష్యాదుల వలె మనుష్య స్త్రీలకును ప్రసవ విషయమున ప్రయత్న మక్కర లేదు. సహజముగ మంత్రసాని సాహాయ్యముకూడ అక్కర లేకయే ప్రసవము జరుగును. నవనాగరికతా ప్రభావమునను, దుష్టపదార్థ సేవనము వలనను, దుర్నడతల వలనను ఈ యిరువదవ శతాబ్దము నందున పందొమ్మిదవ శతాబ్దాంతము నుండియును సుఖప్రసవము లరుదగుటయు డాక్టరుగారు పనిముట్లతో శిశువు నూడ బెరుకవలసి వచ్చుటయు జరుగుచున్నది. ఇట్టి హేయమైన పని వలన స్త్రీలు మానప్రాణముల బోగొట్టుకొనుచున్నారు. ఎట్టి దుస్థితియందైనను ప్రకృతిమాత తల్లి గర్భము నుండి శిశువును అతి సులువుగ వెలువరింప బ్రయత్నించును. స్త్రీ యొక్క అవయవములు దుష్టాహార విహారములచే సరిగా విరివిగలుగక పోవుటచే అంతసులువుగ ప్రసవము రాకుండినను మనుష్యుడు తన తెలివి తేటలచే చేయు ఆపరేషను వంటి అస్వాభావికమును మానహీనమైన పనికంటె పెక్కురెట్లు సౌఖ్యముగ తనంతట శిశువు వెలువడువఱకు బాధలకోర్చియుండుట చే తల్లికి గాని శిశువునకు గాని ప్రాణహాని గలుగకుండ రాగలదు. శిశువును వెలువరింప గలిగిన అవయవ పాటవము లేని స్త్రీ డాక్టరు సాహాయ్యమున గూడ బ్రతుకదు. మానహాని మాత్రము పొందును ఆయుర్దాయము లేనివారిని ధన్వంతరి కూడ బ్రతికింపజాలడు, గాన ప్రకృతి మాతకు విడచి చూచు

ముండిన యెడల అన్నియు కాలానుసరణముగ క్రమపడును. డాక్టరులు చేయు తెలివితక్కువ వైద్యములవలన పెక్కు-మంది బాలింతరాండ్రు అకాలమరణముల పాలగుచుండుట ఆసుపత్రిలలో జూచుచున్నాము. ఇట్లుండియు పురుడుపోయు ఆసుపత్రిలింకను చాలగ నుండవలయునని కోరుట బహు విచారకరము. భారతమాత పుత్రికలందరును మానవతులై ప్రాణముకన్న మానమునే ఎక్కువగా తలంచుకొని ఖ్యాతిని సంపాదించి యున్నారు. యూరోపావారితో సాంగత్యము గలుగక పూర్వము భారత స్త్రీ లిట్టి విపరీతపు ప్రసవములను మరణములను ఎరుగరని అందరకును తెలిసిన విషయమే. ఇప్పుడైనను ప్రకృతి యాహార విహారములకు మరలిన యెడల తిరిగి మానహాని లేకుండ బ్రతుకవచ్చును. కృత్రిమాహారులు కూడ నొప్పులు ఆరంభమైన నాడి ప్రకృతి వైద్యము చేసిన యెడల అవయవములు బలముజెంది మార్గము క్రమపడి సుఖప్రసవము దొరకును. నొప్పులారంభించిన పిదప పాలుగాని యితర ఆహారముగాని యివ్వక తేలికగా నుంచవలెను. నొప్పులు ఆగినయెడల నీళ్ళలోనుండి తెచ్చిన రేగడి మట్టిని ఒక అంగుళము దళసరిని పొత్తికడుపునకు వేయుటవలన నొప్పులు తిరిగి పుట్టును. శిశువు అడ్డముతిరిగి పడు ఒక లింగస్నానము ఓపిక యున్నంతసేపు (అయిదు నిమిషములైనను చాలును.) చేసినయెడల గర్భావయవములు బలమును జెంది బిడ్డను సరిగా త్రిప్పివేయును. శిశువు మరణించినను గెంటి వేయగల దార్ఢ్యమును పొందును. గాన ఆసుపత్రిలను యమలోకములుగ దలంచి ప్రసవము నిమిత్త మక్కడకు

పోకుండుటచే మరణములసంఖ్య తగ్గగలదు. ఆసుపత్రిలు ఆపరేషనులు తమను గాపాడగలవను పిచ్చి నమ్మకముతో గర్భిణీస్త్రీలు దుష్టాహారముల తిని దుర్నడతలు నడచు చున్నారు. అస్వాభావికమైన వన్నియు హానికరములు గాని సుఖదాయకములుగావు శిశువునకు భూపతనమైన వెంటనే కర్పూరము వేయుట, ఆముదపువేలు కుడుపుట మొదలగు వాని కలవాటుపడియున్నారు. శిశువు గర్భకోశమునుండి భూపతనమువఱకు జరుగు ప్రయాణములో నలిగియుండును. అంతవఱకును తల్లి తినిన యాహారమునే పాల్గొనుచున్నది. ఆఖరున తీసికొనిన యాహారము గర్భకోశమునుండి వెలువడు టకు పడినకష్టముచే అరుగక మందముగా నుండును. తిరిగి శరీరమందలి నొప్పులుపోయి జీర్ణకోశము బలపడువఱకును వేరే యాహారమును గోరదు. కాని కృత్రిమముగా జీర్ణకోశ మునకు గలుగజేయబడిన చురుకుదనము వలన అనగా రసము ఆముదము మొదలగువాని వలన మలకోశములోనికి జీర్ణము కాకుండనే నెట్టివేయబడి విరోచనములగును. అందువలనను వేడిమెక్కువై విదాహము గల్గుటవలనను శిశువు ఆహారము కొఱకేడ్చును. తల్లివద్దకు పాలు రాదగుకాలము ఇంకను రాదు. అందువల్ల శిశువునకు ఇతరమైనపాలు ఇవ్వవలసి వచ్చును. శిశువుయొక్క శరీరము స్వస్థపడువఱకును వేచి యుండక యిచ్చిన యీపాలవలన కొంత అనారోగ్య మేర్ప డును. కాన మందులుగాని ఆముదముగాని యివ్వక శిశువు పాలకొఱకేడ్చువఱకు నిరీక్షించిన యెడల పూర్వపు ఆహా రము చక్కగా జీర్ణమై, విరోచనమై తల్లికి పాలుపడు సమయ

మునకే పిల్లకును ఆకలగును. ఇది భగవన్నిర్మాణము. గాన దానిని మీఱ నవసరములేదు. ఆయుదము గుడుపకున్న పిల పాలు త్రాగుట మఱచు ననుటగాని, విరోచన మవదనుటగాని తప్పు. సర్వశక్తిమంతుడైన పరాత్పరుడు సృష్టియందలి జీవ రాసులన్నిటితోబాటు మనుష్య శిశువునకు గూడ కృత్రిమ పద్ధతులలో నిమిత్తములేకుండ సహజముగనే విరోచనమగు సాధనములను, పాలుత్రాగు జ్ఞానమును ఇచ్చియున్నాడు. ఉగ్గుతోగాని డబ్బాపాలతోగాని, మందులతోగాని నిమిత్తము లేదు. బాలింతరాలు దుష్టతిండి తినక తన పిల్లయారోగ్యము కొఱకు తన యారోగ్యమును గాపాడుకొనిన మందులతో నిమిత్తములేదు. స్త్రీజనము తమ మాతృత్వమును నిలుపు కొనుటకుగాను గౌరవముగా నుండగోరెదను.

ప్రసవమైన స్త్రీకి వెంటనే పాలురావనుట తప్పు. తప్పక వచ్చును. ఆపాలు బహు తేలికగా జీర్ణమగుటయేగాక కడుపు నందలి కుట్రినంతను కొట్టివేయు గుణము గలిగి యుండును. కాన మందులువాడక తల్లిపాలనే యిప్పించవలెను. శిశువుకు తల్లియొడలి యొక్క వేడియే ఆరోగ్యము నిచ్చును. అంత వఱకు తల్లి గర్భమునందు పెరిగి, తల్లి యొక్క దేహోష్ణమునే గ్రహించు శిశువు కొంతకాలమువఱకు తల్లియొక్క దేహో ష్ణమునే గోరును గాన తల్లి ప్రక్కలో శరీరములు తగులు నట్లు శిశువును పరుండబెట్టవలెను. పురిటిల్లు శుభ్రముగాను, మంచిగాలి వచ్చునదియు, ఒకరిద్దరికంటె ఎక్కువ మంది జనము లేనిదిగను ఉంచవలెను. శిశువునకు విరోచనము కాని యెడల అంగుళము వెడల్పున నాల్గుమడతలు గల తెల్లని

గుడ్డను చల్లనినీటిలో (ప్రవాహోదకములో) దడిపి పొత్తి కడుపున ఒక నిమిషము వేసియుంచిన విరోచనమగును. ప్రసవమైన పిమ్మట బాలింతరాలు కదలకుండ పరుండవలెను. సిగ్గురపోగలిగిన చాలమంచిది. కొంచెమోపిక గలిగి లేవగల శక్తి గలుగగనే ఒక లింగస్నానము చేయుటచేత మలినమంతయు పోవుటయేగాక శ్రీఘ్రముగనొంది యున్న గర్భాశయము ముకుళించుకొనును. నొప్పులు శాంతించును. బలమును జెందును. పిమ్మట నడికట్టు గట్టుట మంచిది. ఇందుకు గాను 4 అంగుళముల వెడల్పుగల కాసికోకవంటి నూలుపట్టా చాల యుపయోగముగ నుండును.

తదుపరి బాలింతరాలు శరీరమందలి నొప్పులన్నియు తగ్గి తలనొప్పి మొదలగు బాధలేమియు లేక కరకర ఆకలి యగువఱకును ఉపవసింపవలెను. మైల అంతయు పూర్తిగా పోవువఱకును పొత్తికడుపునకు మట్టి పట్టీలు వేయవలెను. ఈ మట్టిపట్టీలు మలినమును పూర్తిగా జారీ చేయించుటయేగాక జీర్ణకోశమును బాగుపరచి అవయవములకు శక్తినిచ్చి విరోచనము చేయగలవు. ఇంతకంటె మందు అవసరములేదు. ఇంగువగాని, కస్తూరిగాని కాయముగాని అక్కఱలేదు. దాహమైనపుడెల్ల నిమ్మకాయ రసము పిడిచిన నీళ్ళను ఇవ్వనగును. ఇదికూడ వేడిగాని చలవగాదు. కాచిన నీటితో పనిలేదు. బాగుగ ఆకలై యే బాధయును లేనపుడు రెండురోజుల అనంతరమునందు నారింజ తొనలను ఇచ్చి ఒకరోజు లంకణము కట్టవలెను. మరునాడు సుళువుగానుండి ఆకలియైన యెడల లేత కొబ్బరికాయలోని గోరు మీగడయును నారింజ

కాయయును ఇవ్వనగును. మూడవరోజున గోధుమ జావ యును నారింజ నిమ్మ మొదలగు రసయుతమైన పండ్లను ఇవ్వవలెను. ఇట్లు రోజున కొక్క-పూట చొప్పున పెద్దపుటిటి యం దివ్వనగును. సుఖముగా నుండి ఆకలిగా నుండినది మొదలు నెలపుటిటితో రాత్రులయందు బహుపల్చని గోధుమ రొట్టెలను (వేడిగాలికి కాలినవి) జీర్ణశక్తి ననుసరించి బహు కొద్దిగ నిచ్చుచు రావలెను. ఇట్లొక మాసము గడచిన పిమ్మట బాలింతరాలు ఏ రోగమును లేక బహు తేలికగను ఆరోగ్య వంతురాలుగను ఉండును ఎప్పుడును తక్కు-వ తిని ఆకలిగలిగి యుండవలెనేగాని అజీర్తిని ప్రవేశింప నివ్వరాదు ఈ చికిత్స యందు బాలింతరాలికి 3 లేక 4 రోజులలోనే మలినమంతయు. పోవును. గాన బాలింత జ్వరమునకు తావులేదు.

పిల్లకు పాలిచ్చు నంతకాలమును తల్లి బహుతేలికగ స్వాభావి కాహారమును దినుచుండవలెను. అట్లు స్వాభావికాహార విహా రములవలన పిల్లలు ఏరోగమును నెరుగక సుఖముగ జీవించె దరు. తల్లిపాలకు మించిన ఆరోగ్యవంతమైన ఆహార మేమియు లేదు. అవి లభించనపుడు దాదిపాలును, తరువాత మేకపాలు, తరువాత ఆవుపాలును మంచివి. విదేశములనుండి వచ్చు డబ్బా పాలు నిలవ వలనను, కాచుటవలనను, పెక్కు-వస్తువుల చేరిక వలనను నిర్జీవములగుటచే బిడ్డల యారోగ్యమును జెరుచును గాన వానిని వాడకూడదు.

శిశువునకు గలుగు సర్వరోగములందును తల్లి తొట్టిస్నాన ములు మొదలగునవి చేయుచు స్వాభావికాహార సేవనము చేయవలెను. శిశువునుకూడ ఒకటి రెండు నిమిషములు తొట్టి

స్నానము చేయించవలెను. లేదా తడిగుడ్డ పట్టి 30 సెకనుల కొకమారు మార్చి 2 లేక 3 నిమిషములు వేయించుచుండ వలెను. వేడివచ్చుటకు బిడ్డను తల్లి తనకడుపున జేర్చుకొని పరుండ బెట్టుకొనవలెను. వేడి వచ్చువఱకు పాలివ్వరాదు. సాధ్య మైనంతవఱకు తల్లియు పిల్లయును శుభ్ర మైన గాలియు, వెలుతురును, ఎండయు తగులునట్లు బయట తిరుగుట మేలు.

## ౪౧ శిశువులకు గలుగు రోగములు

తల్లిపాలు త్రాగుచు ఇతరములగు పోతపాలెరుగని శిశువు నకు ఎట్టి అనారోగ్యమును గలుగవలసిన పనిలేదు. ఏజబ్బైన చేసినయెడల తల్లి అమితముగగాని, అపథ్యముగగాని తినెనని గ్రహించవలెను. తల్లి తిన్న తిండికి పిల్ల అద్దమువంటిది పిల్లల దేహము త్రాసువలె బహు సున్నితముగ నుండును. గాన ఏమాత్రపు తేడా వచ్చినను వెంటనే ఆరోగ్యము చెడును. ఇట్టి స్థితియందు పిల్లలతత్వము మంచిదిగాదనియు, రోగిష్ఠి పిల్లయనియు నిందించుచుందురు. గాని నిజమునకు ఆ శరీరమే మంచిది. ఏలనన అవయవములు బలయుతములుగ నుండి జీర్ణకోశము బాగా పనిచేయుచు నుండుటవలననే శరీరమునం దెట్టి రోగపదార్థమును జేరనివ్వక వెంటనే రోగమును తెప్పించి శరీరమును బాగుచేయుచుండును. ఆ ప్రయత్నమున కడ్డుదగిలి యే ముసలమ్మలమాట పట్టుకొనియో లేక అంత కంటె మూర్ఖులగు మందువైద్యుల మాటలను నమ్మియో రస, విషములుగల మందులను నల్లమందుతో గలిపి సన్న మాత్రలను జేసియో, లేక కస్తూరిమాత్రలనో నిత్యవిధిగా

వేయుచుందురు. అందువలన శరీరముచెడి రోగమువచ్చుట మాని కాలికరోగములకు గురియగును. చిడుము మొదలగు చర్మవ్యాధులకు రాయు రసములు గలసిన లేక గంధకము గలసిన ఔషధములను రాయుటచే చర్మమునుబయసెక్క వ్యాధి లోపలకుపోయి యితర కఠిన రోగములుగల్గును. గావున చంటిపిల్లల కౌషధసేవకూడదు. తల్లికి అజీర్తిరాకుండ జూడ వలెను. తేలికగ భుజించవలెను. అవసరమైన ఉపశమన స్నానములు చేసి తన శరీరమును బాగుపరచుకొనిన పక్షమున శిశువునకు చికిత్స అక్కరలేకయే ఆరోగ్యము గలుగును. పిల్లలకు పాలిచ్చుటగూడ తల్లులు నేర్చుకొన వలసియున్నది. తెల్లవారగట్ల 4 గంటలు మొదలు సాయంత్రము 9 గంటలవఱకు గల కాలములో 6 సార్లకు మించకుండ 3 మాసములు వెళ్లు వఱకును, పిమ్మట 6 మాసములవఱకు 5 సార్లును, సంవత్సరము వెళ్లువఱకు 4 సార్లును నియమితముగ పాలివ్వవలెను. మల మూత్రములు విడచుటకూడ సరియైన సమయములందలవాటు చేసిన అదేవిధమున ప్రతిరోజును జరుగుచుండును. పిల్ల లేడ్చి నపుడు ఏకారణముచేతనో తెలిసికొనగల తెలివితేటలు తల్లుల కుండవలయును. నల్లులు, చీమలు, దోమలు పిల్లలనుబాధించ కుండ చూడవలయును. పండుగలు, విందులు, శ్రాద్ధములు మొదలగు సమయములందుగూడ చంటిబిడ్డతల్లి యితరులతో బాటు అధికముగ దినరాదు. బహుజాగ్రతగ నడపిన ఏ రోగమును లేక చక్కగ పెరిగి తల్లి నానందింప జేయును. అట్లుకానినాడు పిల్లను పెంచుట బహు శ్రమతోకూడియుండి సర్వదా ఆందోళన గలిగించుచునే యుండును.

జ్వరములు, రొంప, విరోచన బద్ధము, వాంతులు, విరోచనములు మున్నగు సర్వరోగములకును 2 నిమిషములు మొదలు 5 నిమిషములవఱకు 6 నెలలలోపునను, పిమ్మట ఏడాది లోపు 10 నిమిషములవఱకును కటిస్నానముల జేయించవలెను. అప్పుడప్పుడు అవసరమైన కాళ్ల మీద పరుండబెట్టుకొని ఆవిరి కూడ పట్టించవలెను.

ఆటలమ్మ, పొంగు, మసూచి మున్నగు వ్యాధులందు వంటికి చెమట పట్టించుట, కటిస్నానములు అవసరము. ఆవిరికంటె ఆతపస్నానములు పిల్లల కుపకారముగా నుండును.

పిల్లలెప్పుడును యథాస్థితిగా నుండవలెనుగాని విస్తారము చాయలోగాని, బలిసిగాని, ఒళ్లుపొంగిగాని, నునుపుగా గాని యుండరు. అట్లుకనిపించినట్లు తోచగానే జబ్బుచేయునని యూహించవలెనేగాని పిల్ల యూరదొరవలె ఉన్నదని సంతోషింపరాదు. తత్క్షణమే చెమటపోయునట్లుచేసి కటిస్నానముల జేయించవలెను. తల్లులు తిండితగ్గించి ఉప్పుకారములు వర్జింపవలెను. ముందుగా తెలిసికొని చేయు చికిత్స వలన ఆరోగ్యము చెడదు.

పాలులేని తల్లులు పిల్లలను పెంచుట కష్టాలుగాదు. పోతపాలు తప్పనప్పుడు దాదిపాలును, అది సాధ్యము గానప్పుడు మేకపాలును, లేక ఆవుపాలను పోయవలయును. కొందరు స్త్రీలు ఆవుపాలు అరుగక బల్ల పెరుగునను పిచ్చనమ్మకముతో నున్నారు. ఆవుపాలు పితికినవెంటనే గుమ్మపాలుగ పోయవలెను. ఇది ఉదయమందును, సాయంత్రమును సాధ్యమగును. అలవాటు చేసినయెడల మధ్యాహ్నమునకూడ ఆవు

పాలిచ్చునట్లలవాటు చేయవచ్చును. అట్లు కుదరనిచో ప్రొద్దుటి పాలు ఒకపొంగు వచ్చునట్లుమాత్రము కొంచెము నీరుగలిపి కాచి పోయవలెను. ఇంతకంటె హెచ్చుసార్లు పోయ కూడదు. ఆకలై పిల్ల యేడ్చినయెడల చమ్చాతో చన్నీళ్ళు పోయుటవలన త్రాగినపాలు చక్కగా జీర్ణమగును. పిల్లలకు చన్నీళ్లు జబ్బుచేయవు. రెండుసార్లు పాలును ఒకసారి తియ్యని నారింజరసము ను పోయుటయు మధ్య మధ్యను మంచినీరు పోయుటయు బహుఆరోగ్యదాయకముగ నుండును. అజీర్ణ వ్యాధులురావు.

## ౪౨ స్త్రీరోగములకు చికిత్స

స్త్రీలకు ప్రత్యేకించి కుసుమరోగములును, ముట్టుకుట్టు బహిష్టు కాకుండుట, వంధ్యాత్వము మొదలగు రోగములు గలుగుచుండును. వీనికన్నిటికిని ముఖ్యకారణము వంశాను గతములగు నట్టిగాని, లేక వారి భర్తలచేగ ని, స్వయముగ గాని సంపాదించుకొనబడిన సుఖరోగములై యుండును. ఈ రోగములు రసవిషపాషాణాదులచే శరీరమం దణపబడి రోగ పదార్థము ఎండ బెట్టబడి గుహ్యేంద్రియములవద్ద చేరి యీ రోగములకు కారణమగును. మూల కారణమైన సుఖరోగ ములు అణచబడినందున అవి రోగికిగాని వైద్యునికిగాని కన పించవు పైకి కనబడు రోగమునకు మందులు వేయుటచే అవి కుదరవు సరి గదా జీర్ణకోశ మంతకంతకు చెడిపోవును పిమ్మట నీరసము గలిగి నాడులు చెడి రోగి బలహీనమగును గాన నీరోగము లన్నిటికిని ప్రథమదశయందు ఉపశమ:

స్నానములు చేయించుచు అవిదాహిపథ్య మవలంబించుటచే జీర్ణకోశము బలపడును. పిమ్మట క్రమముగా నా రోగములు శాంతించి కారణమగు సుఖ రోగములు బయల్పడును. ఏలనన వాని నణచియుంచిన, రస, విషాదిపదార్థములు శరీరమునుండి కురుపుల మూలమునగాని, బహిష్కారావయవముల గుండగాని వెలుపలకు నెట్టి వేయబడును. గాన సుఖరోగములు బయల్పడి క్రమముగ కొద్ది రోజులకు సుఖరోగ విషముకూడ శరీరమునుండి పోవును. ఈ చికిత్స ఓర్పుతో చాల కాలము అవిదాహిపథ్యమును, ఉపశమనస్నానములును చేయవలెను. వీనినుండి పుట్టు మరియొక రోగము అపస్మారము (Hysteria). ఈ రోగము విశేషముగా వ్యాపించుచున్నది. దానికి మందులవలన గుణము కనబడుటలేదు సరిగదా చిరకాల చికిత్సలచే రోగి ఎందుకును పనికిరాని దుస్థితికి వచ్చుచున్నది. కొందరు మూర్ఖులు దయ్యముపట్టినదని భూతవైద్యము చేయించి బెత్తముతో కొట్టుట, పెద్దపెద్దపట్లు బెట్టి, కేకలు, బొబ్బలు పెట్టి అదివఱకే చెడియున్న మెదడును మరింత పాడుచేయుదురు. మందులివ్వక, ఇట్టి విపరీతచికిత్సలకు బోక ఉపశమనస్నానములును అవిదాహిపథ్యమును ప్రారంభించిన యెడల అనేక రోగులు మృత్యువాతనుండి తప్పింపబడుదురు. ఈ రోగులకు గుండె బహు నీరసముగా నుండును. గాన సర్వాంగ బాష్పస్నానము పనికిరాదు. అతప స్నానములు మాత్రమే తరుచు చేయించుచుండవలెను. చిరకాల చికిత్సకు గాని యీ రోగము లొంగదు. ఏలనన స్త్రీ రోగములన్నిటి యందును అన్యపదార్థము వెన్నుపూసనుండి శిరస్సునకెక్కి

అక్కడనుండి ముందునకు దిగునుగాన ఇది పృష్ఠభారమగును. సార్వత్రికభారము కూడ గలుగవచ్చును. వయస్సు మీరిన రోగులకు పూర్ణారోగ్యము గలుగక పోవచ్చును అయినను శాంతి మాత్రము గలుగును. దీనినుండి పిచ్చికూడ గలుగ గలదు. ఈ రోగమునకును ఇదియే చికిత్స. ప్రథమమందు కొన్ని రోజులు నిర్బంధించి తొట్టిస్నానములు చేయించు టవసరము.

## ౪౩ పిచ్చి రోగము

అనేకమంది పిచ్చివాండ్రు మనకు కనిపించుచునే యున్నారు. ఈ రోగమింత యభివృద్ధి గాంచుటకు కారణము మందు వైద్యమే. రోగనిదానము తెలియక మందులు విశేషముగ వాడుటచే జీర్ణకోశము చెడి రోగపదార్థము పృష్ఠభాగమునకు నెట్టివేయబడుటచే క్రమముగ శిరస్సునకెక్కి నాడీరోగముగా మారును. పరిశ్రమ, శోక విశేషము మెదడునకు పని గల్పించు చదువులచేత గాని, వృత్తులచేతగాని యీ రోగము గలుగవచ్చును. నరములు సరిగా పని చేయవుగాన తాను చేయుపనిగాని, తాను చెప్పుమాటగాని రోగి ఎఱుంగడు. ఈ రోగములకు ఆయుర్వేద చికిత్సకులు రోగిని విశేషముగా కొట్టుటచేతను, గాఢమైన అంజనముల చేతను చికిత్స చేయుదురు. అంజనములచే రోగపదార్థము శిరస్సునుండి ముందునకు నెట్టివేయబడి కొద్దికాలము నిమ్మళించినను తిరిగివచ్చుచుండును. అల్లోపతివైద్యమునందు ప్రత్యేకపరీక్షలయందుత్తీర్ణులైన డాక్టరుచే పిచ్చి ఆసుపత్రులందు గదులయందు బంధించి

కొట్టుట మొదలగు మోటపద్ధతులచే మందులు మ్రింగించె
దరు. ఈవైద్యమందును అంత గుణమివ్వదు. పల్లెలందు తల
యందలి వెంట్రుకలు తీయించి కాళ్లుపెట్టి నిమ్మకాయరుద్ది
చన్నీట స్నానమాడింతురు. పైచికిత్సలకంటె ఇది కొంతమేలే.
మందులచే రోగపదార్థమును ఘనీభవింపజేయుట యిందులేదు.
ఈరోగులను తొట్టిచేయించుటకు ఒకటి రెండురోజులు బహు
శ్రమయే. దిట్టమైన నలుగు రైదుగురు మనుష్యుల సహాయ
ముతో కటిలింగస్నానములు చేయించి, తరుచు ఆతపస్నాన
ములును, రసయుతమైన నారింజ, నిమ్మ మొదలగు ఫలము
లను దినిపించినయెడల శిరస్సు దోషముపోయి తనంతట తానే
రోగి తొట్టిస్నానములు చేసుకొనును. పిచ్చితిండి, ఆకలి
శాంతించి మామూలు తిండిలో పడును. పిమ్మట వారమునకు
రెండు బాష్పస్నానములు, రెండు ఆతప స్నానములు చేయిం
చుచు రోజునకు రెండు లింగస్నానములు ఒక కటిస్నానము
చొప్పున చేయించిన పక్షమున ఒక సంవత్సరములో పరిపూర్ణ
ఆరోగ్యము గల్గును. ఒక వారములోనే పిచ్చి వదలును. అంత
మాత్రముతో తృప్తి పొందరాదు. వృష్ణభారముచే వచ్చు
నాడీరోగ మనుటచే నీరోగమునకు ఒక సంవత్సరము చికిత్స
అవసరము. పిమ్మట చిరకాలము అవిదాహి పథ్యమును
స్వాభావికాహారమును అవసరము. పేరుపెట్టుటకును పోల్చు
టకును మందుల వైద్యుల కసాధ్యములగు నాడీరోగము
లన్నియు ఉపశమన స్నానములు చేయుచు, స్వాభావికాహార
మును రసయుతమైన పళ్ళు తినుచు అవలంబించిన యెడల
నిమ్మళించును.

## ౪౪ ఎత్తునుండిపడుటచే ఒళ్లంతయు నలుగుట

సాధారణముగ మగవాండ్రు చెట్లనుండియు, ఆడవాండ్రు అటకలమీదనుండియు పడుచుందురు. దెబ్బ తగిలిన వెంటనే మంచినీళ్ళిచ్చి స్పృహ రాగానే వేడిసారావలెననియు, స్మారకము తెలియకుండ బాధను ఓర్చుకొన వలెననియు సారాయి నిచ్చెదరు. పిమ్మట మందుల వైద్యులు కండబట్టుటకు గాను కోడిమాంసము వంటి బలకరమైన ఆహారము నిచ్చెదరు. ఆయుర్దాయ విశేషముచే రోగి బ్రతికినను ఇది సరియైన చికిత్స కాదు.

దెబ్బ తగిలినవెంటనే చన్నీట రోగిని ఒక పావుగంట వరకు స్నానము చేయించి పిదప చాలసేపు తడిగుడ్డ కప్పియుంచిన మొదల నలిగిన అవయవము లన్నిటికిని రక్తప్రసారము గలిగి కండరములు చెడిపోక బాగుపడును. పిమ్మట, ఎక్కడెక్కడ బరువైన దెబ్బలు తగిలినవో తెలుసుకొని ఆ యా భాగములకు తడిమట్టికట్లు గాని తడిగుడ్డకట్లు గాని వేసి చల్లగా నున్నంతసేపు నుంచి బాధ గలిగినవెంటనే ఆ కట్లు తీసి క్రొత్తకట్లు కట్టుచుండవలెను. రోగికి బాధ తగ్గుచు మధ్య మధ్య నిద్రకూడ పట్టును. పొత్తికడుపునకు మట్టికట్లు కట్టవలెను. ఆహారమేమియు నివ్వక పూర్తిగా ఉపవాస ముంచవలెను. ఇట్లు ఒకటి రెండు రోజులు చేసిన పిదప రోగికి కొంత శక్తి వచ్చును. పిమ్మట శరీరమంతకు సామాన్యముగను, దెబ్బలు తగిలిన అవయవములకు ప్రత్యేకముగను ఆవిరి బట్టించి, కటిలింగస్నానములను, చేయించవలెను. రోగిని

పూర్ణోపవాసము లుంచిన పక్షమున వారంరోజుల నాటికి నొవ్వులన్నియు సర్దుకొనును. నలిగిన కండరము లన్నియు తిరిగి బాగుపడి వాని యెప్పటి స్థితిస్థాపకశక్తి నవి పొందును. ఒంటికి తగిలినదెబ్బలకు లంకణము లేమిటని ఆలోపతీ వైద్యులు ఆక్షేపించవచ్చును. శరీరమంతయు నలిగినపుడు జీర్ణకోశము పనిచేయదు దానికి పని కల్పించుటచే రోగమును కుదుర్చు శక్తి శరీరమునకు తగ్గును. లంకణముచే జీర్ణకోశమునకు విశ్రాంతి యిచ్చినపుడు శరీరావయవము లన్నియు ఒక్కుమ్మడిగ పనిచేసి నలిగిన కండరములకు రక్తమునిచ్చి యందలి ఎఱ్ఱకణములను నలిగినచోట నంటించి త్వరలో బాగుపరచును. అంతకాలము లంకణము చేయలేని పక్షమున 4 రోజులైనను అధమము రెండు రోజులైనను లంకణము లవసరము. పిమ్మట నారింజకాయలు, లేతకొబ్బరి, గోధుమజావయును ఒకదాని తరువాత నొకటి చొప్పున నివ్వ వలెను. ప్రతి రోజునను నలిగిన అవయవములకు ఆవిరిబట్టి, చన్నీటి ధారాస్నానములు చేయించి తడి రేగటిమట్టికట్లు అవ సరమును బట్టి మార్చుచు కట్టుచు నుండవలెను. బాగుగ తిరుగు వఱకును కటిలింగస్నానములు రోజునకు 3 లేక 4 చేయించు చుండవలెను. ఈ పద్ధతి ప్రకారము చికిత్స చేసిన పక్షమున మందుల వైద్యముకంటె త్వరలోను, అంత కంటె నెక్కువ నమ్మకముగను ఆరోగ్యము దొరుకగలదు.

౪౩ గానుగలలోబడి నలుగుట, మరలలోబడి నలుగుట

అనేకమందికి చేతులు, కాళ్ళు మరలలోబడి నలిగిపోవు,

## ౫౦ విషజ్వరము (Typhoid fever

రొంప పట్టగానే తగు జాగ్రత్తతీసికొనక తిని నిద్రపోవుట వలనను విశేషముగా శరీర మన్యపదార్థముతో నిండి జ్వరమంతయు పైకి కనిపించక లోలోననే యుండగా లంకణము జేయక మందులు వాడుటవలనను అందు ముఖ్యముగా తీవ్రమైన మందులవలన జ్వరము నణచజూచుట వలనను విషజ్వరముగ మారును. వైద్యునకుగాని, మందుపుచ్చుకొను రోగికిగాని మొదటినుండియు మందిచ్చుచున్నను విషజ్వరము లోనికి దిగుటయు సన్నిపాత దోషము గలుగుటయు గలుగుట చేతగాని వైద్యప్రభావము చేతనేయని తోచకపోవుట ఆశ్చర్యమే. రోగమునకు మందిచ్చిన కుదరకపోయినను విషమించ కూడదుగదా! జ్వరము రోగమున్నట్లు తెలుపు వేగుల వాని వంటిదనియు దాని నణచుటకు మందిచ్చుట తప్పనియు దెలిపియున్నాను. జ్వరము లేనిదే రోగములేదు. రోగములేక జ్వరమురాదు. గాన జ్వరమురాగానే లంకణముంచవలెను. నీరసము గలిగినయెడల అది రోగము తీరుగాని ఆహారము కావలసిన నీరసముగాదని తెలియవలెను. ఎన్ని లంకణములున్నను పథ్యమునకు వచ్చునప్పటికి రోగి కూర్చుండుటకు దగినశక్తిని బొందును. చికిత్స-చలియుండిన ఆవిరి పట్టించి చన్నీట స్నానము చేయించి కటిస్నానము జేయించిన యెడల లోనున్న జ్వరము చర్మగతమై చలితగ్గును. జ్వరమెంత యెక్కువగానున్న అంత యెక్కువగా కాలమును సార్లును ఎక్కించి కటిలింగ స్నానములు చేయించవలెను. స్నానము

నుండి లేచునప్పుడు జ్వరము కొంత తగ్గును. స్నానానంతరము తిరిగి చెమటపట్టునట్లు ఉన్నిదుప్పట్లతో ముఖము తప్ప శరీర మంతయు కప్పవలెను. తిరిగి జ్వరము వచ్చుచుండును. ఈ జ్వరమును తరుచు తొట్టి స్నానమువలనను చెమట పట్టించుట వలనను జ్వరము తగ్గించుచుండిన యెడల జ్వరము క్రమముగా తగ్గును. దోషగుణములు తగ్గును. ప్రతిసారియు తొట్టి చేసి నపుడెల్ల కొంతతగ్గి తిరిగి వచ్చుచునేయుండి తిరిగి తగ్గుచుండును. దీర్ఘకాలమును అనేకసార్లును తొట్టి స్నానము లిందవసరము. విరోచన మగుచుండును. దుర్వాసనతో గూడిన విరోచనమైన తోడనే దోషముతగ్గినదని యెంచవచ్చును. మగత మున్నగు దోషగుణములు విరోచనముతో తగ్గును. ఆతప స్నానములుచాల లాభముగా నుండును. చెమటపట్టుటకు సాధనములు లేకున్న నే ఆవిరి పట్టవలెను. సాధ్యమైనయెడల జ్వరము, దుర్గుణములు తగ్గువఱకు నిమ్మరసముపిండిన నీళ్ళుతప్ప ఏమియు ఇవ్వ కూడదు. రోగముయొక్క ఉద్ధృతము తగ్గినదని ధైర్యముగలిగిన పిమ్మటనే నారింజకాయ తియ్యనిదిగాని బత్తాయికాయగాని యివ్వవచ్చును. పిమ్మట కొబ్బరి బోండములోని నీళ్లు గోరు మీగడ ఇచ్చుచు లేచితిరిగి పూర్తిగా జ్వరము తగ్గిన తరువాత గోధుమజావ యివ్వవలెను అపక్వాహారమున కలవాటు పడినవారు లేతకూరగాయలు పళ్లు తినవచ్చును. ఈ రోగము గూడ మనమెంత శ్రద్ధతోపని చేసిన అంత త్వరలో నిమ్మళించ గలదు. మొదటి వారమనియు, రెండవ వారమనియు, టెంపరేచరు హెచ్చుననియు నార్మల్‌కంటె తగ్గుననిగాని భయ మక్కర లేదు.

## ౨౧ నాడీవ్యాధులు (Nervous diseases)

ఈ వ్యాధులు ఈ యిరువదవ శతాబ్దమునందు విశేషముగా తలచూపుచున్నవి. ఇవి ఒక విధముగనుండవు. ఒకడు తన జీవితము వ్యర్థాయని ఆత్మహత్య చేసికొనజూచును. మరి యొకడు వీధివెంట నడచిన ఆకాశము విరిగిపడునను భయముతో వీథులవెంట నడువ భయపడి ఇంటి కప్పులక్రిందనుండి నడచును ఒకనికి సర్వావయవములును క్రమముగ క్షీణించును. వేరొకనికి ప్రపంచకమంతయు తిరుగుచుండును. ఇంకొకనికి దయ్యముపట్టినట్టు వింతచర్యలు తోచును. ఈ విపరీతవ్యాధులు అల్లోపతివైద్యుల పరీక్షకు దొరకవు. రోగి మహా బలవంతునివలె పైకి కనిపించుచుండును. తినును. నీరసము వదలదు. తన దుస్థితి తనకు తెలియును గాన వైద్యుడు రోగములేదనిన నమ్మలేడు, ఇందుకుకూడ అల్లోపతివైద్యమే కారణము. ఇంజక్షనులవల్ల రోగముల నణచి పెట్టుటచే అవయవములు బలహీనములు కాగా వానివద్దనున్న యన్యపదార్థము మందుల ప్రభావమున గట్టిపడి బలహీనములైన అవయవములనే గాక వానితో సంబంధించిన నాడులను కూడ జెరచును. ఈ నాడులన్నియు మెదడునుండి బయలు దేరును. ఈ యన్యపదార్థము వీపునుండి తలకెక్కినప్పుడు మెదడు చెడును గాన ఈ వ్యాధులు కష్టసాధ్యములుగా నొకప్పుడు అసాధ్యములుగను కూడ పరిణమించును. ఐనను నీపికతో చిరకాలము తొట్టిస్నానములజేయుచు అవిదాహి పథ్యముతో లంకణప్రాయముగ దినుచుండిన లాభముగలుగును.

ఈ వ్యాధులు వచ్చుటకు కారణము అనేకములైన జ్వరాది వ్యాధులు అనగా, కీళ్లవ్యాధులు, సుఖరోగములు, వాతరోగములు మున్నగునవి అణచబడుటచే తటస్థించినవి గాన కొంతకాలము అవిదాహిపథ్యముతో ఉపశమన స్నానములు చేయుటచే అణచబడిన వ్యాధులు తిరిగి కనబడుచు బాధలు గలిగించు చుండును. ఈ ప్రక్రియతే curative crises స్వాస్థ్యసంకటములందురు. ఇవి గలిగినప్పుడు భయపడక రోగము హెచ్చినదనియు తొట్టి వైద్యము లాభించలేదనియు తలపక ఓర్పుతో ఆకలిలేకున్న లంకణములుండుచు పట్టుదలతో పని చేసిన గుదరగలవు. స్వాస్థ్యసంకటములు గలిగినప్పుడు భయపడి మందువైద్యులచే మందులుగాని ఇంజక్షనులుగాని తీసికొను వారును గలరు. ఇది కూడనిపని. పుట్టలోనున్నపామును లేపి అది తోకమీద నిలచి ఆడునప్పుడు దానిని మోదబోయిన నది తప్పుకొని కాటువేయునుగదా! అట్లే రోగికి ప్రాణాపాయము రావచ్చును. గాన స్వాస్థ్యసంకటములందు ఆహారముతగ్గించి ఉపశమనస్నానములు విడువక విశేషబాధగలిగిన పార్శ్వము లకు ఆవిరిపట్టి బాధ తగ్గించుకొనుచు రోగమును గుదుర్చు కొనవలెను. ఆసమయమున మందు పుచ్చుకొనక మానినను తొట్టిస్నానములు మానరాదు. మానిన స్వాస్థ్యసంకటములు కనబడవు. అది గుణము కాదు రోగపదార్థము పూర్తిగపోవు టకు జరుగు ప్రయత్నమే ఈ స్వాస్థ్యసంకటము. ఇదిమానిన యెడల రోగపదార్థము శరీరమందే నిల్వయుండును. ఆకారణ మున మనము పడ్డపాట్లన్నియు వృథాయగునుగదా! ఎప్పటి కైనను రోగపదార్థము నెట్టివేయపడక తీరదు. అన్నివైద్య

ములు వదలిగదా తోట్టివైద్యములోనికి వచ్చినది. తిరిగి యీ మందువైద్యములోనికి పోయి యేమి సుఖపడును. గాన కుదురుటగాని మరియొకవిధముగ జరుగుటగాని తటస్థించువఱకు స్నానపథ్యములను యథావిధిగ జరుపుచు ఫలితము నిరీక్షించుచుండవలెను.

## ౫౨ పేరులేని వేర్వేరు రోగములు

ఇంతవఱకు కనివిని యెఱుగని పెక్కు రోగములు కనబడుచున్నవి. అన్నిటికిని కారణ మొక్కటే. నీటిని దానిదారిని పోనిచ్చిన తిన్నగా పల్లముగుండ ప్రవహించును. అడ్డగట్లు వేసిన అనేక శాఖలై అనేకమార్గముల ప్రవహించినట్లే అన్యపదార్థమును మందులచే అణచుటవలన క్రొత్తరోగములు గలుగుచున్నవి. వీట్లన్నిటికిని క్రొత్తరకముల పురుగులు ఉన్నాయని పరిశోధనల జేయుచు వాటి నాశనమునకు క్రొత్తరకములగు విషములు గనిపెట్టుట లాభకారిగాదు. అన్నివిధముల రోగములకును అన్యపదార్థకూడికయే కారణముగాన దానిని వెట్టివేయుటచే రోగ నిర్మూలనమగును. ఆరోగ్యము గలుగును. అందువల్ల ఇతరచికిత్స యెట్లో ఇదియు నట్లే. వేరువిధము లేదు. రోగాద్వైత చికిత్సాద్వైత శాస్త్రమునకు గమ్యస్థానము ఆరోగ్యమిచ్చుటయే. ఏసాధనమున ప్రయత్నించిన జ్ఞాన సంపాదనము నకును తద్వారా మోక్షమును సాధించుటయే గమ్యస్థానము గాన మందులు మార్చనక్కరలేదు. వైద్యవిధానము మార్చనక్కరలేదు. ఈ సాధనములే గమ్యస్థానమైన ఆరోగ్యమును గలుగచేయును.

## తు ది ప లు కు

ఈ చికిత్సా భాగమునందు నాకు స్ఫురించిన కొన్ని కొ రోగములకు చికిత్సను దెలిపితిని. మీరు పూర్తిగ జదువుకొని పత్రమున సమస్తవ్యాధులకును చికిత్సాపద్ధతి ఒక్కటిగను యున్నట్లు బోధపడగలదు. రోగములన్నియు శరీరమందు అన్యపదార్థమును శరీరమునుండి వెలుపలకు త్రోసివేయుట చేయు ప్రయత్నములు. ఆ ప్రయత్నములకు కావలసిన శక్తి శరీరమునకు గలుగజేసి రోగమునకు సహాయము చేయుటకే యీచికిత్స యేర్పడినది. శరీరము బలమునుజెంది అన్యపదార్థమును త్రోసివేసిన వెంటనే రోగము శాంతించును. పిమ్మట జీర్ణకోశము బలము జెందును. కుటరివదలిన ప్రయ్యాపకే జఠరాగ్ని ప్రజ్వరిల్లి తినినపదార్థమును పూర్తిగ జీర్ణము చేసి రక్తముగా మార్చును. సర్వావయవములును బలమును జెంది యుండుటచే రక్తము శరీరమంతటను వ్యాపించి బలము వెంటనే గలుగును. పూర్ణారోగ్యము గల్గునుగాన వేరు వేరు రోగములకు చికిత్సల మార్చుటకు అవసరముగాని, అవకాశముగాని లేదు. రోగముయొక్క నిదానముతో గాని, వేరు వేరు పేర్లుగల రోగములతోగాని నిమిత్తము లేకుండ స్వాభావి కాహారముతో పాటు ప్రకృతి ధర్మముల నవలంబించి, ఉపశమన స్నానముల జేయుటవలన సర్వరోగములును శాంతించును.

ప్రకృతి ధర్మములు:—

1. ఆకలి గలిగిననేగాని భుజించరాదు.
2. స్వాభావికాహారమునే సేవింపవలెను.

3. సర్వరోగములందును జీర్ణకోశమునకు పూర్తిగగాని కొంత వఱకుగాని విశ్రాంతి నివ్వవలెను.
4. ఆకలితో లేవవలెనేగాని హెచ్చుగా భుజింపరాదు.
5. పెందలకడనే నిద్రబోవ్వలెను. పెందలకడనే లేవవలెను.
6. శరీరము నెప్పుడును సుఖపెట్టరాదు. సదా కష్టపడి పని చేయుచునే యుండవలెను.
7. మంచిగాలియు, మంచినీరును సేవింపవలెను.
8. కాఫీ, సోడా, చుట్ట, తాంబూలము మొదలగు చురుకును బుట్టించు పదార్థములను, కల్లు, సారా, నల్లమందు మొదలగు మత్తుపదార్థములను మందులను, వాడగూడదు.
9. మంచిఅలవాట్లను గలిగి, సత్సహవాసము జేయుచు తృప్తి గలిగి, సత్యమునే పలుకుచు నిరాడంబరజీవనము చేయవలెను.
10. పరమాత్మునియందు పూర్ణమైన నమ్మకము గలిగి పరమాత్మునే మనస్సునందు నిలుపుకొని ఆయనయొక్క గుణములను స్తోత్రము జేయుచు సదా ఆయన సమీపమందు వసించునట్లు తలంచుటవలన పాపకార్యములకు భయపడుచు నా పరమాత్ముని గుణములనే మనము అభ్యసింప ప్రయత్నము జేయవలెను. అదియే మానవజన్మము నెత్తినందుకు సార్థకము.

ఓమ్ తత్సత్ బ్రహ్మార్పణమస్తు.



Printed at the Andhra Grandhalaya Press, Bezwada. K9
for Kalapeetham P. I. C. K 37 —500 · 3-10-47